శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి సంపూర్ణగ్రంథావళి

125వ జయంతి ప్రచురణలు

# వేటూరివారి పీఠికలు

మొదటి భాగము

**గ్రంథకర్త**

**శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి**




**ప్రచురణ**

**శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి వాఙ్మయపీఠం**

**తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి**

**2012**

**VETURIVARI PEETHIKALU**

By Sri Veturi Prabhakara Sastri

T.T.D. Religious Publications Series No.



2012

Copies : 1000

Price.Rs...............

Published by

Sri L.V. Subrahmanyam,I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati -517 501

D.T.P. SVPSVP., T.T.D. Tirupati.

Printed at
Tirumala Tirupati Devasthanams, Press.
Tirupati.

ఓం నమో వేంకటేశాయ

# ముందుమాట

**ఎల్.వి. సుబ్రహ్మణ్యం, ఐ.ఏ.ఎస్.** - -2012
కార్యనిర్వహణాధికారి,
తి.తి.దేవస్థానములు,
తిరుపతి.

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు జగద్విఖ్యాత శతావధానులగు శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి గారి శిష్యరికంలో సంస్కృతాంధ్ర సాహిత్యములను అభ్యసించారు. అపారమైన పాండిత్యాన్ని సంపాదించి సుప్రసిద్ధ పండితునిగా, కవిగా, విమర్శకునిగా, పరిశోధకునిగా, బహుగ్రంథపరిష్కర్తగా ప్రసిద్ధిని పొందారు. మాస్టర్ సి.వి.వి గారి యోగసాధనలో సిద్ధులై వారి యోగవిద్యతో వ్యాధిగ్రస్తులైనవారి నెందరినో రక్షించి వారికి ప్రాణభిక్ష పెట్టిన మహనీయులు. మహాతపస్వి.

శ్రీ శాస్త్రిగారు మొదట మదరాసులో తెలుగుపండితునిగా కొంతకాలం పనిచేశారు. పిమ్మట 1910 నుండి 1939 వరకు మద్రాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారంలో తెలుగుపరిశోధక పండితపదవి నలంకరించారు. ఆ 29 సం॥ల కాలంలో వారు పరిశోధకులకు పంటపొలాలన దగిన అముద్రిత గ్రంథ వివరణసూచికలు ( Descriptive Catalogues ) 20 సంపుటాలు నిర్మించారు. శాస్త్రిగారు ఆ కాలంలో స్వయంగా 20కి పైగా ఉత్తమ పరిశోధన గ్రంథాలు పరిష్కరించి ప్రచురించారు. తర్వాత తి.తి.దే ఓరియంటల్ కళాశాలలో ఆచార్యులుగా పనిచేశారు. ఎంతోమంది శిష్యులను పండితులుగా తీర్చిదిద్దారు. వారికి జ్ఞానభిక్షను ప్రసాదించారు.

బహుముఖప్రజ్ఞాశాలి, ఉత్తమ పరిశోధకులు, ఆత్మదర్శనులు, నిరంతర యోగసాధకులు, కవి, రచయిత, శాసన పరిశోధకుడు అయిన శ్రీ ప్రభాకరశాస్త్రిగారి సాహిత్యకృషిని గుర్తించి తి.తి.దేవస్థాన యాజమాన్యం 2007వ సం॥లో శ్వేతభవనంలో "శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి వాఙ్మయపీఠాన్ని"

స్థాపించి, వారు రచించిన ముద్రిత, అముద్రిత గ్రంథాలను తి.తి.దే ద్వారా ప్రచురించి ఆంధ్రసాహితీ లోకానికి అందించడానికి శ్రీకారం చుట్టింది. ఇప్పటివరకు ఈ పీఠం "తెలుగుమెఱుగులు, మీగడతఱకలు, సింహావలోకనము, పూలవిందు, ప్రజ్ఞాప్రభాకరము-గురుపూజ, అన్నమాచార్యచరిత్ర పీఠిక, కేయూరబాహుచరిత్ర, వేటూరి ప్రభాకరశాస్త్రి వాఙ్మయసూచిక" అనే గ్రంథాలను ప్రచురించింది.

ప్రస్తుతం ఫిబ్రవరి 7, 2013 వ తేదీన శ్రీ ప్రభాకరశాస్త్రిగారి 125వ జయంతి సందర్భంగా శాస్త్రిగారి "వేటూరివారి పీఠికలు" అనే గ్రంథము 1వ సంపుటమును శ్రీ ప్రభాకరశాస్త్రి వాఙ్మయపీఠం ద్వారా తి.తి.దేవస్థానం ప్రచురించింది.

ఈ పీఠికా సంపుటంలో శాస్త్రిగారు మనుచరిత్ర, ఉద్భటారాధ్య చరిత్ర, బసవపురాణం, ప్రబంధరత్నావళి మొదలైన గ్రంథాలకు రచించిన పీఠికలు, ఉపోద్ఘాతములు, తొలిపలుకులు, సమీక్షలు, అభిప్రాయాలు చోటుచేసు కున్నాయి. ఇవన్నీ ఎంతో వైవిధ్యం కలిగిన రచనలు. ఇటువంటి శాస్త్రిగారి మహత్తర రచనలు సాహిత్య పరిశోధకులకు చక్కని మార్గదర్శ కాలవుతాయి. సాహిత్య జిజ్ఞాసువులు ఈ పీఠికలను పఠించి మనోవికాసాన్ని పొందగలరు.

శ్రీ ప్రభాకరశాస్త్రిగారి 125వ జయంతి సందర్భంగా ఆవిష్కరింప బడుతున్న ఈ సంపుటములు సాహితీ ప్రియులకు, పరిశోధకులకు, సాహిత్య విద్యార్థినీ విద్యార్థులకు ఎంతో ఉపయోగపడుతాయి. కనుక ఈ గ్రంథాలను సహృదయ పాఠకులందరు చదివి, చదివించి శాస్త్రిగారి సాహితీ సౌరభాలను పదిమందికి పంచిపెట్టగలరని ఆశిస్తున్నాను.

**(ఎల్.వి. సుబ్రహ్మణ్యం)**

# మనవి

(మణిమంజరి ప్రచురణలో ఉన్నది యథాతథం)

శ్రీ ప్రభాకర సంపూర్ణ గ్రంథావళిలో మూడవ కుసుమముగా ఇప్పుడు వెలువడుతున్న గ్రంథము 'వేటూరివారి పీఠికలు'. ఇంతకు మునుపు నీతినిధి, శృంగార శ్రీనాథము వెలువడినవి. అంతకును మునుపు ప్రబంధ రత్నావళి వెలువడినది. ప్రస్తుతము 'వ్యాసమంజరి' 'చాటుపద్య మణిమంజరి' అచ్చులో నున్నవి. ఇవికాక తక్కినవానిని కూడ అచ్చుకూర్పునకు దెచ్చి మరి రెండేండ్లలో రానున్న శ్రీ ప్రభాకర శతజయంతి (1988) నాటికి శ్రీ ప్రభాకర సంపూర్ణ గ్రంథావళిని వెలువరింప జేయవలెనని మా సంకల్పము. ఆంధ్ర పాఠకలోక మందించు సహాయ సహకారములతో మా యీ ఉద్యమము నిర్విఘ్నముగా నెరవేరగలదని ఆశించుచున్నాము.

ఇవేకాక మణిమంజరి ప్రచురరణలుగా ప్రభాకరుల మరికొన్ని రచనలకు కూడ ఇటీవల ముద్రించితిమి. అవి తంజావూరు ఆంధ్రరాజుల చరిత్ర, కామధేనువు కథ, కుమార సంభవము (వ్యాఖ్య-విమర్శ-పాఠపరామర్శ) అనునవి. నీతి ద్విషష్టిక (సంస్కృతము); భగవదజ్జుకము( సంస్కృతము); అచ్చులో నున్నవి. ఇట్లు మణిమంజరి ప్రచురణలుగా శ్రీ ప్రభాకర సంపూర్ణ గ్రంథావళిని వెలువరింపజేయుటలో శ్రీ ప్రభాకర పరిశోధక మండలి నిర్విరామ కృషి సల్పుచున్నది. లోకము దృష్టిని ఈ కృషివైపు ఆకర్షించుటకై వేటూరి ప్రభాకరశాస్త్రి మెమోరియల్ ట్రస్ట్‌వారు 'మణిమంజరి' అను వాఙ్మయ-యోగ-పరిశోధన షాణ్మాసిక సంచికను గత ఐదేండ్లుగా నిర్వహించుచున్నారు. నేటికి అవి పది సంచికలు వెలువడి ప్రజాదరమును బడసినవి. శ్రీ ప్రభాకర శతజయంతిలోగా (1986-87) లో అవి మరి నాలుగు సంచికలు రానున్నవి.

వందరూపాయలు చందా కట్టి ట్రస్టులో మిత్రవర్గ సభ్యులుగా చేరి మాకు చేదోడు వాదోడుగా నున్న సహృదయ మిత్రులందరికి ఆ విలువగల 'మణిమంజరి' సంచిక ( 1984-87) లను ఉచితముగా అందజేయుటేకాక మణిమంజరి గ్రంథ ప్రచురణలనన్నిటిని కోరిన వారికి సగముధరకే లభ్యమగు

నంతవఱకు అందించే యత్నము చేయుచున్నాము. మా ప్రచురణలన్నియు వేయి ప్రతులకు లోపే అచ్చగుచున్నవి. అవి చెల్లిపోయిన పిదప వానిని పునర్ముద్రించు అవకాశము ప్రస్తుత ముండదు. కనుక సాహిత్యాభిమానులు ఆశాభంగము నొందకుండుటకై వేటూరి ప్రభాకరశాస్త్రి మెమోరియల్ ట్రస్టులో మిత్రవర్గ సభ్యులుగా చేరి ఈ అవకాశమును గ్రహించి తమకు వలసిన గ్రంథములకు ఆర్డరు పంపవలసినదిగా వేడుచున్నాము.

ప్రస్తుత గ్రంథమున శ్రీ ప్రభాకరుల గ్రంథ పీఠికలు, ఉపోద్ఘాతములు, తొలి పలుకులు మొదలగువాని నన్నిటిని సేకరించి రచనా కాలక్రమము ననుసరించి ముద్రించితిమి. ఈ సంపుటమున 1910 మొదలుకొని 1928 వఱకు రచితములైన శాస్త్రిగారి పీఠికలు ముద్రింపబడినవి. 1928 నుండి 1950 వఱకు వెలువడిన గ్రంథపీఠికలతో అచిరకాలముననే మఱియొక సంపుటము రానున్నది. సౌకర్యమును ముద్రణ వ్యయమును దృష్టిలో నుంచుకొని వీనినిట్లు కూర్చితిమి.

ప్రభాకరుల పీఠికలతో వెలువడిన గ్రంథములెన్నో ఈనాడు లభించుట లేదు. వానిని యథాతథముగా ఆయా గ్రంథములలో పునర్ముద్రించుట వ్యవసాధ్యము కావున, పీఠికలనేని ఒకచో కూర్చి ప్రకటించిన బాగని తలచి పండితపరిశోధక పాఠకుల ఉపయోగార్థము వీనినిట్లు సంధానించితిమి. ముద్రణలో మేము మార్పులు గావింపలేదు. ఆయా గ్రంథపీఠికలందు వారొ సగిన సూచనలున్న తావుల వానిని విడిగా గుర్తించితిమి. గ్రంథోదాహర ణముల నుద్ధరించిన తావులందు పాఠకుల సౌకర్యమునకై వాని పూర్తి పాఠముల నిందు గ్రహించితిమి. ప్రధానములైన పెద్ద పీఠికలను. రచనా కాలక్రమమున గ్రంథమునందు ముందు చేర్చి తొలి పలుకులలో తక్కువ పుటలున్న వానిని సంస్కృత భాషలో నారగాక్షరములలో నున్న వానిని సౌకర్యము నపేక్షించి పరిశిష్టమున గూర్చితిమి. ఈ పీఠికలను ఇట్లు కూర్చి రచనాకాలక్రమమున ముద్రించుటవలన ప్రభాకరుల రచనలలోని మౌలిక కృషిని, బహుముఖ పాండిత్యవైభవమును, పరిశోధనపాటవమును, శైలీరామణీయకమును, భావరచనాపరిణామమును పాఠకులు గ్రహించుట కనుపడుచున్నది. ఇందు శ్రీ ప్రభాకర పరిశోధకమండలివారి ప్రచురణల నుండియేకాక వావిళ్ల, ఆంధ్రగ్రంథమాల, సరస్వతీ గ్రంథమాల మొదలగు సుప్రసిద్ధ ప్రచురణ సంస్థలవారు ముద్రించిన గ్రంథములకును మున్ను ప్రభాకరులు వెలయించిన పీఠికాదులను స్వీకరించితిమి. ఈ సందర్భమున ఆయా సంస్థలవారి సౌజన్యమును, సాహిత్యసేవను కృతజ్ఞతతో స్మరించి సంభావించుచున్నాము.

నీతిద్విషష్టికకు శ్రీ ప్రభాకరులు సంస్కృతమున వ్రాసిన ఉపోద్ఘాతమును డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడుగారు తెనుగుచేసి సురభారతి పక్షమున ప్రకటించిన 'ఆర్యా' గ్రంథమున ప్రకటించియుండిరి. మేము వారి సౌజన్యముతో ఆ అనువాదమును శాస్త్రిగారి సంస్కృత రచనతోపాటు ఇందు గ్రహించితిమి. వారికి మా కృతజ్ఞతలు.

మేము కోరిన వెంటనే అంగీకరించి ఈ సంపుటమును గూర్చిన ప్రశంసాపూర్వకమగు పరిచయ వ్యాసములనందించిన సుప్రసిద్ధ సాహిత్యా చార్యులు శ్రీ తిరుమల రామచంద్రగారికిని, డా॥ అడపా రామకృష్ణరావు గారికిని కృతజ్ఞతాభివందనము లర్పించుచున్నాము. రచయితల గ్రంథముద్రణ వ్యయమును భరించుటలో తోడుపడు పథకము క్రింద ఆవశ్యకమెరిగి కొంత ఆర్థిక సహాయమందించిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారాలశాఖ వారి సౌజన్యమును కీర్తించుచున్నాము. గ్రంథమును అచిరకాలములోనే అందముగా ముద్రించిన శ్రీ లక్ష్మీ వేంకటేశ్వర పవర్ ప్రెస్సు వారికిని, నాగరాక్షరములలో గల పరిశిష్ట గ్రంథభాగమును బాధ్యత వహించి ముద్రించి వేళ కందించిన ఆర్కెప్రింటర్స్ అధినేత శ్రీ కంభంపాటి సీతారామాంజనేయులు గారికిని మా ధన్యవాదములు అందజేయుచున్నాము.

హైదరాబాదు
11-11-85

-ప్రకాశకులు

# పీఠికార్చన

(మణిమంజరి ప్రచురణలో ఉన్నది యథాతథం)

నాయమాత్మా ప్రవచనేన లభ్యో
న మేధయా న బహునా శ్రుతేన
యమేవైష వృణుతే తేన లభ్యః
తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వామ్.

భగవంతుని పొందడం పాండిత్య ప్రవచనాలతోను, మేధతోను సాధ్యంకాదు. భగవంతుడు ఎవరిని వరిస్తాడో, వారికే లభిస్తాడు; తన స్వరూపాన్ని వివరిస్తాడు – అని ఉపనిషదుక్తి. ఇట్టి భగవదనుగృహీతునికి తక్కినసామాన్య విషయాలు హస్తివదన్యాయంగా కరతలామలక మౌతాయనడానికి నేను దర్శించిన పలువురు మహనీయుల జీవితాలే తార్కాణ. భగవదనుగ్రహమనే ఆ దివ్యశక్తి ఎక్స్‌రే కిరణాలకన్నా మర్మభేదిని. అది వారికి చర్మచక్షురగ్రాహ్యమైన దానిని, మేధాతీతమైన దానిని తృటిలో భాసింప జేస్తుంది; ఇతరులతో వారికి యోజనాల అంతరం కలిగిస్తుంది. అలాంటి శక్తి నిండారిన మహనీయులు గురువర్యులు ప్రభాకరులు.

యోగంలోగాని, యోగేతరవిషయాలలోగాని ప్రభాకరులు సమస్య లను పరిష్కరించడం అపూర్వంగా ఉండేది. ఏదైనా సమస్య వచ్చినపుడు, ఎవరైనా ప్రశ్నించినప్పుడు ఒక్క క్షణం కళ్లు మూసుకొనేవారు. మరుక్షణం వారి ముఖం వేయి బల్బుల కాంతితో వెలిగేది. వెంటనే కళ్లు విప్పేవారు. శాంతి వాత్సల్యాలు కుమ్మరించే ఆ కళ్లనుంచి పృచ్ఛకుడు సమాధానం పొందినట్లే అనుభూతి పొందేవాడు; పరిష్కార మార్గం తనలోనే తోచినట్లు భావించేవాడు. పృచ్ఛకుని ఈ ఆభిముఖ్యం విచిత్రంగా తోచేది. వారి మనన, నిదిధ్యాసనలూ కొనసాగేవి. ఇలాంటి సన్నివేశాలలో వెలువడినట్టివే ప్రభాకరుల వివిధ సారస్వత రత్నసముచ్చయాలు. ఆ సముచ్చయాలలో ఒక భాగమే పీఠికలు.

ఈ పీఠికలను విశ్వనాథ సత్యనారాయణగారు

**" వేటురివారి వ్యాఖ్యలును పీఠికలున్ తెలుగుంబొలంతికిన్**
**పేటులు రేగు గంధవొడివెట్టిన పూతలు....."**



అన్నారు. విషయబాహుళ్యానికి, విస్తృతికేకాక ప్రామాణికతకూ ఈ పీఠికలు పెట్టిందిపేరు. ఈ యుగంలో విస్తృత పీఠికలకు పేరుపొందినవాడు సుప్రసిద్ధ ఆంగ్లరచయిత జార్జ్ బెర్‌నార్డ్‌షా. ఆయన పీఠికలు మూలరచనకు ఇబ్బడిగా ఉంటాయి. దక్షిణ భాషలలో విస్తృత, ప్రామాణిక, విషయ సంభృత పీఠికలకు ప్రభాకరులదే ఒజ్జబంతి అని నా నమ్మకం.

ప్రభాకరులు ఇంతటి విపుల పీఠికలు వెలయించడానికి కారణమూ ఉంది. కలం పట్టినప్పుడెల్లా కలకాలం నిలిచే సత్యాన్ని చెప్పడం వారి ఆశయం. అంతవరకు కాసటబీసటగా వున్న విషయాలను, గాథలను వింగడించి, విమర్శించి, చెప్పడానికి హేతువులు చెప్పాలి. ప్రమాణాలు చూపాలి. తాము సత్యమని నమ్మిన దానిని ఎవ్వరికీ బాధాకరం కాని రీతిగా– సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాత్– గా చెప్పాలి. అయినప్పుడు విస్తృతి తప్పదు. ఇంత విస్తారంగా ఉన్నా అవి విసుగు కలిగించవు. దానికి కారణం, రచనా రామణీయ కమేకాక, విషయవైదగ్ధ్యంకూడ. జిజ్ఞాసువు రచనతోను, విషయ భారంతోను సంతృప్తి చెంది, తన్మయతతోతనిసిపోతాడు. అందువలన, వాటిని ప్రత్యేకంగా ప్రచురించడం జిజ్ఞాసువులకు ప్రయోజనకరమనే దృష్టితో మణిమంజరి ప్రచురణ సంస్థవారు ఆ ప్రయత్నానికి పూనుకుని ఈ పీఠికాసంపుటాన్ని ప్రచురించారు. దీనిలో తంజావూరి చరిత్ర, ప్రబంధరత్నావళి, చారుచర్య, శ్రీకాకుళ శ్రీహరిశతకము, భగవదజ్జుకము, ఉద్భటారాధ్య చరిత్రము, మను చరిత్రము, ప్రతిమానాటకము, బసవపురాణము, బసవోదాహరణము, నీతి ద్విషష్టిక, కర్ణభారము, మధ్యమవ్యాయోగము, చాటుపద్య మణిమంజరి, భగవదజ్జుకము (సంస్కృతం); నీతిద్విషష్టిక (సం.) పీఠికలు ఉన్నాయి. ఇవి రచనా కాలానుగుణంగా ప్రచురితాలు. ఇలా చేయడం వల్ల పాఠకులకు ప్రభాకరుల పీఠికా రచనా క్రమపరిణామ వికాసాలు తెలుస్తాయి.

**తంజావూరి చరిత్ర పీఠిక** :– కృష్ణరాయల రాయబారులైన నాయకులు తంజావూరు, మధుర రాజ్యాలను ఏలారు. అప్పుడు తెలుగు సరస్వతి దక్షిణాన ముత్యాల పల్లకి ఎక్కి మురిసిపోయింది. దక్షిణ దేశంలో పుట్టిన తెలుగు ప్రబంధాలు వందల వందలు. వాటి ముక్కు మొగం చూడక కొందరు వెక్కి రించారు. అవి మంచి ప్రబంధాలు కావని. దానికి కారణం పెక్కు దక్షిణాది

కావ్యాలు ప్రచారంలో లేకపోవడమే. అలాటి విమర్శకుల "మాటలు మనం పాటించరాదు. మంచికాలం వస్తుంది. అందరూ వాటివల్ల ఆనందిస్తారు" అన్నారు ప్రభాకరులు. కనుకనే ఈ పీఠికలో ప్రభాకరులు తంజావూరు నాయకరాజ్యస్థాపన చరిత్ర మొదలయిన వివరాలతో పాటు సాహిత్య చరిత్ర కూడ తెలుపవలసివచ్చింది.

ప్రమాణం లేందే పలుకైనా కాయితం మీద పెట్టని నియమం ప్రభాకరులది. కనుక, తాము చెప్పిన ప్రతిచారిత్రకాంశానికీ, సమకాలిక సాహిత్యం నుంచి, శాసనాల నుంచి ప్రమాణాలు చూపారు. అచ్యుతప్ప నాయకుని మంత్రి గోవింద దీక్షితులు. ఇతడు మహామంత్రజ్ఞుడు, మహాకవి, మహాగాయకుడు, మహాయజ్వ. అచ్యుతప్ప నాయకుడు సాక్షాత్తు శ్రీరంగేశుడనే వర్ణించాడు చేమకూర వెంకటకవి. వారిద్దరిని గురించి ప్రభాకరులిచ్చిన ఒక అనుష్టుప్పును మాత్రం పేర్కొనక తప్పదు.

**"త్రినామాద్యంత నామానౌ మహీక్షిద్దీక్షితా వుభౌ,**
**శస్త్రే శాస్త్రే చ నిపుణౌ ఆహవేషు హవేషు చ.**

అచ్యుత, అనంత, గోవింద అనే నామములకు త్రినామ నామత్రయ సంజ్ఞలు గలవు – ( ఆ నామములలో మొదటిది అచ్యుతనామం. అచ్యుతప్పనాయకుడు. చివరిది గోవిందనామం – గోవింద దీక్షితులు) రాజుకు దగిన మంత్రి, మంత్రికి తగినరాజు... ఈయన సాగ్ని చిత్య సర్వతోముఖాతిరాత్ర సాగ్ని చిత్యాప్తవాజపేయాది యజ్ఞములు చేసినాడు... సంగీతసుధ ఈ మహాత్ముని ఆజ్ఞమీదనే రఘునాథరాయలు రచించెను. దాని పీఠిక ఈయన రచించినదే. వేద శాస్త్రాలు చదువుకొని యజ్ఞాలు చేసిన శ్రోత్రియ పండితునికి సరస కవిత్వము, సంగీత విద్యయెట్లా అబ్బినవో! మంత్రిత్వం ఎట్లా నిర్వహించినాడో! ఆహా !"

అచ్యుతప్పనాయకుని కుమారుడు రఘునాథనాయకుడు. ఇతడు మహావీరుడేకాక, నాట్య సంగీతాది సకలశాస్త్రజ్ఞుడు. గోవింద దీక్షితుల జ్యేష్ఠ పుత్రుడు, మహావిద్వత్కవి, సాగ్నిచిత్సర్వక్రతు యాజి యజ్ఞనారాయణ దీక్షితులు తాను రఘునాథరాయల శిష్యుణ్ణని చెప్పుకొన్నాడు. రఘునాథరాయలు మధుర



నాయకులను జయించాడు; నేపాళ భూపాలస్థాపనాచార్య అనే బిరుదుకూడ ఇతనికుంది."మరిన్నీ ఇంతకు ముందే ఈ రఘునాథనాయడు పారశీకరాజుకు, నేపాలరాజు ఓడిపోయి తన్ను శరణువేడగా అభయమిచ్చి యుద్ధంలో ఆ పారశీకుణ్ని ఓడించి నేపాలరాజును తిరిగి రాజ్యమున నిలిపినట్టు బహు గ్రంథాలలో కలదు. ఆ సందర్భంలోనే రఘునాథరాయలు సముద్రంలోని పట్నం ఒకటి సంపాదించినాడట. పారశీకరాజు, నేపాళరాజు అంటే ఎవరో! తురకరాజులయియుందురేమో!" అని ప్రభాకరులు ఆలోచనలో పడ్డారు. అప్పటికి తగినన్ని చారిత్రకాధారాలు లేనందున వారు అలా భావించారు. ఈ నేపాళం ఉత్తరాన హిమాలయోపత్యకాలలో వున్న నేపాళం కాదు; సింహళ ద్వీపంలో వున్న యాళ్పాణం. దీనికి 'జాఫ్నా' అని వ్యవహారం. యాల్పాణరాజు కథ నిజమైనది. తమిళ భాషలోని యాళ్పాణం తెలుగులో నేపాలమయింది.

ప్రభాకరులు రఘునాథనాయకుని వైభవాన్ని, ఆతనికాలంలో తెలుగు సరస్వతి సంతరించుకొన్న కొత్త అందచందాలను తెలిపే సమకాలిక రచయిత్రులు రంగాజమ్మ మొదలయిన వారిని గురించి పెక్కు అపూర్వ విషయాలు తెలిపారు.

నాయకరాజులు తమ దైనందిన చర్యలోను, రాజ్యపరిపాలన చర్యలోను పూర్తిగా విజయనగరసార్వభౌముల సంప్రదాయాన్ని అనుసరించారు. తిరుమల కొండమీద ఆనివార్ ఆస్థానం అనే ఉత్సవం ఏటా జరుగుతుంది. దానిని విజయ నగర సార్వభౌములు ప్రవేశపెట్టారు. ఆ ఉత్సవంలో దేవస్థానం ప్రధానాధికారి శ్రీ వేంకటేశ్వరునికి సంవత్సరం ఆదాయం వ్యయం లెక్కలు వినిపిస్తాడు. విజయనగర సార్వభౌములు తమను వేంకటేశ్వర సేవకులుగా భావించడం వల్ల, తమ ఏడాది లెక్కలను పెరుమాళ్లకు వినిపించేవారు. అది కాలక్రమాన దేవాలయోత్సవంలో ఒకటయింది. నాయకరాజులు విజయనగర సార్వభౌమ సామంతులు గనుక ప్రతిదినమూ ఆదాయ వ్యయాలు ఆస్థానంలో వినే పద్ధతిని అనుసరించారు. రఘునాథ నాయకుని కుమారుడు విజయరాఘవనాయకుడు రచించిన రఘునాథాభ్యుదయ నాటకంలోని జమాఖర్చు లెక్కలను ప్రభాకరులు ఈ పీఠికలో ఉదాహరించి చరిత్రకారులకు కనువిప్పు కలిగించారు.

"అట్టవణ రంగయ లెక్క వినిపించుట:– చిదంబరనాథ మొదలారి మీద మూడు లక్షలమాళ్లకు చెల్లు రెండు లక్షలున్ను, ముప్పై అయిదువేలుగాక పార్వ్వనిల్వ పదిహేనువేలున్ను, శుద్ధనిల్వ యాభైవేలున్ను, అంతు నిల్వ అరవై వేలున్ను, కుబుసం లక్ష్మయ్యమీద మణియం మనోవర్తి రెండులక్షలున్ను, యాభైవేలకు రొఖ్ఖ చెల్లు లక్షయాభైవేలు. ధాన్యాలచెల్లు యాభైవేలు అంతు రెండు లక్షలుగాక నిల్వ యాభైవేలు. నాచమాళిమీద కరతొరలు లక్షవరహాలకు రొఖ్ఖ చెల్లు యెనభైవేలు కాక నిల్వ యిరవైవేలు. కోనేటిపిళ్లమీద సుంకం పద్ధెనిమిది వేలకు చెల్లు పన్నెండు వేలుకాక నిల్వ ఆరువేల మాళ్లు. అంతు నిల్వ లక్షాయెనభై యొక్కవేల మాళ్లు."

తెలుగును అధికార భాషగా తీర్చిదిద్దదలచుకొన్న పెద్దలు విజయనగర, తంజాపుర, మధుర తెలుగు పాలకుల పరిపాలన వాణిజ్యాది పారిభాషిక పదాలను గ్రహించడం అవసరం. ఈ తొమ్మిది పంక్తుల లెక్కల వక్కణంలోని పదాలు శుద్ధనిల్వ, రొఖ్ఖచెల్లు, కరతొరలు, అంతునిల్వ ఎంత సహజంగా జనంలో ప్రాకాయో ప్రభాకరులు చెప్పకనే చెప్పారు.

ప్రభాకరులు ఈ పీఠికలో తెలిపిన " ప్రధానులు దిన చర్యలు చదివిన" కమ్మవక్కణం ద్విపదలో వున్నా, నిత్యవ్యవహారానికి ఎంత సన్నిహితమో తరచిచూస్తే ఆశ్చర్యమవుతుంది. "ఇటువలె గడచిన దక్కడి కార్య, మటుగాన నెఱిగుండ నవధరించేది" అని ఈ కమ్మ సమాప్తమౌతుంది. ఎంత సరళ సుందరం!

గ్రంథ పరిష్కరణ అసిధారావ్రతం. వేయి కళ్లతో చూచి చేసినా, 'తన మతానికి అనుగుణంగా దిద్దేసినాడు పాఠాలను; విషయాన్ని' అని విసుర్లు విసిరే వారు ఉండనే వుంటారు. కనుక ప్రభాకరులు "ఈ ప్రచురించిన అసలు కథా వృత్తాంతం చెన్నపురి లైబ్రరీలో వున్నది. హెచ్చులు తగ్గులు చేయలేదు. కాని, కొత్తచేసినాను. భాషా స్వరూపం పాడు చెయ్యలేదు. ఇందులో కథలవంటి సందర్భములు కొన్ని ఉన్నవి. ముక్కరవృత్తాంతం మొదలయినవి. నేను తీసివేయలేదు.." అని తమకృషిని నిష్కపటంగా చెప్పుకొన్నారు.

తెలుగువారు ఎక్కడమెట్టినా తమజాతి కీర్తిని గుట్టలుగా పేర్చారు. దక్షిణాంధ్రుల భాషాసాహిత్యసేవ గొప్పది; రాజుల హృదయం బహుదొడ్డది.



ప్రభాకరులు వారి చరిత్రను యథాతథంగా విషయతుందిలమూ, మౌలికమూ అయిన విపుల పీఠికతో ప్రచురించి తెలుగు జాతికి ఆనాడు చేసిన మహోపకారం దక్షిణాంధ్రులపై అనంతర కాలంలో పెక్కు పరిశోధనలకు నాందిగా విరాజిల్లింది.

**ప్రబంధరత్నావళి పీఠిక** :– ప్రాచీన కవుల కావ్యాలు చదువు తున్నప్పుడు, రసవంతమయిన పద్యాలను గుర్తుపెట్టుకోడం, అవి విస్మృతం కాకుండ వాడుకోడం సహృదయుల అలవాటు. ఈ అలవాటు సంధాన గ్రంథాలకు మూలమయింది. సంస్కృత వాఙ్మయంలో శార్‌ఙ్గధరపద్ధతి, బిల్హణుని సూక్తిముక్తావళి, వల్లభదేవుని సుభాషితావళి, సుభాషిత రత్న భాండాగారం మున్నగు సంధాన గ్రంథాలున్నాయి. వాటివల్ల పలువురు అపూర్వకవులరచనలు తెలియవస్తాయి. ఆ కావ్యాలు పూర్తిగా లభింపక పోయినా, ఈ సంధానగ్రంథాలలోని భాగాలవల్లనయినా, ఆ కవులు, కావ్యాలు జనం నాలుకలపై నాట్యమాడే అవకాశముంటుంది.

తెలుగులో ఈలాంటి సంధానగ్రంథాలను తొలిసారిగా ప్రచురించిన వారు సుగృహీత నామధేయులు మానవల్లి రామకృష్ణకవిగారు. అవి ప్రయోగ రత్నాకరము, సకలనీతి సమ్మతము, ప్రబంధమణి భూషణము అనేవి. ప్రభాకరులకు తంజావూరు సరస్వతీమహలు పుస్తకభాండాగారములో ప్రబంధరత్నాకరము అనే సంధాన గ్రంథము – సంకలన గ్రంథం లభించింది. దీని సంధాత పెదపాటి జగన్నాథకవి 1620 నాటివాడు. కృష్ణాజిల్లాలోని పెదపాడు వాస్తవ్యుడు. సంధాత దీనిని ఐదాశ్వాసాలదిగా రచించాడు. కాని, లభించింది మూడాశ్వాసాల వరకే. కాకినాడలోని ఆంధ్రసాహిత్య పరిషత్తులో మరొక సంకలన గ్రంథం లభించింది. దానికి మొదలు తుద లేవు. పేరు "ఉదాహరణ పద్యములు" అని వుంది. ప్రభాకరులు ఈ రెండింటినీ కలిపి ప్రబంధరత్నావళి అనే పేర ప్రచురించి తెలుగు సాహిత్యానికి అపూర్వసేవ చేశారు. ఈ రెండింటిని గుదిగుచ్చడంలో వారు అనుసరించిన పద్ధతిని ఇలా చెప్పుకొన్నారు. " ఈ యిర్వుర కూర్పులందలి పద్యములను గ్రుచ్చి యెత్తి నే నీ ప్రబంధరత్నావళిని గ్రొత్త వెలయించితిని. పై యిరువుర సంధానము లందుండినను నిప్పటికి ముద్రితములై సుప్రసిద్ధములై దొరకుచున్న నన్నయాదుల భారతాదులలోని పద్యముల నిందు జేకొనలేదు. కవులను,

గావ్యములందలి పద్యములను గూడ నకారాద్యక్షర క్రమమునకు దార్చితిని. భాషాచరిత్రాద్య పేక్షుల కీ చేత మిక్కిలి సాహాయ్యక మగునని చక్క జర్చించియే సల్పితిని."

ఈ సంకలన గ్రంథం వల్ల అప్పటికి కవి చరిత్రలో చేరని అన్నమాచార్యులు మున్నగు పలువురు ప్రాచీనకవులు వెలుగులోకి వచ్చారు. కవుల కాలాదులు నిర్ణయించడంలో ప్రభాకరుల నిర్భీక న్యాయప్రవృత్తి స్పష్టమవుతున్నది. "వికృతి వివేకమనియు, త్రిలింగ శబ్దానుశాసనమనియు సంస్కృతమున రెండాంధ్ర వ్యాకరణ గ్రంథము లితని (అథర్వణుని) పేర గానవచ్చుచున్నవి. ఈ రెండును నథర్వణుని పేర నిటీవల గల్పింపబడినవే యని యూహ. శ్లేష సఖండ నిర్బింద్వో రిత్యాది లక్షణము లుండుటను బట్టి యాయూహ యుక్తమకా దోచుచున్నది. అరయగా సంస్కృతముననున్న యాంధ్రవ్యాకరణములన్నియు గొంత యసత్య కల్పనముతో గూడినవిగనే కన్పట్టును" అని వారు చెప్పినది అక్షరాల సత్యం. లిపి పరిణామ దృష్టితో ఖండబిందువు చిహ్నం చాల ఇటీవలిది. శాసనాలలో కనిపించదు.

"రా. బ. కందుకూరు వీరేశలింగము పంతులుగారు ప్రమాణ మకలంకస్య పూజ్య పాదస్య లక్షణం" అని వికృతి వివేకమున బేర్కొనబడిన యకలంకుడు కర్ణాటక వ్యాకరణము రచించిన యకలంకుడనియు, నాతడు క్రీ. శ. 1604 లో నుండెను గావున, నది యహోబల పండితుని కాలముననే సృష్టింపబడెననియు గ్రొత్త వెల్వరించిన కవులచరిత్రమున విశేష విషయము చేర్చినాడు. ఇది సిద్ధాంతము కానేరదు." అని ప్రభాకరులు వీరేశలింగంగారి వాదాన్ని నిర్ద్వంద్వంగా ఖండిస్తూ ప్రాకృత వ్యాకరణకర్తలలో పూజ్యపాదుడు ప్రాచీనతముడున్నాడని, అతడే అహోబలునిచే పేర్కొనబడిన వాడని నిరూపించారు.

నన్నెచోడడు సోమనకు సమకాలికుడై వుంటాడు. దానికి పండితారాధ్య చరిత్రలోని నన్నెచోడుని కుమారసంభవంలోని పెక్కు ఘట్టాలు సంవదిస్తుండడం ప్రభాకరులు తొలిసారిగా చూపారు. "చన సత్యాశ్రయుని దొట్టి చాళుక్య నృపుల్" అన్న పాఠాన్ని రామకృష్ణకవిగారు "ఎక్కడి ప్రతి నుండి సంపాదించినారో?" అని ప్రభాకరులు వేసిన ప్రశ్న నేటికీ ప్రశ్నగానే మిగిలింది. నిజానికి నన్నెచోడుని కుమార సంభవం ఏకైక ప్రతే లభించింది; నాటికీ నేటికీ మరొక ప్రతే లభించలేదు.



కవిజనాశ్రయం వేములవాడ భీమకవి కృతం కాదన్న భావాన్ని ప్రభాకరులు ఈ పీఠికలో సుదీర్ఘచర్చలో స్పష్టపరిచారు. జయంతి రామయ్యపంతులు గారు ముప్పై నలభై కవిజనాశ్రయం వ్రాతప్రతులలో కానరాని, ఒక్క ప్రతిలో మాత్రమే ఉన్న అవతారికా పద్యాలతో పుస్తకాన్ని ప్రచురించి "ఈ యవతారిక యొక్కప్రతిలో మాత్రముండుటచే బ్రక్షిప్తమని తోపవచ్చునుగాని, కవితా వైఖరిబట్టి చూడ నది ప్రక్షిప్తము కాదనియే నా నమ్మకము" అని అన్న మాటలను ప్రభాకరులు "పంతులుగారి యీ నమ్మక మసమర్థమని నా నమ్మకము. అనంతుని ఛందమందలి మొదటి పద్యమే యీషద్భేదముతో నీ యవతారికకు మొదటి పద్యముగా నున్నది" అని మృదువుగా, గట్టిగా ఖండించడం చాల సమంజసంగా ఉంది. భీమన కవిజనాశ్రయకర్త కానేరడని వారు కంఠోక్తిగా చెప్పారు.

కవిజనాశ్రయం రేచన కృతమనడంలో సందేహంలేదు. రేచన నన్నయకు దాదాపు వంద సంవత్సరాలకు పూర్వుడు. ఇటీవల డాక్టర్ నేలటూరి వెంకటరమణయ్యగారు కనుగొన్న గంగాధర కన్నడ శాసనంలో తొలి కన్నడ కవి పంపని తమ్ముడు జినవల్లభుడు చెప్పిన విషయాలు తెలుగు కన్నడ భాషాసాహిత్య చరిత్రలపై గొప్ప వెలుగును ప్రసారించాయి. పంపసోదరుల తండ్రి భీముడు. జినవల్లభునికి వాచకాభరణుడు మున్నగు బిరుదులున్నాయి. ఇవి కేవలం జైనులవే. ఇవి కవిజనాశ్రయంలోను ఉన్నాయి. భీమ సుతుని సహాయంతో ఆతని ప్రీతికి నేనీ ఛందస్సు చెబుతున్నానని రేచన చెప్పాడు. అంత్యప్రాసలో భీమసుతుణ్ని బిగించాడు. కనుక రేచన పంపని సాహాయ్యంతోనో, జినవల్లభుని సాహాయ్యంతోనో ఈ ఛందస్సు రచించాడనడం స్పష్టం. జినవల్లభుడు ఆ కన్నడ శాసనంలో తెలుగు యతినియమంలేని నాల్గైదు తెలుగు కందాలు కూడా రచించాడు. కనుక నన్నయకు వందేళ్లముందే తెలుగునాట తెలుగు కవిత వెలసిందనడం స్పష్టం. ప్రభాకరులు ఆరు దశాబ్దాలకు పూర్వమే కవిజనాశ్రయం భీమన రచన కాదనడం వారి నిశిత పరిశీలనకు తార్కాణ. కవిజనాశ్రయ కర్తృత్వం గురించి సుప్రసిద్ధ ఐతిహాసికులు డాక్టర్ పుచ్చా పరబ్రహ్మశాస్త్రిగారు శాసనాద్యాధారాలు సేకరిస్తున్నారు. దానితో నన్నయకు పూర్వం తెలుగు కవులు ఎవరూ లేరన్న సిద్ధాంతం పరాస్తమవుతుంది. కొందరికిది కష్టమైనా, సత్య జిజ్ఞాసువులకు సంతోషకరమవుతుంది.

"శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు వల్లభరాయడు రచించినట్టున్న

క్రీడాభిరామమను వీథినాటకమే శ్రీనాథుని వీథినాటకము కావచ్చుననిరి. శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారది యతిసాహస మనిరి. నానిశ్చయము తప్పక యది శ్రీనాథకృతి యగునని; కారణసామగ్రి పుష్కలముగా నున్నది." అని ప్రభాకరులు అన్నారు. శ్రీనాథుడు దానిని సంస్కరించి వుండవచ్చు; లేక వల్లభరాయడే శ్రీనాథుని అనుకరించి వ్రాశాడేమో!

సుప్రసిద్ధ చరిత్రకారులు శ్రీ వేదం వేంకటరాయశాస్త్రి (ఎం.ఏ) గారు క్రీడాభిరామం వ్యంగ్యకావ్యమన్నారు. వల్లభరాయడు విజయనగరరాజుల మిత్రుడు. రెడ్డిరాజులకు అతనికి పడదు. ప్రతి ఆస్థానానికి తిరుగుతూ, అందరినీ పొగడుతూ రెడ్డిరాజులకు అవచి తిప్పయ్యసెట్టిద్వారా ధనసాహాయ్యం చేయిస్తూన్న శ్రీనాథుని, అవచి తిప్పయ్యసెట్టిని పాత్రలుగాచేసి వారిని వట్టి కాముకులు అని ఈసడించడానికి క్రీడాభిరామాన్ని శ్రీనాథుని శైలిలోనే వల్లభ రాయడు రచన సాగించాడని శ్రీ వేదం వారి వాదం. ఇది కొత్తగా వున్నా పరిశీలించవలసివలసిందే. ఇదే నిజమైతే క్రీడాభిరామం తొలి వీథి కావడంతోపాటు తొలి ఉత్ప్రాసకావ్యమూ అవుతుంది.

**చారుచర్య పీఠిక** :- అప్పనమంత్రి చారుచర్యను ప్రభాకరులు ప్రచురించిన తీరు చాల కుతూహలకరం. తంజావూరు, ముక్త్యాల, ఆంధ్రసాహిత్య పరిషత్తులలో లభించిన వ్రాతప్రతులను పరిశీలించి ఎంతో శ్రమపడ్డారు. అప్పన మంత్రి నన్నయ్యకు అనంతరం పావులూరి మల్లన కాలంవాడు కావచ్చునని సాహిత్య చరిత్రకారులు అభిప్రాయ పడ్డారు. నన్నయ తర్వాత శాస్త్రగ్రంథానువాదం కొంతకాలం కొనసాగింది. వైద్యనీతి ధర్మశాస్త్రాలకు అవిరోధంగా మానవుడు జీవించే విధానాన్ని తెలిపే ఈ చారుచర్యను ప్రచురించి ప్రభాకరులు ఆంధ్రావళికి మహోపకారం చేశారు. దీనిమూలం భోజమహారాజు సంస్కృత చారుచర్య.

**శ్రీకాకుళ శ్రీహరి శతక పీఠిక** :- కృష్ణరాయలను ఆముక్తమాల్యదా రచనకు ప్రబోధించినవాడు శ్రీకాకుళ విభుడు. ఇతనికి ఆంధ్రవల్లభుడని, తెలుగురాయడని పేర్లున్నాయి. కృష్ణరాయలు కళింగ విజయానికి దండెత్తిపోయి నప్పుడు విజయవాడలో కొంతకాలం విడిచి శ్రీకాకుళ క్షేత్రానికి వెళ్ళి, ఏకాదశి నాడు ఆంధ్రనాయక స్వామిని సేవించుకొని, కైంకర్యము జరిపి శాసనం వేయించాడు. విశిష్టాద్వైత ప్రవర్తకులైన వేదాంత దేశికులకుమారులు



వరదాచార్యులవారు సర్వజ్ఞసింగభూపతి ఆస్థానంలో సన్మానితులైనప్పుడు శ్రీకాకుళం దర్శించి ఆంధ్రనాయకుని స్తోత్రంచేశారు. రాయల కాలం వరకు ఈ క్షేత్రం మహావైభవంతో విరాజిల్లింది.

ప్రభాకరులు ఈ పీఠికలో అధర్వణాచార్య కృతముగా త్రిలింగ శబ్దానుశాసనమనే పేరుతో ఉపలబ్ధమవుతున్న వ్యాకరణ గ్రంథంలో ఈ క్షేత్రం గురించి వున్న శ్లోకాల సాధుత్వాసాధుత్వాలను, సంస్కృతంలో వున్న శ్రీకాకుళ క్షేత్ర మాహాత్మ్యాలను, పద్యకావ్యాలను చర్చించారు. ఇదెప్పుడూ ఆంధ్రరాజుల రాజధానిగా లేదని నిర్ధారణగా చెప్పారు. ఆంధ్ర నాయక పదానికి సంస్కృత క్షేత్ర మాహాత్మ్యంలో ఇచ్చిన పెక్కు నిర్వచనాలను చర్చించి ప్రాచీన కాలంలో ఆంధ్రపదమే కాని, ఆంధ్రపదంలేదని, కనుక ఈ వ్యుత్పత్తులు "నవీనములని" వారు అన్నారు.

ఈ ఆంధ్ర నాయకుడు స్థానిక దేవత అయి వుంటాడని నా అభిప్రాయం. పెక్కు స్థానిక దైవాలు మత సామరస్యోద్యమంలో వివిధ సంస్కృతి సమ్మేళనోద్యమంలో శివకేశవరూపాలు దాల్చినట్టే ఈ తెలగన్న- తెలగయ్య - తెలుగు రాయడు విష్ణువయ్యాడేమో ! పెక్కు జైన దైవాలు విష్ణువుగాను, బౌద్ధ దైవాలు శైవమూర్తులుగాను మారాయి. ఉదాహరణకు. బెజవాడ కనకదుర్గను చెప్పవచ్చు. ఈమె బౌద్ధుల తార. కృష్ణాతీరంలోని పోతలకలో (పోతర్లంకేమో?) అవలోకితేశ్వర తారల పూజ జరుగుతున్నదని చైనా గ్రంథాలలో వుందట. అవలోకితేశ్వరపూజ తొలిసారిగా ఆంధ్రదేశంలో ఆరంభమై ఇతరత్రా వ్యాపించింది. ఈ తార బౌద్ధమతం క్షీణించిన తర్వాత శాక్తుల దేవత అయి స్థానికుల దేవత అయి వుంటుంది. తారాదేవికి అవలోకితేశ్వరునికి బంగారుపూత పూయడం ఆచారంగా వుండేది. దానినిబట్టి బంగారమ్మ అనో, పైడమ్మ అనో, స్థానిక సామాన్యులు వ్యవహరించి వుంటారు. వామాచారపూజలందుకుంటున్న ఈ దేవతను శంకరాచార్యులో తదను యాయులో వామాచారపూజ నుంచి తప్పించినట్లు చెబుతారు. అప్పటికి ఆమె దుర్గ అయింది. బంగారమ్మకు సంస్కృతీకరణం కనకదుర్గ. ఇలా స్థానిక దేవతలు మారుతున్నందున తెలుగున సంస్కృత వేషంలో ఆంధ్రనాయకుడయి వుంటాడు.

**భగవదజ్జుక పీఠిక** :- భగవదజ్జుక మనేది సంస్కృత ప్రహసనం. ఇది క్రీస్తుశకం ఆరవ శతాబ్దినాటిది. దీని కర్త బోధాయనుడు. అప్పటికి

ప్రబలముగా నున్న బౌద్ధమతాన్ని వెక్కిరించి వేద మతాన్ని ప్రచారం చేయడం ఈ ప్రహసనోద్దేశం. ప్రసక్తానుప్రసక్తంగా సాంఖ్యయోగ వైద్యశాస్త్రాదుల వాక్యాలు ప్రస్తావించబడినవి.

బోధాయనులు ముగ్గురున్నారు– కల్పసూత్రకారుడు, రామానుజులు తమ బ్రహ్మసూత్రభాష్యానికి – శ్రీభాష్యానికి – మూలకల్పమని పేర్కొన్న బ్రహ్మసూత్రవృత్తిని రచించిన వాడు, భగవదజ్జుకకారుడు. ప్రభాకరులు ఈ విషయం సుదీర్ఘంగా దర్శించి భగవదజ్జుకకారుడు ఈ ప్రహసనంలో రుద్రుని పేర నాంది వుండడం, యోగ దర్శనానికి ప్రాముఖ్యముండడం, విశిష్టాద్వైత సిద్ధాంతవాసన లేకపోవడం మున్నగు కారణాలవల్ల రామానుజులు ఆదరించిన బోధాయనుడు కాకపోవచ్చునని, ప్రహసనంలో శాంతికపౌష్టిక శ్రౌతకర్మల ప్రాధాన్యం లేనందున కల్పసూత్రకారుడు కాకపోవచ్చునని, బోధాయనుని పలువురు కవిగా పేర్కొనడం వల్ల ఇతడు మరొకడయివుంటాడని అన్నారు.

కాని, రామానుజులు మొదట అద్వైతియేకదా! గురువుగారితో అభిప్రాయభేదం ఏర్పడి, విష్ణుసర్వోత్తమత్వ, విశిష్టాద్వైత ప్రవర్తకులయ్యారు. బోధాయనుడు ప్రహసనం రచించిన కాలానికున్న భావాలను, మతాన్ని తర్వాత ఎందుకు మార్చుకొని వుండరాదు?

ప్రభాకరులు దీనిని చక్కని తెలుగులో అనువదించారు. వారే అన్నట్లు మూలగ్రంథం మిక్కిలి హృద్యం. అనువాదం మహోదాత్తంగా వుందని చదివిన వాడిని గనుక చెప్పగలను.

**ఉద్భటారాధ్య చరిత్ర పీఠిక** :– ఉద్భటారాధ్య చరిత్రను తెనాలి రామలింగకవి రచించాడు. రామలింగడు వైష్ణవమతం స్వీకరించిన పిదప రామకృష్ణుడయ్యాడు. ఈ విషయాన్ని ప్రారంభంలో కొందరు నమ్మలేదు. ప్రభాకరులు కూడ ప్రబంధరత్నావళి పీఠికలో "రామకృష్ణుడు వేఱు, రామలింగడు వేఱుగా మా. రా. కవిగారు వ్రాసినారు సత్యము కావచ్చును" అని సందేహించారు. ఇది 1918 జనవరి 9వ తేదీ నాటి అభిప్రాయం. ఉద్భటారాధ్య చరిత్ర పీఠిక రచనాకాలం 1925. అప్పటికి వారికి ఇద్దరూ ఒకరేననే ఉపపత్తులు చాల దొరికాయి. కనుక ఒకరేనని సిద్ధాంతీకరించారు.

రామకృష్ణుడు రామలింగడుగా ఉన్నప్పుడు ఉద్భటారాధ్య చరిత్ర రచించాడు. వైష్ణవమతం స్వీకరించిన పిదప పాండురంగ మాహాత్మ్యం,



ఘటికాచల మాహాత్మ్యం రచించాడు. ఉద్భటారాధ్య చరిత్ర, పాండురంగ మాహాత్మ్యం అవతారికలను ప్రభాకరులు తైఫారుచేసి, ఇరువురు కౌండిన్య గోత్రులు, శుక్లయజుర్వేదులు, ఇరువురి తండ్రిపేరు రామయ్యే, తల్లిపేరు లక్ష్మమ్మ. రామలింగడు కుమారభారతీ బిరుదాభిరాముడు. రామకృష్ణుడు శారదా స్వరూపుడని కీర్తితుడు. కాని, రామలింగని గురువు పాలగుమియేలేశ్వరుడు; రామకృష్ణుని గురువు భట్టరు చిక్కా చార్యులు. ఆశ్వాసాంత గద్యాల తీరు భిన్నం. ఇవి రెండూ మతం మార్పువల్ల కలిగినవేనని ఇద్దరు వ్యక్తులూ ఒక్కరేనని ప్రభాకరులు ఉపపత్తి చెబుతూ, ఇందుమతీ పరిణయ కర్తయయిన తెనాలి రామభద్రకవి గ్రంథావతారికలో చెప్పినదాన్ని ప్రమాణాంతరంగా పేర్కొన్నారు. తనతాతలు ముగ్గురని, పెద్దతాత రామకృష్ణకవి పాండురంగ మాహాత్మ్యాదులు రచించాడని, తన తాత శ్రీగిరి శ్రీశైల మాహాత్మ్యకృతి రచించాడని, తన పిన తాత అన్నప్ప సుదక్షిణా పరిణయం రచించాడని చెప్పుకొన్నాడు. ఈ హేతు బలంతో ప్రభాకరులు ఇద్దరూ ఒక్కరేనని అత్యద్భుతంగా నిరూపించారు.

ఉద్భటారాధ్య చరిత్ర రచనాకాలము 1525 కావచ్చును, గనుక "తెనాలి రామలింగకవి కృష్ణదేవరాయల సభలో నున్నాడన్న లోక ప్రతీతి సదాధారమయి సంరక్షిత మగుచున్నది" అని అన్నారు ప్రభాకరులు. రామలింగకవి రాయల ఆస్థానంలో ఉన్నట్టు స్పష్టమైన ఆధారాలు ఇకముందు దొరకవచ్చును.

**మనుచరిత్రము పీఠిక** :– ఈ పీఠిక ఆరు దశాబ్దాల క్రిందట రచించినది. అప్పటి సాధన సామగ్రితో, ఆధునిక పద్ధతిలో జరిగిన కావ్యసమీక్ష మనకు ఎంతో ఆశ్చర్యానందాలు కలిగిస్తుంది. రచనాచాతుర్యము, శైలీ, ఔచితీ నిర్వాహము; కల్పనాచాతుర్యము, భావప్రకాశనము, స్వభావపరిజ్ఞానము, పూర్వకవుల అనుసరణలో మెలకువలు, కథా సంవిధానము మున్నగు వింగడింపులతో ప్రభాకరుల విమర్శసాగినది. పెద్దన చేసిన కొన్ని సంస్కృత వ్యాకరణ విరుద్ధ ప్రయోగాలను చెబుతూ ప్రభాకరులు పాణిని పదచర్చను మహోదాత్తంగా నిర్వహించారు. "పణినసూను కణాదబాదరాయణ సూత్ర ఫక్కి విద్వాంసు లుపన్యసింప" అని పెద్దన "పణినాపత్యోక్త శాస్త్రంబులోన్" అనే శ్రీనాథుని ప్రయోగాన్ని అనుసరించాడు. పాణిని పాణిన ముని కుమారుడు కాని, పణిన ముని కుమారుడు కాదు. "పణనం పణిః– పణోస్యాస్తీతి పణీ. నకారాంతమగు నీ పణిన్ శబ్దముపై గోత్రాపత్యార్థమున

ఆణ్‌ప్రత్యయమురాగా, పాణిన అను రూపమేర్పడినది. పదపడి యువా పత్యార్థమున ఇఞ్ ప్రత్యయమురాగా పాణిని యను రూపమేర్పడినది. ఎట్లయినను బాణిని పాణినసూను దగునుగాని, పణినసూనుడు గాడు. ఇది సమర్థింపవెరవు గానరాదు." అని తెగవేసి చెప్పారు. ఈ పీఠిక ఆధునిక పద్ధతి విమర్శకొక మచ్చుగా నేను సంభావిస్తాను.

**ప్రతిమానాటక పీఠిక** :- తిరువాన్కూరులో భాస నాటక చక్రం లభించింది ఈ శతాబ్దం ఆరంభదశకంలో. లభించడమే తడవుగా శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు వాటిని నకలు చేసుకొని వచ్చారు. కొన్నిటిని అనువదించారు, ప్రభాకరులు ప్రతిమా నాటకం మున్నగువాటిని అనువదించారు. తర్వాత మహామహోపాధ్యాయ గణపతిశాస్త్రిగారు తిరువనంతపురం సంస్కృత గ్రంథమాలలో ముద్రించారు. ప్రతిమా నాటకం 1910 లోనే ప్రభాకరులు అనువదించారు. 1913లో కర్ణభారం, మధ్యమ వ్యాయోగం అనువదించారు. వాటికి ప్రభాకరులు వ్రాసిన తొలిపలుకులను పరిశిష్టంలో చూడవచ్చును. భాసనాటకానువాదాల శ్రేయస్సు తొలిసారిగా మానవల్లి వారికీ, ప్రభాకరులకూ చెందుతుంది.

**బసవపురాణ పీఠిక** :- ప్రభాకరుల పీఠికలలో బృహత్తరమయినదీ, ఆంధ్రసాహిత్య లోకంలో బృహత్కల్లోలం కలిగించినదీ బసవపురాణ పీఠిక. దీనిని గురించి వ్రాయవలసి వస్తే పీఠికంత గ్రంథమవుతుంది. ప్రభాకరులు సోమనకాలదేశవర్తమానాలను గురించి, భాషాచ్ఛందోవ్యాకరణాలను గురించి చెప్పిన సిద్ధాంతాలేవీ మార్చవలసినంత కారణ కలాపం ఇంతవరకు లభించలేదనే నా విశ్వాసం. సోమనాథుడు నన్నయ, తిక్కనల మధ్యకాలం వాడనే - 1132- 1198 నిర్ణయం మారవలసిన అవసరం కానరాదు. ఈ పీఠిక ప్రభాకరుల చరిత్ర జ్ఞానానికి, న్యాయదృష్టికి, విమర్శపాటవానికి, వైదుష్య వైదగ్ధ్యానికి పెద్ద అద్దం.

ఈ గ్రంథ పరిశిష్టంలో ప్రభాకరులు తెలుగులో వ్రాసిన మరి మూడు గ్రంథాల తొలిపలుకులూ రెండు గ్రంథాలకు సంస్కృతంలో వ్రాసిన ఉపోద్ఘాతాలూ చేరినవి. చిన్నవనీ నాగరాక్షరాలలో వున్నవనీ ఉజ్జగించక వాటినీ కాలక్రమాన పరిశిష్టంలో చేర్చడం సముచితమే.

**చాటుపద్యమణిమంజరి** :- దీని తొలిసంపుటానికి ప్రభాకరులు



వ్రాసిన తొలిపలుకు చిన్నదైనా చాటు పద్యాల సేకరణలోనూ కూర్పులోనూ వారి ఆసక్తిని పరిశ్రమను వివరించేదిగా వున్నది. ఏడు దశాబ్దాల క్రిందట తెలుగు పాఠకలోకాన్ని ఉత్తేజపరచి తెలుగుతీపిని చవి చూపిన గ్రంథాలలో ప్రభాకరులు సంధానించిన చాటుపద్యమణిమంజరి ప్రముఖమైనది.

ప్రభాకరుల సంస్కృత రచనలు విరళాలైనా, ప్రభాభాసితాలు. సుందర పాండ్యుని నీతిద్విషష్టికకు వారు వెలయించిన పీఠిక వారి సంస్కృత శైలికి మచ్చు. సుందరపాండ్యుడు ఆరవ శతాబ్దానికి ముందున్నవాడని శ్రీ ప్రభాకరులు ఈ కావ్యానికి వ్రాసిన ఉపోద్ఘాతంలో నిర్ణయించారు. శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు కూడా ఈ గ్రంథాన్ని వ్రాసిన ఆంగ్ల పీఠికలో ఆ వాదాన్నే సమర్థించారు.

సుందరపాండ్యుని ఆర్యలను పంచతంత్రకారాదులే కాక పలువురు తెలుగు కవులూ గ్రహించారు. సుమతిశతకకారుడు, మంచన, శ్రీనాథుడు మొదలయినవారూ ఈ ఆర్యలను ఉపయోగించుకొన్నవిధం ప్రభాకరులు పీఠికలో తెలిపారు. శ్రీనాథుడు భీమఖండంలో

**నికటమున నుండి శ్రుతిపుటనిష్ఠురముగ**
**నదరి కాకులు చేరి బిట్టరచునపుడు**
**ఉడిగి రాయంచ యూరకయుంట లెస్స**
**సైపరాకున్న నెందేని జనుట లెస్స.**

అనే పద్యానికి మూలం నీతిద్విషష్టికలోని

**కటు రటతి నికటవర్తీ**
**వాచాటష్టిట్టిభో యత స్తస్మాత్,**
**అపసరణ మేవ యుక్తం**
**మౌనం వా రాజహంసస్య.** అనే ఆర్య.

సుమతి శతకకారుడు

**మిత్రమపి యాతి రిపుతాం**
**స్వస్థానా త్ప్రచ్యుతస్య పురుషస్య,**
**కమలం జలాదపేతం**
**శోషయతి రవి ర్న తోషయతి:**

అనే ఆర్యను పూర్తిగా అనువదించుకొన్నాడు ఇలా :

**కమలములు నీట బాసిన**
**కమలాప్తుని రశ్మిసోకి కమలినభంగిన్**
**తమ తమ నెలవులు దప్పిన**
**తమ మిత్రులు శత్రులౌట తథ్యము సుమతీ.**

ప్రభాకరుల సంస్కృత శైలికి ఈ పీఠికలోని కొన్ని పంక్తులు ఉదాహరిస్తాను :

అపిచాయం నీతిద్విషష్టికాకారః సుందరపాండ్యోఽన్యతమః. సుభాషిత గ్రంథసంధాతృభి ర్బహుభి రముష్య గ్రంథః పరామృష్టః, సుభాషితావల్యాం వల్లభదేవోఽస్యాః కృతే ర్బహ్వీరార్యాః పరిజగ్రాహ. శ్రుతానుశ్రవికయైవ సతాస్సమాకలయత్ పరమిమాం కృతి మానుపూర్వ్యా స నైవాపశ్యత్.."

ప్రభాకరులు దీనిని సంస్కృత లోకానికి అందించి మహోపకారం చేశారు. దీనిని సుగృహీతనామధేయులు రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు, ఆర్య అనే పేర అతిమనోహరంగా పద్యానువాదం చేశారు. డాక్టర్ పుల్లెల రామచంద్రుడుగారు దీనికి తెలుగులో అర్థతాత్పర్యాలు రచించారు.

సాహిత్య జిజ్ఞాసువులు ఈ పీఠికలతో ఎంతో మనోవికాసం పొంది సత్యాన్వేషణ మార్గంలో ముందంజ వేస్తారు.

యోగివర్యులు, కరుణావరుణాలయులు, మేధామూర్తులు, న్యాయాసిధారావ్రతులు నయిన గురువర్యులు ప్రభాకరులను ఈ విధంగా స్మరించడానికి అవకాశమిచ్చిన గురుపుత్రులు – ఆ విధంగా సోదరులు అయిన ఆనందమూర్తి గారికి ఎంతో ఋణపడి ఉన్నాను.

హైదరాబాదు          తిరుమల రామచంద్ర
5-11-1985.



Adapa Ramakrishna Rao
professor and Head Department of English
Osmania University
Hyderabad- 500 007

# PREFACE

To write a preface to the collected writings of a scholar of Sri Veturi Prabhakara Sastri's stature who set an exacting standard in writing eminently readable and highly illuminating prefaces to the books he composed and edited is no easy task. Yet I have undertaken it only because I wish to avail myself of this opportunity to pay my homage to the venerable litterateur to whom the Telugu people owe a deep debt of gratitude for his services in the fields of literature and culture.

Sri Prabhakara Sastri, whose birth centenary will be celebrated in about three years from now, was a pioneer in many respects, and he was quite active in a variety of fields. First and foremost, he was a sensitive poet who captured the agony and the ecstasy of human existence in a series of neatly drawn vignettes. He was also an eminent scholar- critic who not only edited many classics already known to the reading public but also discovered unknown masterpieces lying hidden in palm-leaf manuscripts in the libraries in Madras and Tanjavur, and brought them to light after diligently editing them, restoring the texts where necessary, and scrupulously pointing out his own conjectural emendations. In fact it was he who went from one village to another in search of rare manuscripts for the Oriental Manuscripts Library of the Govermnent of Madras, and prepared authentic Descriptive Catalogues of its collections. It

may be mentioned that it was mainly owing to his dedicated efforts to make transcriptions of the devotional lyrics of Sri Annamacharya from copper plates, and his active role in getting them printed and propagated that the saint- poet's name has become today a house- hold word among the Telugu people.

Sri Sastri's study of inscriptions relating to Andhra history and culture have led to significant discoveries in the area of the evolution of the Telugu language as well as the history of the race. He devoted much time likewise to collecting art pieces for the proposed museum at Tirupati, and we owe to him the identification of the idol of Kakatamma, the tutelery deity of the Kakatiya rulers. His interest in archaeology led him to get many excavations of pre- historic mounds made around Muktyala in Krishna District of Andhra Pradesh.

Sri Sastri was also a gifted translator of Sanskrit classics whose translations include three famous plays of Bhasa, **Pratima Natakam, Madhyama Vyayogam and Karnabharam,** besides other works like **Bhagavadajjukam** and **Mattavilasam**. He was, further, a noble teacher who trained a select band of young scholars in the art of emendatory and interpretative literary criticism. And he was, besided, a great mystic with proven yogic powers who brought solace to many a person sick in body and mind. It must be admitted that it is only at rare intervals that we find such a great soul in our midst.

Sri Prabhakara Sastri's learned prefaces are scattered in many books some of which are not easily accessible to readers today, and so and attempt is being made to collect and publish them in a few volumes, and the present book is one of them. It consists of his prefaces to fourteen literary works, ranging from



long narrative poems like **Basava Puranam. Manucharithra** and **Udbhataradhyacharitra** to shorter pieces like **Charucharya** and **Bhasavodaharanam**.

The first (1913) of these prefaces in this Volume deals with the History of the Andhra Nayaka kings who ruled over part of South India from Tanjavur after the fall of Vijayanagara empire. It may be noted here that the discoveries made by Sri Prabhakara Sastri from the palm-leaf manuscripts at Saraswati Mahal Library at Tanjavur were largely responsible for providing the correct perspective to the understanding and appreciation of one of the glorious periods in theAndhra history. The preface makes a judicious appraisal of the contribution of the Nayaka kings to Telugu literature and culture.

Three of the prefaces, included in this volume, dealing with Palkuriki Somanatha's **Basavapuranam(1926)**. Allasani Peddana's **Manucharitra (1926),** and Tenali Ramakrishna's **Udbhataradhyacharitra (1925**, have become classics in Telugu literary criticism and may be justly claimed to have laid the foundations for balanced explicatory and expository critical writing on the lives and works of these three major poets. Sri Sastri's extensive knowledge of socio- political history, archaeology, epigraphy, literature and theology enabled him to shed light on many intricate passages in these poems.

When Bhasa's plays were discovered and published from Trivandrum, Sri Prabhakara Sastri's curiosity was roused by the event, and subsequently he translated three of the plays into Telugu. If his rendering of **Pratima Natakam (1910)** is a specimen of an ideal translation of a dramatic work, his preface to the translation is equally praiseworthy for its discussion of Bhasa's

motives in introducing innovations into the well- known **Ramayan** story, especially the dramatist's attempt to redeem the much-maligned character of Kaikeyi.

The other prefaces in the volume too are highly instrucrive to the general reader and the research scholar alike, containing as they do many flashes of insight and subtle interpretations of abtruse passages. The publishers deserve our praise for making available such a treasure- house to literary criticism in a handy volume.

**Hyderabad**
**25 October 1985** **ADAPA RAMAKRISHNA RAO**

# విషయసూచిక

**విషయము** **పుటలు**


1. తొడిమ - తంజావూరి చరిత్ర పీఠిక ( 1914) 1
2. ప్రబంధ రత్నావళి పీఠిక ( 1918) 33
3. చారుచర్య - ఉపోద్ఘాతము (1922) 58
4. శ్రీకాకుళ శ్రీహరిశతక పీఠిక (1923) 62
5. భగవదజ్జుకము - తొడిమ (1924) 70
6. ఉద్భటారాధ్య చరిత్ర పీఠిక ( 1925) 79
7. మనుచరిత్ర పీఠిక ( 1926) 98
8. ప్రతిమా నాటకము - తొలిపలుకు ( 1910- 1927) 130
9. బసవ పురాణము - పీఠిక (1926) 134
10. బసవోదాహరణము - తొలిపలుకు (1928) 300
11. నీతిద్విషష్టిక - ఉపోద్ఘాతము
సంస్కృత (1928) రచనకు తెలుగు అనువాదము (1981) 301

*పరిశిష్టము*

12. కర్ణభారము - తొలిపలుకు (1913) 311
13. మధ్యమ వ్యాయోగము - తొలిపలుకు (1913) 312
14. చాటుపద్య మణిమంజరి - తొలిపలుకు 313
15. భగవదజ్జుకము ( ఉపోద్ఘాతము - సంస్కృతము) (1925)
16. నీతిద్విషష్టిక (ఉపోద్ఘాతము - సంస్కృతము) (1928)

# తొడిమ

శ్రీకృష్ణదేవరాయలవారు పాండ్యరాజ్యము, చోళరాజ్యము సంపూర్ణంగా స్వాధీనపరుచుకొన్నారు. వారి అనుజ్ఞమీదనే మొదట, విశ్వనాథనాయడు, అక్కడకుపోయి ఆ రెండు రాజ్యములు, ఆలించి పాలించినట్లు కొన్నిచోట్ల వున్నది. కృష్ణరాయల తర్వాత ఆయన సవతితమ్ముడు అచ్యుతరాయలు రాజ్యానికి వచ్చెను. ఈతడే చోళదేశానికి ప్రత్యేకంగా చెవ్వప్పనాయణ్ణి రాజుగా యేర్పాటు చేసెను. అచ్యుతరాయల వారి భార్య తిరుమలాంబ అనీ, ఆమె చెల్లెలు మూర్తమాంబ అనీ, మూర్తమాంబ భర్త అయిన చెవ్వప్పనాయనికి అచ్యుతరాయలవారు చోళదేశం స్త్రీ ధనంగా అరణం యిచ్చినారనీ కొన్ని గ్రంథాలవల్ల తెలుస్తూ వున్నది.

గీ॥ రీవి నచ్యుతరాయలదేవి యైన
తిరుమలాంబకుఁ జెలియలై తేజరిల్లు
మూర్తమాంబను బెండ్లియై కీర్తి వెలయఁ
జెవ్వవిభుఁడు మహోన్నతశ్రీఁ జెలంగె." –విజయవిలాసము.

కాని యిక్కడ వొక చిక్కు తగులుకొన్నది. కృష్ణరాయలవారి వంశం క్షత్రియవంశం, అని వెనకటి శాసనాలలోను, ప్రబంధాలలోను వర్ణన వుంటుంది. చంద్రవంశపుక్షత్రియులట! చెవ్వప్పనాయనివారి వంశం, శూద్రవంశం, అని కూడా అప్పటి శాసనాలే ప్రబంధాలే చెప్తూతూ వున్నవి. అప్పచెల్లెళ్లు క్షత్రియుడికి శూద్రుడికి భార్యలు కావడం యేవిధంగా? ఆకాలంలో కులమర్యాదలు చెక్కుచెదరకుండా వుండేవే– అని సందేహం! ఇదే చిక్కు. పై సంబంధం ఆధారం చేసుకొని, కొందరు కృష్ణదేవరాయలవారిని శూద్రులలో కలుపుతున్నారు. రాజులయినారు గనక, దర్పానికి క్షత్రియులని పెద్దగా వర్ణింపించుకొన్నారే గాని నిజానికి క్షత్రియులు కారని వారి సిద్ధాంతం. ఈ మాట అంత పొందుబాటుగా లేదు. కృష్ణరాయల వంశం శూద్రవంశం అయితే ఆ వెనకటి బుక్కరాయలవంశం, సాళువవారివంశం

క్షత్రియవంశాలగునా? గజపతులుమాత్రం క్షత్రియులెట్లా అవుతారు? ఆ కాలంలో కులకట్టు తప్పడమే! విద్యారణ్యులంతవారు మంత్రులు, గురువుగా వుండేవారు! ఆ రాజులు తాము వాణీవిలాసం మొదలయిన ధర్మశాస్త్ర గ్రంథాలు కూడా రచించేవారు. శూద్రులైతే యిట్లా సాగునా? దర్పానికే క్షత్రియులమని చెప్పుకున్నారు. అప్పుడంతా వొప్పుకున్నారు, సరే, అయితే వారి బంధువులిక శూద్రులమని చెప్పుకుంటారా? చిక్కుగాదా? అచ్యుతరాయల మరదలిని పెళ్లిచేసుకొన్న చెవ్వప్పనాయడు కూడా క్షత్రియుడే అనిపించుకోవలెగాదా? లేదే? ఏమి కుదిరింది? పెంచడం యెందుకు? పై సిద్ధాంతం అపసిద్ధాంతంగానే వున్నది.

కొందరంటారు:– "అచ్యుతరాయల మరదలిని పెళ్ళిచేసుకొన్నాడని వున్నది. అంతమాత్రంతో ఆ అచ్యుతరాయలు విద్యానగరం అచ్యుతరాయలనడం యెట్లా? ఈ అచ్యుతరాయలింకొకడు కావచ్చు" నని. ఈ యెత్తుగడకూ పొత్తుకుదరలేదు. విజయనగరం రాయలుగాక మరియెవ్వడియ్యగలడు. చోళరాజ్యం? చెవ్వప్పనాయడు సరిగా విజయనగరపు అచ్యుతరాయల కాలంలో వున్నాడు. వీరికి రాజ్యం రావడానికి వేరే కారణం కనబడదు. శౌర్యంతో జయించినట్టు ఎక్కడా లేదు.

నా వూహ యేమంటే:– అచ్యుతరాయలనాళ్లలోనే "అచ్యుతరాయాభ్యుదయమ్" అనే సంస్కృతకావ్యం వొకటి వెలసింది. అందలి విషయం ఆయన చరిత్రమే. ఆ గ్రంథంలో అచ్యుతరాయలకు తిరుమలాంబ అనే భార్య ఉన్నట్టు కానరాలేదు. తిరుమలాంబ పట్టమహిషిగాక పరిగృహీత కావలెను. రాజులకు చాలామంది భార్యలుండేవారు. కొందరు పట్టపురాణులు, కొందరు పరిగృహీతలు. పరిగృహీతలు భిన్నజాతివారుకూడా కావచ్చును. కృష్ణరాయలవంశం క్షత్రియవంశమే. చెవ్వప్పనాయని వంశం శూద్రవంశమే. కావడమునకు ఇప్పుడు చిక్కేమున్నది. నిజమేదో నిలకడమీద తేలవలెను.

పాండ్యరాజ్యానికి విశ్వనాథనాయనివారి సంతతీన్నీ, చోళరాజ్యానికి



చెవ్వప్పనాయనివారి సంతతీన్నీ రాజులైన నాటి నుండి రెండు రాజ్యాలూ యేలుకొంటూ వచ్చిరి. వారిలో పరస్పరం చుట్టరికమున్నూ మధ్యనడిచెను. చోళరాజ్యంవారు విజయనగర రాజులకు విధేయులయి సర్వవిధాలా వారికి తోడ్పడుతూ వచ్చిరి. పాండ్యరాజ్యంవారు కొన్నాళ్లయిన తర్వాత తిన్న యింటివాసాలు లెక్కపెట్టినారు.

చెవ్వప్పనాయడికే చినచెవ్వప్పనాయడనిన్నీ పేరు. వీరి పూర్వులు రాజ్యమేలినట్టు కనపడదు. విజయనగర రాజుల దగ్గిరనే సేనానాయకులయి వుందురు. వారిని గూర్చి విజయరాఘవనాయనివారు రచించిన రఘునాథాభ్యుదయంలో వున్న విధం :–

"ద్విపద. వనజాక్షుపదముల వరలు వాహినికి, ననుజయై మించునాలవజాతి జగతి, ఆ జాతిలోఁ జాల నధికులైనట్టి, రాజులు కొందఱు ప్రఖ్యాతిఁ గనిరి, వారిలోఁ గృష్ణభూవరుఁడు లావణ్య, కారుణ్యగుణముల ఘనకీర్తి గాంచె, నమ్మహామహునకు నాత్మజుఁడైన, తిమ్మభూపాలుండు ధీరత వెలసి, బయ్యాంబిక వరించి ప్రౌఢి వహించె, నయ్యిరువురు గాంచి రాత్మసంభవులఁ, బెదచెవ్వభూపాలుఁ బినచెవ్వవిభునిఁ, బెదమల్లభూజానిఁ బినమల్లవిభుని, వారిలోఁ జినచెవ్వవసుధాబలారి, మేరుధీరుఁ డనంగ మేదిని వెలసెఁ, జిరతంబుగ భక్తి శ్రీశైలమందు, నరుణాచలమున వృద్ధాచలమందు, శంకరార్పణముగా శాశ్వతానేక, కైంకర్యములు చేసి ఘనకీర్తిగాంచె, సుగుణ సంతతికి నచ్యుతరాయసతికిఁ దగిన సోదరి కృశోదరి మూర్తమాంబ, యతనికి భార్యయై.....'

చోళదేశంలోవీరి రాజధాని తంజావూరు. వీరు తెలుగువారు. ఆ దేశం అరవదేశం. భాషవేరు. అందుకని వీరు తెలుగుదేశమునుండే, మంత్రులు, దండనాథులు, పండితులు, కవులు, గాయకులు, వేశ్యలు మొదలగువారిని తీసుకొనిపోయిరి. ఆ కాలంలో అక్కడకుపోయి నెలకొన్న తెలుగువారి సంతతి యిప్పటికిన్నీ ఆయా స్థలములలో వున్నారు. ఇప్పటికిన్నీ తంజావూరులో

సగం మూడుపాళ్ళు తెలుగు మాట్లాడగలరు. తిరువైయారు మొదలయిన స్థలాలలో ఎందరో తెలుగువారున్నారు. అప్పుడు రాజులవల్ల అగ్రహారాలు పొందిన తెలుగు బ్రాహ్మల సంతతి యిప్పటికీ అగ్రహారాలు అనుభవిస్తూ వున్నారు.

చెవ్వప్పనాయుడు తంజావూరులో కోట, అగడ్తలు మొదలయినవి నిర్మించినాడు. శివగంగా తటాకమనే తియ్యనీటి చెరువు తవ్వించినాడు. ఇప్పటికీ ఆ చెరువు చెక్కుచెదరకుండా వున్నది. తంజావూరి కది మహోపయోగం. కోట, అగడ్తలు, కొంత చెడినప్పటికీ యిప్పటికీ ఆశ్చర్యం కలిగిస్తూ వున్నవి.

రఘునాథరాయలు రచించిన సంగీతసుధ అనే గ్రంథం పీఠికలో గోవింద దీక్షితులవారు (ఈయన యెవరో ముందు తెలుస్తుంది) చెవ్వప్పనాయణ్ణి వర్ణించిన విధం :-

"శ్లో॥ కర్ణాటసింహాసన కార్యధుర్యః పరాక్రమాక్రాంత పరావనీపః ,శోణాద్రినాథస్య స చెవ్వభూపో నిర్మాయ చత్వార్యపి గోపురాణి. ప్రాకారపఙ్క్తీరథ మంటపాని తటాకదివ్యోపవనాని భూయః, గ్రామా ననేకానుపకంఠసీమ్ని దత్వావిచిత్రాణిచ భూషణాని. రథా ననేకా న్విరచయ్యరమ్యాంశ్చక్రే మహారాజవిభూతి మస్య, న కేవలం శోణగిరీశ్వరస్య కైఙ్కర్య మేవం కృతవాన్ స భూపః. ఏకామ్రనాథస్య చ దీర్ఘ(?) శైలనివాసినశ్చాపి రఘూద్వహస్య, వృద్ధాచలేశస్య సమస్తమేత త్ప్రాకారముఖ్యం వ్యతనో ద్విశేషాత్. శ్రీశైలనాథస్యచ వేఙ్కటాద్రినివాసినః పద్మవిలోచనస్య, హైమం విమానం విరచయ్య హర్షా దన్యచ్చ కైఙ్కర్య మసావతానీత్.చోళేషు (?) కిం బహునా నరేంద్ర! స్థానేషు సర్వేషు హరేశ్వరస్య, ప్రాకారసౌధప్రముఖా ననేకా న్నిర్మాయధర్మా న్మముదే నరేంద్రః, మహీసురాన్ కించ మహాగ్రహారై రహర్నిశం సాదర మన్నదానైః, దానై రనేకై రపిభక్తిపూర్వం సంప్రీణయామాస స చెవ్వభూపః".

ఈ ధర్మకార్యాలలో కొన్నిటికి శాసనాలున్నవి. ఈ చెవ్వప్ప



నాయకుడు, క్రి. 1580 ప్రాంతముల వరకు జీవించెను. ఈయన కుమారుడు అచ్యుతప్పనాయడు. ఈయన యోగ్యత సంగీతసుధ పీఠికలో యిట్లు వర్ణింపబడినది :-

"శ్లో॥ తత్రాదృశైర్ధర్మభరై రముష్మా దావిర్బభూ వాచ్యుతభూమిపాలః, మూర్త్యంబికాయాం జగదంబికాయాం బాలేందుమౌళేరివ బాహులేయః॥ ఆరభ్యబాల్యాదతిభక్తిశాలీ... రంగనాథం. అవాప్య తంజాపుర మప్రతీపః కౌమార ఏవాభృత రాజ్యభారః, గజై రనేకై స్తురగైర్భటైశ్చ నిర్జిత్యసామంత నృపాలవర్గమ్. సంపాద్య దత్తేస్మ సమస్త మర్థం శ్రీరంగనాథాయ తథా ద్విజేభ్యః, రంగేశితు ర్దివ్య మసౌ విమానం హైరణ్మయం రత్నమయం కిరీటమ్. మణీమయం వర్మచ నిర్మమీతే సింహాసనం స్మ క్షితిపాల ఏషః, తస్యైవ పూర్వోత్తరపశ్చిమాని సగోపురాణ్యప్రతిమప్రభాని. ప్రాకారమ ష్యష్టమ మాతనిష్ట మహానసం చాపి మహీమహేంద్రః, లక్ష్మ్యాశ్చ సర్వాణ్యపి మండపాని దివ్యాని రత్నాభరణాన్యతానీత్. ఆరోహమార్గంచ మరుద్వరాయా(?) మలంక్రియా భావ ముపేయివాంసమ్, ఆరామ సీమామపి రంగభర్తుర్గ్రామా ననేకానపి స వ్యతారీత్.దానం తులాపూరుష మచ్యుతేంద్రో హిరణ్యగర్భం ప్రతివర్షమేవ, హేమాద్రి కల్పే కథితాని సమ్యక్ సర్వాణి దానాని ముహుర్వ్యతానీత్, రామేశ్వరస్యాపిచ గోపురాణి తీర్థాని సర్వాణి నవీ చకార సందర్శనం కించ స రామసేతో రసావకర్షాదనువర్షమేవ, దినేదినేభోజయ దేష లక్షాధికాన్ ద్విజానచ్యుతభూమిపాలః."

రాజచూడామణిదీక్షితులు రుక్మిణీపరిణయ మహాకావ్యమున కూడ యిట్లే వర్ణించినాడు:

"శ్లో. మాయూరమధ్యార్జునకుంభఘోణ శ్రీచంపకారణ్యముఖస్థలేషు,
మహత్తరం మండప మాతతాన భక్త్యామహత్యా పరమచ్యుతేంద్రః,
అగ్ర్యాననేకా నపిచాగ్రహారా నసౌవ్యతారీదవనీసురేభ్యః
శౌర్యేచ ధైర్యేపిచ దానకేళ్యాం సమో న కశ్చిద్ధరణీభృదస్య."

"రంగాజి" మన్నారుదాసవిలాసమందు వర్ణించిన విధం :-

"సీ. మన్ననారునకును మహనీయగోపుర, ముఖములౌ గోపురముల నొనర్చె., రామసేతువునఁ దీర్థము లెల్లఁ బ్రకటించి, యిల మహాదానంబు లెల్లఁ జేసె., రంగధామున కంతరంగ ముప్పొంగఁగా, రత్నాంగియుఁ గిరీటరాజమొసఁగె, శ్రీముష్ణముఖ్యవిశేష స్థలంబుల సకల వైభవములు సాగఁ జేసె., గీ॥ నౌర! నాలుగుదిక్కులయందు శౌరి, కతఁడు సేయనికైంకర్య మవనిఁ గలదె, పాండ్యతుండీరముఖ్యభూపతులఁ గెల్చె, సొరిది నా ఘనుఁ డసహాయశూరుఁడగుచు-

ఉ॥ సారభుజాబలంబునను జక్కఁదనంబున సద్గుణంబులన్
ధీరనుతప్రతాపమున దిక్కుల మిక్కిలి నిండుకీర్తులన్
ధారుణిఁ బ్రోచునేర్పున నుదారదయం గవితాచమత్కృతిన్
శ్రీరఘునాథభూమిపరిణీమణికిన్ సములేన్నృపాలకుల్?"

విజయవిలాసంలో :-

"శా॥ శ్రీరంగేశుఁడు వచ్చి యచ్యుతధరిత్రీభర్తయై భాగ్యరే
ఖారూఢిన్ విలసిల్లి తాన తనకున్ గైంకర్యముల్ చేసెఁగా
కేరాజైనను జేయఁగా గలిగెనే యి ట్లీవిమానం బహో
భూరిస్నిగ్ధముగా, మహామణిమయంబు ల్గాఁగిరీటాదులన్."

మహానుభావుడైన యీ అచ్యుతప్పనాయనికి, విద్యారణ్యులవంటి మహాత్ముడు గోవిందదీక్షితులు మంత్రిగా వుండెను.

"శ్లో॥ త్రినామాద్యంతనామానౌ మహీక్షిద్దీక్షితావుభౌ,
శస్త్రే శాస్త్రే చ నిపుణౌ వాహనేషు హవేషు చ."

(అచ్యుత, అనంత, గోవింద, అనే నామములకు "త్రినామ నామత్రయ" సంజ్ఞలు కలవు). రాజుకు తగిన మంత్రి, మంత్రికి తగిన రాజు. గోవిందదీక్షితులు మహామంత్రజ్ఞుడు, మహాకవి,మహాగాయకుడు,



మహాయజ్వ. అప్పయ్య దీక్షితులవారు మీమాంసాశాస్త్ర విషయమున కొన్ని చర్చలలో వీరితో ఆలోచన చేసేవారట! ఈ మహాత్ముడు చేసిన ధర్మకార్యముల నేకం ఇప్పటికిన్నీ చోళదేశంలో ప్రసిద్ధంగా చెప్పుకొంటూ వున్నారు. ఈయన మీమాంసాశాస్త్రం మీద స్వతంత్రించి మహాగ్రంథాలు రచించడమేగాక "సాగ్నిచిత్య, సర్వతోముఖాతిరాత్ర, సాగ్నిచిత్యాప్తవాజపేయాది యజ్ఞములు" చేసినాడు- ''పదవాక్యప్రమాణపారవారపారీణు'' దని, ''అద్వైత విద్యాచార్యు"డని బిరుదులు. ఎన్నెన్నో మహాగ్రంథాలు రచించినాడు. ఇదివరకు ఉదాహరించిన "సంగీతసుధ" ఈ మహాత్ముని ఆజ్ఞమీదనే రఘునాథరాయలు రచించెను. దాని పీఠిక యీయన రచించినదే. వేదశాస్త్రాలు చదువుకుని యజ్ఞాలు చేసిన శ్రోత్రియపండితుడికి సరసకవిత్వం, సంగీతవిద్య యెట్లా అబ్బినవో! మంత్రిత్వం యెట్లా నిర్వహించినాడో! ఆహా!

చెవ్వప్పనాయడు బ్రతికివుండగానే, అచ్యుతప్పనాయనికి రఘునాథనాయడనే కుమారుడు పుట్టెను. ఈ సంగతి సంగీతసుధ పీఠికలో గోవింద దీక్షితులవారు చెప్పినారు. రఘునాథనాయణ్ణి విద్యాబుద్ధులు నేర్పి రాజ్యార్హుణ్ణిగా చేయడంకోసం అచ్యుతప్పనాయడు మహామంత్రిశేఖరుడైన గోవిందదీక్షితుల వారికి వొప్పగించెను. ఆయన తనకొమాళ్లతోపాటు, రఘునాథనాయణ్ణి కూడా మహావిద్వాంసుణ్ణి చేసెను. గోవిందదీక్షితులవారు చేసిన యజ్ఞములలో, ఆయన పెద్దకొమారుడు యజ్ఞనారాయణదీక్షితులే అధ్వర్యుడు. ఆ యజ్ఞములలో అచ్యుతప్పనాయనివారి ఆజ్ఞచొప్పున యువరాజైన రఘునాథనాయడు దీక్షితుల వారికి ముత్యాల వెల్ల గొడుగు పట్టివుండేవాడట! అచ్యుతప్ప నాయని కాలంలో యెందరో మహాపండితులు వుండేవారు. అందులో జగత్ప్రసిద్ధుడు, గోవిందదీక్షితులమిత్రుడు రత్నఖేటదీక్షితులు. ఈయనకు తండ్రి పెట్టిన పేరు శ్రీనివాసదీక్షితులని.

సంధ్యాసమయవర్ణనలలో యీ మహాకవి కల్పించినకల్పనకు అచ్యుతప్పనాయడే మెచ్చి, ఆ కల్పనలో ఉన్న రత్నఖేటపదం ఆయనబిరుదు పేరుగా పెట్టినాడట! శితికంఠవిజయము, భైష్మీపరిణయము,

భావనాపురుషోత్తమ నాటకము, విధినిర్ణయము, బౌద్ధతంత్రమథనము, వేదాంతవాదావళి మొదలుగా యెన్నెన్నో మహాగ్రంథా లీ మహానుభావుడు రచించినాడు. పండితులందరూ ఈ క్రింది శ్లోకం చదువుతూ రత్నఖేటదీక్షితుల వారి ప్రతిభకు ఆశ్చర్యపడుతూ ఉంటారు :-

శ్లో "విపశ్చితా మపశ్చిమే వివాదకేళినిశ్చలే
సపత్నజిత్యయత్న మేవ రత్నఖేటదీక్షితే॥
బృహస్పతిః క్వ జల్పతి ప్రసర్పతి క్వ సర్పరా
దసమ్ముఖశ్చ షణ్ముఖశ్చతుర్ముఖశ్చ దుర్ముఖః"

ఈయన " సాగ్నిచిత్య విశ్వజిదతిరాత్రయాజి". అర్ధనారీశ్వర దీక్షితులు మొదలుగా యింకా యెందరో మహావిద్వాంసు లీ ప్రభువు సభలో వుండేవారు.

అచ్యుతప్పనాయడు జీవించి వుండగానే, ఆయనను వొప్పించి గోవిందదీక్షితులవారు రఘునాథనాయణ్ణి రాజ్యాభిషిక్తుణ్ణి చేసినారు. ఈ విషయం గోవిందదీక్షితులవారి పెద్ద కుమారుడు యజ్ఞనారాయణ దీక్షితులు రచించిన "సాహిత్య రత్నాకర" మనే గ్రంథంలో యీ విధంగా వున్నది:-

శ్లో॥ భుజధామయశోఽపితాదృశం తే భువి నాన్యస్య తదేతదచ్యుతేన్ద్రో! అహమేవ విదిక్షు దిక్షు సీమాస్వపి సర్వాసు చరంశ్చిరాయ జానే. విజితాబహుధా పృథక్పృథక్తేవిమతాః పాండ్య ముఖాస్త్వయా రణేషు, మిలితాశ్శపథైర్మిథస్సమస్తాః పునరప్యత్ర పురాభిషేణయన్తే అనుజీవ్యచిరా దనన్యమిత్రం పురి కర్ణాటక భూపతిం సబంధుమ్. నిజనాథ మహో నిహత్య కైశ్చిత్సమగాత్పాండ్యనృపేణ జగ్గరాజః పురి తత్ర హతే స్వపుత్త్ర పౌత్రైః సహ కర్ణాటనృపే తదావశిష్టమ్, పరిగృహ్య తదాత్మజం స యాచప్రభు రన్యైశ్చ సమాయియాస తీహ! అధిరజ్గ మమీ మిళన్తియావద్యుధి మత్తారిపవః సపాండ్యభూపాః, పుర ఏవతతోఽ మునా విధేయం తవ కర్ణాటనృపాత్మజేన సఖ్యమ్ సౌమ్యేభావిని వాసరేశుభదినే శౌణ్డీర్యముఖ్యైర్గుణైః ప్రఖ్యాతం రఘునాథనాయక మముం ప్రౌఢావధానం సుతమ్, క్షిప్రంత్వం చతురర్ణవీపరివృతక్షోణీతలప్రాభవే కుర్యాః క్షౌతుకతోఽ



భిషిక్త మఖిలై ర్గోవిందయజ్వాగ్రణీః .....సర్వౌషధైర్దధి మధుద్రవసంభృతై స్త ముచ్చార్య మంత్ర ముచితం స్వహుతావశేషైః,గోశృంగకోశనిహితై రఘునాథభూపం గోవిందయజ్వగురు రభ్యషిచ ద్రయేణ. దూర్వాక్షతప్రసవరత్న సువర్ణ పూతై స్సర్వాంబురాశితటినీ సరసాంపయోభిః,గోవిందయజ్వగురుణా కుశలీ సభూయస్త త్రాభ్యషిచ్యత తతోను పురోహితాభ్యామ్॥ హర్షేణ తం తనుజ మచ్యుత భూవలారిరత్రాభిషిచ్య వివిధైరుదధేః పయోభిః, కన్యాగణై ర్ఘటవరైర్గణికాభి రేన మప్యభ్యషేచయ దయం తదనుక్రమేణ. భద్రాసనస్థితి విధిప్రథితం విభూత్యా నిత్యాగ్నిహోత్రభవయా నిటలే మహీన్ద్రోః, ఆచన్ద్రతారక మధీశ్వరతానిధానం గోవింద దీక్షితగురుః కురుతే స్మపట్టమ్."

మీది శ్లోకములలో జగ్గరాజనే దుష్టుడు కర్ణాట రాజకుటుంబమును చంపడం మొదలుగా వచ్చిన సంగతికి సంగ్రహమిది : -

కర్ణాట రాజ్యమున వీరవెంకటపతిరాయలు చనిపోయిన తర్వాత ఘోరకృత్య మొకటి జరిగినది. వెంకటపతిరాయలకు సంతానం లేదు. ఆయన భార్య గొబ్బూరి జగ్గరాజు కూతురు. ఆమె వెంకటపతిరాయలు బతికివుండగానే, ఎవర్తో కన్నకొడుకును తాను కన్నట్టు వెల్లడించి పెంచుకోసాగెను. వెంకటపతిరాయలు తన జీవితకాలంలో ఆతణ్ణి ప్రేమించలేదు సరిగదా, అవసానకాలంలో సర్దార్లు అందరియెదటా రాజ్యం తన మేనల్లుడైన చిక్కరాయలకు చెందవలసినదేగాని అతడికి చెందరాదని కూడా ఆజ్ఞాపించెను. పాపము! నాకు వద్దు మొఱ్ఱో అని మొరపెట్టుతున్నా వినక తన వేలి ఉంగరము మేనల్లుడి చేతికి పెట్టెను. వెంకటపతిరాయలు చనిపోయిన తర్వాత, ఆయన ఆజ్ఞప్రకారం చిక్కరాయలే రాజయ్యెను. దానితో కడుపుమండి గొబ్బూరి జగ్గరాజు కొందరు దుష్టులను చేర్చుకొని ద్రోహంచేసి ఆ రాయలను సకుటుంబముగా చెర పెట్టించెను. తన కూతురి దొంగకొడుకును రాజ్యాన నిలిపెను. చాలామంది సర్దార్లు జగ్గరాజు పట్టున చేరిరి గాని పాపము! ధర్మాత్ముఁడు వెలిగోటి యాచమనాయడు, అన్యాయానికి అంజవేయలేక పోయెను. జగ్గరాజుతో చేరలేదు. కాని, రాజుకు కానికలు చెల్లించలేదు. తల్లి

యెవరో, తండ్రి యెవరో తెలియరానివాడు, అన్యాయంగా రాజైకూర్చుంటే, కులగౌరవం గలవారు వొదిగివుండరనిన్నీ వెంకటపతిరాయల ఆజ్ఞప్రకారం రాజు వేరనిన్నీ తెలియజేయడమేగాక, ఖైదీలో వున్న రాయల కుటుంబమును విడిపించేటందుకు కూడా యత్నాలు సాగించెను.

అక్కడ చాకలివాణ్ణి తన వశం చేసుకొనెను. వాడి చేతికి చీటి వ్రాసి యిచ్చి, ఖైదులో వున్న రాయలకు చూపించి యెట్లాగైనా ఆయన కుమారుణ్ణి యెత్తుకురమ్మని పంపెను. రాయలు ఆ చీటి చూచి చాలా సంతోషపడి పన్నెండేళ్ళ తన రెండో కుమారుణ్ణి తీసుకుపొమ్మనెను. చాకలివాడున్నూ యెవరికీ తెలియకుండా ఆ కుర్రవాణ్ణి మురికిగుడ్డలతట్టలో పెట్టుకుని యాచమనాయడి దగ్గిరకు యెత్తుకువచ్చెను. ఈ సంగతి విని చాలామంది సర్దార్లు యాచమనాయడిపట్టు చేరిరి. జగ్గరాజు గుండెలలో రాయి పడెను. లంచాలిచ్చి సర్దార్లను తనపట్టు నిలుపుకుంటూ ఉండెను. రాయల కుటుంబమును మిక్కిలి ఇబ్బంది కలిగే యిరకటపు బందిఖానాలో బందోబస్తుచేసి జాగ్రత్తగా కాపలాకాయిస్తూ ఉండెను. యాచమనాయడు రాయల కుటుంబమంతా తెప్పించవలెననే యత్నంతో ఆ బందిఖానా మనుష్యులను కొందరిని వశం చేసుకొనెను. వాళ్ళద్వారా ఒక రాత్రి బందిఖానా లోపలికి నేల సొరంగం తవ్వించి దానిగుండా లోపలివారిని బైటికి రప్పించే సందర్భంలో బైట ఫారా కటాయిస్తూవున్న బంటువాడొకడు ఆ సొరంగంకంతలో దిగబడెను. పదిమందీ గగ్గోలుపడి జగ్గరాజుకు తెలిపిరి. పాపి, పరమచండాలుడు జగ్గరాజు, రాయలను, రాయలభార్యను, కొడుకును, కోడలును చిన్నబిడ్డను అందరినీ చంపెను. ఈ వార్తవిని లోకమంతా అట్టుడికినట్టు ఉడికెను. జగ్గరాజును అందరు నిందించిరి. యాచమనాయడి పట్టు సేనాసన్నాహం హెచ్చెను. అప్పుడు చోళ పాండ్యరాజ్యాలు మిక్కిలి ప్రబలంగా వున్నవి వారికి పరస్పరం విరోధం. యాచమనాయడు తంజావూరు ప్రభువైన అచ్యుతప్పనాయణ్ణి దర్శించి, ఆయన సహాయంవల్ల జగ్గరాజును జయించి తన వద్దనున్న రాయల కొడుకును రాజ్యాన నిలవబెట్టవలెననే కుతూహలంతో కొంతసేన తీసుకొని తంజావూరు



ప్రయాణమయ్యెను. ఇది విని జగ్గరాయలు తహతహపడి భీతిపుట్టి అప్పుడు తంజావూరివారికి విరోధులుగావున్న పాండ్యరాజులను (తిరుమలనాయకుడో, ముద్దువీరప్పనాయకుడో అప్పటి పాండ్యరాజు) కలుసుకొని తమకు సహాయం చేయవలసినదిగా కోరెను. జగ్గరాజును తోడుచేసుకొని తంజావూరి వారిని జయించవచ్చును గదా అనే దురాశతో పాండ్యులు జగ్గరాజు పక్షం చేరిరి. తంజావూరు వస్తూవున్న యాచమనాయణ్ణి నడితోవలో చీకాకుపరచి హింసించడానికిక సన్నాహం చేస్తూవుండిరి. ఈ వార్త మహామంత్రి శేఖరుడు, మహాత్ముడు అయిన గోవిందదీక్షితులవారు ఆలకించి, అచ్యుతరాయలకు యెరింగించి, కొదమసింహమువలె గండుమీరి వున్న రఘునాథనాయణ్ణి త్వరగా రాజ్యాభిషిక్తుణ్ణి చేసి, యాచమనాయడి పట్టు యుద్ధానికి పంపెను. శ్రీరంగ పుణ్యస్థలం ప్రాంతంలోనట ఆ యుద్ధం నడిచింది; రఘునాథరాయలే జయించెను. ఆ జయవార్తలు అనేక కావ్యాలలో వర్ణింపబడినవి. రఘునాథరాయల కుమారుడు విజయ రాఘవనాయనివారు రచించిన రఘునాథాభ్యుదయమనే నాటకంలోని విధం :-

"అని పలుకు రఘునాథజననాథునకుఁ బ్రధానులు దినచర్యలు చదివిరట. యెటువలెను-

కమ్మవక్కణ. శ్రీమన్మహాచోళసింహాసనేందిరా మనోహరులైన రఘునాథనాయనయ్య వారికి నుత్తరాది గుంటూరి, యయ్యప్పరుసు (?) నారప్ప విన్నపము, లంచితనలవత్సరాషాఢశుద్ధ, పంచమీ పుష్యార్కపరిఘ యోగమున, స్వామివారా పళవానేరినగర, నామతీర్థము పురాణశ్రవణంబు, రామవిగ్రహపూజ రామజపంబు, శ్రీమూర్తిదానాద్యశేషదానములు, గావించి విజయంబు గలుగ నక్షతలు, శ్రీవైష్ణవు లొసంగ శిరమునఁ దాల్చి, ఆదిత్య హృదయ జపానంతరమున , నైదాఱుగడియల యపుడారగించి, భేరులు వేయించి పెండ్లికిఁబోవు, తీరునఁదగినముస్తీబు గావించి, యెదిరిపాళెంబున కెఱుకసేయించి, కదలివచ్చి విజయగరుడాద్రినెక్కి, రాజభద్రగజాధిరాజంబు నెక్కి.........మతిశాలి పురుషోత్తమయ నరసప్ప, జతగూడి నగరిమదాలసీల్

గనుక, నెదు రెచ్చరించుచు నేకపార్శ్వమున, మదగజంబెక్కి సమ్మదమున నడవ, అస్తెప్పయళగప్ప యాప్పలై యొక్క మస్తేన్గుపై నెక్కి మక్కువ నడవ...... చేరువనొకగంధ సింధురం బెక్కి, ఆరామదేవరాయలు చనుదేరఁ, దరతరమ్ములకును దగులైన కతన, నెఱనమ్మఁదగిన కోనేటి కొండ్రాజు, కట్టరంగపరాజు, కస్తూరిరాజు, మిట్టపాళెంపు సంబెట నాగరాజు, రామరాజలయౌకు రఘునాథరాజు, మామ యౌబళరాజు మనుబోలురాజు, శ్రీరంగపతిరాజు, శ్రీగిరిరాజు, విజయ రాఘవరాజు, విట్టలరాజు, నందేల చిట్రాజు నారపరాజు, కందనవోల్ రాజు గడె తిమ్మరాజు, కాలువరాజు నాకడప రాజులును, పాళెల రాజులు పంటరాజులును, శ్రీపతివారు కై జీతంపు దొరలు, జూపల్లివారు దేసురిరెడ్డి తెగలు, మామమూర్తెప్ప కుమారరంగయ్య, పామినాయనివారు, బలుమూరివారు, మండువవారు కంబము, కొండవీటి, కొండపల్ రెడ్లు నంకుసరావువారు, నౌదలఁబచ్చిమల్లపదాళిగట్టి, మాదన-పెరుమా మొదలారి, మొదలయిన గడిదొరల్ ముందఱ నడవఁ గదనరంగమునకుఁ గదలిపోవుటకు,....... అమ్ములచేతఁ జేయమ్ములచేత, దుమ్ములచేత దోదుమ్ములచేత........ పోరిలో సమసె గొబ్బూరి జగ్గరాజు, పాఱె మూఁకల వెంటఁబడి మాకరాజు,........విడివడి పాఱె రావిళ్లమాదన్న, మథుర వారిని గూర్చి మమ్మింతసేసె. విధియంచుఁ దనపాలి విధిదూఱుకొంచు. దొరలెల్ల నవ్వఁగాఁ దుండీరవిభుఁడు పరువెత్తెఁ దన చెంజిపట్టణము నకు,....విరిగి పాఱఁదొడంగె వీరపనేఁడు, జయలక్ష్మి చూపట్టి స్వామివారపుడు, దయమీఱఁగా ధర్మదారవట్టించి, బంగారు బొమ్మను బాంధ్య భూపాలుఁడింగితవేదియై యిచ్చన మెచ్చి. తంజాపురముచేరి,.... ఆ ముహూర్తమునఁ బట్టాభిరామాభి, రామమై మించు శ్రీరామ సౌధమున!, జలువ రాజగతిపై జాలువా పసిఁడి,..... పేరోలగంబున్న, ఆరతులెత్తినారని వ్రాసిరాగఁ, గొలువులోఁ జదివించుకొని స్వామివారి బలపౌరుషములెంచి పాచ్చావువారు, సమయోచితోక్తులఁజాల లాలించి, తమ ముద్రచేఁ గాకితముశిఖాచేసి, ఘనముగా మీకుడుగరలు గట్టించి, హనుమోజిపంతుల నంపించినారు. ఇటువలె గడచిన దిక్కడి కార్యమటుగాన నెఱిఁగుండ నవధరించేది.”

మరిన్నీ, యింతకు ముందే యీ రఘునాథనాయదు పారసీక రాజుకు, నేపాలరాజు వోడిపోయి తన్నుశరణువేడగా అభయమిచ్చి యుద్ధంలో ఆ పారసీకుణ్ని వోడించి నేపాల రాజును తిరిగిరాజ్యమున నిలిపినట్టు బహు గ్రంథాలలో కలదు. ఆ సందర్భంలోనే రఘునాథరాయలు సముద్రంలోని పట్నం వొకటి సంపాదించినాడట. పారసీకరాజు, నేపాళరాజు అంటే యెవరో! తురకరాజులయి వుందురేమో!

రఘునాథరాయలకు రాజ్యంకట్టి అచ్యుతప్పనాయదు శ్రీరంగంలో వసించి శ్రీరంగేశ్వరస్వామి నారాధిస్తూ క్రి. 1615 ప్రాంతమున పరమపదం పొందెను. గోవిందదీక్షితులవారు రఘునాథరాయల రాజ్యారంభకాలంలో కొన్నాళ్లు జీవించివుండిరి. తన అర్ధాసనమిచ్చి రఘునాథరాయలు గోవిందదీక్షితులవారిని ఆరాధించేవాడట. సంస్కృతభాషకు, తెలుగుభాషకు రఘునాథనాయని కాలంలో కలిగినంత మహాదశ, ఆ రెండుభాషలు పుట్టిన తర్వాత మరియెప్పుడూ కలగలేదనడం పొగడి చెప్పడం కాబోదు. బ్రాహ్మలకు, వారి వైదికవిద్యలకు ఆయన కాలంలో కలిగిన గౌరవం ఇంతని చెప్పజాలను. అందరు సోమయాజులే, అందరు కవీశ్వరులే, అందరు శాస్త్రకర్తలే, కవిత్వంలో సంగీతంలో మహాప్రజ్ఞగల స్త్రీలు ఎందరెందరు వుండేవారు! ఓహోహో! మన విద్యలకు అప్పుడు కలిగినదశ రాబోయే కాలంలో ఇకరాబోదు. అట్టి విద్వాంసులిక పుట్టబోరు. అట్టి కావ్యాలిక వెలయబోవు. పొగడడం పోనిచ్చి నిజమైనా చెప్పేటందుకు నాకు శక్తిచాలదు. ఆ రఘునాథనాయని ఘనత ఆ కాలపు మహాకవులే సరిగా వర్ణింపలేమని చెప్పుకొన్నారు. ఆ మహాప్రభువును గూర్చి ఆ కాలపు కవీశ్వరులు వర్ణించిన వర్ణన కొంత వివరిస్తాను :- గోవింద దీక్షితులవారు “సంగీతసుధ” పీఠికలో రఘునాథనాయదు సంగీతశాస్త్రం లక్ష్య లక్షణ సహితంగా నేర్చిన మహాపండితుడనిన్నీ, జయంత సేనాదిరాగములను, రామానందాది తాళములను, క్రొత్తగా సృష్టించినాడనిన్నీ పొగడినారు. ఆయన

కోరికమీదనే రఘునాథరాయలు సంగీతసుధ రచించెను. కవిత్వంలో అసాధారణప్రజ్ఞ గలవాడని ఆ కాలపు కవీశ్వరులందరూ యేకగ్రీవంగా చెప్పినారు. ఒకరుచెప్పడం యెందుకు? ముద్దులు మూటలుగట్టే ఆయన గ్రంథాలే చెప్పుతూవున్నవి. రాజులనేకులు దొంగకవులలోనివారేగాని రఘునాథనాయడు అట్టివాడనడానికి నోరాడడంలేదు. ఆయన కాలంలో రచింపబడిన కొన్ని గ్రంథములనుండి కొన్ని భాగములు యెత్తిచూపుదును :-

గోవిందదీక్షితులవారి సాహిత్యసుధ పీఠికలో :-

శ్లో॥ తత్రేందిరామందిర నామధేయే సభానిశేషే సహ మంత్రివర్గైః! కవి ప్రకాండైరపి కాళిదాస మయూరసౌమిల్లమురారిదేశ్యైః॥ కర్ణాట కాంధ్రద్రమిళ ప్రబంధనిర్మాణ విద్యానిపుణైశ్చ కైశ్చిత్। వాగ్గేయకార ప్రముఖై రనేకైర్విచిత్రగీతాదికళాప్రవీణైః అస్తేఽ ధిభద్రాసన మచ్యుతేంద్రతనూభవ శ్రీరఘునాథభూపః॥ఆజ్ఞప్తి మేనాం శిరసా ప్రగృహ్య ప్రావేశయఽ త్సో పి బుధాన్సమస్తాన్ । మంత్రాక్షతాలంకృత పాణిపద్మాన్ ఫలోపహారాంచిత పూర్ణకుంభాన్। విలోక్య దూరేవిబుధాన్ ప్రణమ్యమంత్రాక్షతాన్ మూర్ధ్నిముదా నిధాయ। క్షోణీసురా వః కుశలం ను కచ్చిత్ పుత్రేషుదారేషు తపోభరేషు । అప్యగ్నిహోత్రవ్రతసాధనాని సుభాని కిం సంప్రతి గోధనాని। ... ఇతీరితంవాక్య మిమే నిశమ్య ముదాఽ వదన్ భూమిభృదాశ యజ్ఞాః ! ఆసేతుభాగీరథి భూమిభాగా దభ్యాగతానా మవనీసురాణాం । అన్యైస్సువర్ణైరపి వస్త్రజాతై స్తనంధయానాం చ పయ ప్రదానైః । ఆతన్వతో రక్షణ మాదరేణ తవైవ రాజ్యే వసతాం చిరం నః । భవత్కటాక్షై రభిరక్షితానాం క్షేమం సమస్తీతి కి మత్ర చిత్రమ్ ।.........పూర్వం సమేతా వయ మత్ర యుష్మత్పితామహం చెవ్వమహీ మహేంద్రం। ఆశీర్భిరానందయితుం తదగ్రే త్వయ్యాదదానేఖురళీషు కేళీం ।తదా భవంతం సవిలోక్య హర్షాదస్మా న్ముదావాచ మిమా మవోచత్। అస్మాక మేతేన భవేత్ప్రతిష్ఠా ధర్తుంసమర్థశ్చ స ఏష రాజ్యం। ఆశీర్విశేషా చ్చినచెవ్వనేతు రాసీరిదానీ మధికస్తతోఽ పి। కృపాణికాఖేటక నైపుణేన గజస్యచాకర్షణ చాతురీభిః॥సంగీతసాహిత్యకలావిలాసైర్భాషాప్రబంధేషు భృశంపటిమ్నా। చిత్తానువృత్యా చిరమచ్యుతేందు రమందమానందభరం బభార



। తదీయధర్మాన్ పరిపాలయం స్త్వం చోళావనీంపాలయసి ప్రకర్షాత్ । శ్రీరామసేతా వపికుంభఘోణే శ్రీరంగధామన్యపి రామభద్రం। దేవంప్రతిష్ఠాప్య తదోన్నతాని ప్రాకార సద్గోపురమంటపాని ।.... చంపేశితుః పంచనదేశ్వరస్య శ్రీధేనునాథస్య మహేశ్వరస్య । శ్రీ శ్రీనివాసస్థల సీమ్నివిష్ణో శ్రీరంగనాథస్య వరప్రదాతుః॥ మహత్తరం మండపమాదధాస్త్వం శ్రీకుంభఘోణేశ్వరగోపురాగ్ర్యం । హేమాద్రికల్పప్రతిపాదితాని ముహుస్తులా పూరుషపూర్వకాణి। దత్తైస్త్వయార్థైః పరితుష్టచిత్తాశ్శేషు కాశ్యామఖిలేచ దేశే। భవజ్జయస్తంభ ని (?) ద్విజేంద్రాః కృతాగ్నిహోత్రాః కృతినోజయంతి। నిత్యాన్నదానం కురుషేద్విజానా మసంఖ్యకానామనివారితస్త్వం। సంపాద్య సేనాం బహుధాత్యుదగ్రాన్ జిత్వాసపత్న్యా నపి భూమిపాలాన్। సముద్రమధ్యాగ్రయిణస్సమస్తాన్ క్షిప్రాన్నిరాకృత్య సుఖం విధత్సే। శ్రీపారిజాతాపహరణప్రబంధం చిత్రం చ వాల్మీకిచరిత్రకావ్యం ॥ తథాచ్యుతేంద్రాభ్యుదయం గజేంద్రమోక్షం చరిత్రం చ నళస్య చిత్రం। శ్రీరుక్మిణీకృష్ణవివాహ యక్షగానం ప్రబంధానపి నైకభేదాన్। నిర్మాయ వాగ్భిర్నిపుణార్థభాగ్భి ర్విద్వత్కవీనాం విదధాసి హర్షం।

గోవిందదీక్షితులవారి కిద్దరు కుమాళ్లు. యజ్ఞనారాయణ దీక్షితులని, వెంకటేశ్వరదీక్షితులని. ఇద్దరూ తండ్రిని మించిన కొడుకులు. యజ్ఞనారాయణ దీక్షితులు సాగ్నిచిత్సర్వక్రతుయాజి. ఈయన రఘునాథనాయని చరిత్రమే సాహిత్యరత్నాకరము, రఘునాథభూపవిజయము, రఘునాథవిలాస నాటకము అనే గ్రంథములుగా రచించెను. రఘునాథనాయని కీ మహాకవి శిష్యుడట! కావ్యనాటకాలంకార సాహిత్యము రఘునాథనాయని దగ్గిర శిష్యుడై నేర్చుకొని తాను గురుదక్షిణ యీయవలసి వుండగా, రఘునాథరాయలే తనకు, కర్ణాలంకారములు, తనపదకము,పాదాంగదము, కంకణము బహుమతి చేసెనని యీతడు సాహిత్యరత్నాకరములో చెప్పినాడు. యీతడు మహాకవి. సాహిత్యరత్నాకరము అద్భుతకావ్యము. ఇట్టి జగజెట్టి పండితుడే రఘునాథరాయల శిష్యుడనని చెప్పుకొన్నాడే! ఆహా!

శ్లో. "పాతంజలం భాట్టమతంచ తర్కమద్వైతరాద్ధాంత మవైమి కింత్వైః ,ప్రబంధసందర్భభరైః కవిత్వవిద్యా మిదానీం విశదీకరోమి. ఉక్త్యా కి యత్యా వ్యయ ముక్తిధాటీవుష్యత్ప్రబంధో రఘునాథభూపః, వ్రజేన్ముదం

వ్యోమధునీవతంసశ్శంభుర్న కిం హృష్యతి శంఖతోయైః... అతో యతిష్యే న గుణానశేషానస్యాభిధాతుం రఘునాథనేతుః। కింతు స్థితాం కావ్యకృతిచ్ఛలేన సాహిత్యవిద్యాం సఫలీకరోమి॥ దేవ్యా గిరా మవతరస్య దిశే న్మదుక్తి స్స్వల్పాపి తస్య రఘునాథవిభోః ప్రమోదం। భక్త్యా సుధానవసుమాభరణస్య శంభోర్ధుత్తూరపుష్ప మివ దీనజనోపనీతం। యామద్వయేన యదునేతరి పారిజాత మాజీహరత్సరస మచ్యుతభూపసూనుః॥ కావ్యం తదత్ర విబుధైస్తు కథంకథం చిదాలేఖిచిత్ర మవధాయ ఫణీంద్రకల్పైః। ... కావ్యాలంకృతి నాటకాదికలనాపాండిత్యమత్యద్భుతం సర్వజ్ఞో రఘునాథ భూశతమఖో య స్యోపదిశ్య స్వయం । ఆదాతుం గురుదక్షిణా మభిమతా మర్థే ఉ పృహో దత్తవాన్ స్వం కర్ణాభరణం నిజం చ పదకం పాదాంగదం కంకణమ్."

వేంకటేశ్వరదీక్షితులు పూర్వోత్తర మీమాంసలలోను, సంగీత శాస్త్రములోను, కవిత్వములోను అఖండుడు. సర్వతంత్ర స్వతంత్రుడు, సాగ్నిచిత్యాప్తవాజపేయయాజి, సాహిత్య సామ్రాజ్య, శుల్బమీమాంసా, కర్మాంతవార్తిక, వార్తికాభరణ, చతుర్దండిప్రకాశికాదులు ఈయన కృతులు. మహాకవీశ్వరుడైన నీలకంఠదీక్షితులవారి గురువు. కావ్యదర్పణము, కర్పూరవర్తిక, తంత్రశిఖామణి, కమలినీ కలహంసిక, రుక్మిణీ పరిణయము, ఆనందరాఘవము, మొదలుగా యెన్నెన్నో మహాగ్రంథములు రచించిన రాజచూడామణిదీక్షితులున్నూ రఘునాథరాయల సభాస్థానమం దున్నవాడే. ఈయన రత్నఖేటదీక్షితులవారి కుమారుడు. విశ్వజిద్యాజి. అర్ధనారీశ్వర దీక్షితులవారి శిష్యుడు. వేంకటేశ్వరదీక్షితుల ఆజ్ఞలోనివాడు. గ్రంథవిస్తరభయము చేత యీ దీక్షితకవీశ్వరుల చరిత్ర ఎంత చెప్పవలెనో అంతా చెప్పలేదు.

రఘునాథరాయలు స్వయముగా రచించిన కృతులు :- తెలుగున:- పారిజాతాపహరణము, వాల్మీకి చరిత్రము, అచ్యుతేంద్రాభ్యుదయము, గజేంద్రమోక్షము, నలచరిత్రము, రుక్మిణీపరిణయ యక్షగానము, రామాయణము మొదలగునవి. సంస్కృతమున:- రామాయణసార సంగ్రహము, భారతసార సంగ్రహము, సంగీతసుధ, సాహిత్యసుధ, భరతసుధ, మొదలయినవి. తెలుగు ప్రబంధములలో వాల్మీకి చరిత్ర, రామాయణము



గొప్పవి. ఈయన కవితా చాతుర్యమును గూర్చి యిప్పుడు వ్రాయజాలను. ఒక పద్యము, గద్యము మాత్రము ఉదాహరిస్తాను- రామాయణమునుండి :-

" సీ॥ నా పాలిపెన్నిధి నా కులదైవంబు, ననుఁగన్న తండ్రి నన్ మనుపునేత। నా ముంగిట నటించు కామధుగ్ధేనువు, నా దండనుండు కుందనపుఁగొండ। నను నెల్లెడలఁ గాచికొనుమేటి విలుకాఁడు, ననుఁ గృపారసముచేఁ దనుపుఘనుఁడు।'.... గీ॥ నాదుసారస్వతాబ్ధి యానంద మొందఁ, జలుపుచంద్రుండు శ్రీరామచంద్రుఁ డెలమి, నాదు కలలోనఁ బొడకట్టి మోద మలరఁ। బలికెఁ గృతిసేయు మని కవిప్రవరులార!"

గద్య॥ ఇది శ్రీరామచంద్ర సాంద్రకరుణాకటాక్ష లబ్ధసిద్ధసారస్వతవిశేష, నిరర్గళవాగ్వైభవశేష, సరస సాహిత్యకళాభోజ, సత్య సంభాషితముఖాంభోజ, సకల సామ్రాజ్య ధౌరేయ, నిత్యవితీర్ణిధారారాధేయ, నిరతాన్నసత్త్రసంతోషి పంచాశత్సహస్ర భూసుర, బహువారావర్తితమహాదాన వైభవానర్తితకీర్తిభాసుర, నిజనామాంకితాకళంక వస్తుసమగ్రబహుళాగ్రహారభూషిత చోళధరామండల, నిఖిలభోగవిభవవినిర్జితాఖండల, సాధిత సముద్రాంతరద్వీప, పరనృపాల సంస్తుత ప్రతాప, నేపాలభూపాల స్థాపనాచార్య, కర్ణాటరాజపూజనీయ ధౌరంధర్య, రామసేతు, శ్రీరంగ, విజయరాఘవపుర, కుంభఘోణాది దివ్యస్థల ప్రతిష్ఠాపిత రామభద్ర, సర్వజన సంభావిత గాంభీర్యముద్రావినిర్జిత సముద్ర, సదాశ్రితభరణ దీక్షాదక్ష, దక్షిణసింహాసనాధ్యక్ష, రాజాధిరాజ సన్నుతాసాధారణ శౌర్య, దిగంతర ప్రసిద్ధతరౌదార్య, సుజ్ఞానజనక, సతతసంసేవిత జనక, పోషితవిద్వత్కవియూథ, భువనశోభితగుణసనాథ, బలవత్పరిపంథి గృహీత సామంతమహీకాంత విమోచన శ్లాఘనీయబాహాబల, మూర్తమాంబా గర్భశుక్తిముక్తాఫల, చినచెవ్వయాచ్యుతనృపాలపుత్ర, సజ్జనస్తోత్రపాత్ర, రూపరేఖావిజితసుమసాయక, సకల ధర్మసంధాయక, రఘునాథనాయక ప్రణీతంబైన శ్రీమద్రామాయణంబున విబుధజనవినుతవివిధకథా శాఖాప్రకాండంబగు బాలకాండంబునందు ద్వితీయాశ్వాసము."

సంస్కృత రామాయణ సంగ్రహము -

"శ్లో. శ్రీచెవ్వయాచ్యుతనృపాలవరాత్మజన్మా రామైకభక్తి నిరతో రఘునాథభూపః, యద్విస్తరేణరచితం మునినా తదేవ రామాయణం నిపుణ మిచ్ఛతి సంగ్రహీతుం. నవ్య కావ్య సమారంభా ద్వరం తస్యైవ సంగ్రహః, తదేవ కిలలోకానాం కల్యాణం కలుషాపహం. రామస్య చరితే చేతో రమతే మమ కేవలం, ఆస్తికిందేవతారత్న మన్య దీదృగ్గుణాన్వితం. పట్టాభిషేకపర్యంతం త్వరయా శ్రోతుమిచ్ఛతాం. హితంభక్తిమతామేతదలసానాంచ సమ్మతం. శ్రీరామభద్రచారిత్ర పారాయణపరాయణైః, ఘటికాత్రయమాత్రేణ ప్రత్యహం శ్రూయతామిదమ్."

ఈ రాజరత్నము తాను రచించిన రామాయణమును మధురవాణి అనే వేశ్యచేత సంస్కృతంలోనికి మార్పించెను. మధురవాణి సంస్కృతాంధ్ర కవిత్వములోను, సంగీత విద్యలోను, మహానిపుణురాలు. ఆమె వాఙ్మాధుర్యము మెచ్చి రఘునాథనాయకుడే మధురవాణి అని బిరుదుపేరు బెట్టెను. "శ్లో॥ చతుర మధుర వాణీంసమ్య గాకర్ణ్య యస్యాస్సదసి మధురవాణీ నామదత్తంత్వయైవ, సరసకృతివిధాయాం సాధుమేధావిశేషా స్వధికపటుర శేషాస్వంబుజాక్షీషుసైషా."

రఘునాథరాయల సభకు వీణావాదనములో ఆరితేరినవారు, శాస్త్రములెరిగినవారు, సరసకవిత నేర్చినవారు. పువుబోండ్లువచ్చి తమతమ నైపుణ్యమును చూపుతూ వుందురని, మహా స్వారస్యముగల కావ్యరచనలో పండబారిన తమ కీర్తిని ప్రకాశింపజేస్తూ వేలకొలది స్త్రీరత్నములు ఆయన ఆస్థానమున వుందురని ఆమె వర్ణించినది. ఈ క్రింది శ్లోకములు మధురవాణి చాతుర్యము మొదలయిన విషయములు కొంత తెలుపును : "చాతుర్య మేతికవితాసు చతుర్విధాసు వీణా కలాప్రకటనే భవతి ప్రవీణా, ప్రజ్ఞామియం నిపుణ మంచతి పాణినీయే మేధాంవ్యనక్తి బహుధా వివిధావధానే. వీణాగానకలా వినోదసమయే ధృత్వా సమస్యా శతం సద్యస్సంసది సాధు పూరయతి యా దత్తాః కవీంద్రైస్తయా .... విపంచికాయాం చతురాః ప్రగల్భాశ్శాస్త్రే ఉ తిదక్షాస్సరస ప్రబంధే, సమీప మేతస్యసమేత్యకే ఉపి సుభ్రూజనా స్స్వస్వ కలావ్యవృణ్వన్... సర్వోత్తరస్వాదిమసంస్కృతాంధ్ర ప్రబంధ



నిర్మాణ పచేళిమాని, యశాంసి భూయాం స్యవతారయంత్య స్సహస్రశ స్సంతి సరోజనేత్రాః".

పై సందర్భములను బట్టి యీ మహారాజు ఎప్పుడూ వేశ్యల ఆటపాటలతో ఆనందిస్తూ శృంగార రస సముద్రములోనే మునిగి తేలుతూ వుండేవాడని తలచరాదు. ఈయన రాజ ఋషి- మహాత్ముడు, అఖండ రామభక్తిగల భక్తాగ్రేసరుడు. ప్రతిదినము యాభైవేల బ్రాహ్మణులకు అన్నదానముచేసేవాడట కాదా! ఎన్నెన్నిచోట్లనో శ్రీరామమూర్తిని ప్రతిష్ఠచేసి గొప్పగొప్ప దేవాలయాలు కట్టించినాడట కాదా! తెలుగులో యీ మహా ప్రభువు కృతి పొందిన గ్రంథములకు లెక్కలేదు. కృష్ణాధ్వరి అనే కవిశ్రేష్ఠుడు బహుగ్రంథాలు ఈయన పేర రచియించెను. నైషధ పారిజాతీయ మనే ద్వ్యర్థి కావ్యములో యీ విధంగా చెప్పినాడు :– "సీ॥ నవరస శ్రీరఘునాథ భూపాలీయ, నామభామాభీష్ట నాయకుండు। పారిజాతా.... హ్వయకావ్య, పర్యాస్వయంవర వల్లభుండు। కల్యాణ కౌముదీ కందర్ప నాటక, కన్యోద్వహన బద్ధకంకణుండు! అమరు కాహంకార హారిభంగీక శృం, గార సంజీవినీ కాముకుండు । తాళ చింతామణీ వధూతత్పరుండు। మంచిజామాత రఘునాథ మనుజనేత। తెలియ నైషధ పారిజాతీయకృతియు। నేగురక్కల చెల్లెలై హెచ్చుననుచు."

చేమకూర వేంకటకవి సారంగధర చరిత్ర విజయవిలాసములు తెలుగుదేశమునకు చేరి యీవరకే వెల్లడి అయినవి గనుక వాటిని గురించి అందరూ యెరిగే ఉంటారు. యీ పుస్తకం చదివిన తర్వాతనే విజయ విలాసపు పీఠికకు అర్థం స్పష్టంగా తెలుస్తుంది. ఎన్నని ఉదాహరింతును। విజయవిలాసం పీఠికలో మరికొన్ని విశేషాలున్నవి చదివి చూడండి. కర్ణాట రాజప్రతిష్ఠాపన విషయం నిగూఢముగా వర్ణించినాడు. మట్ల అనంతరాజుగారి సంస్థానంలో వుండే కొంటె కోణంగి కవి చౌడప్ప యీ రఘునాథరాయల ఆస్థానానికి వచ్చి ఆ విద్యావిలాసములు దర్శించి ఆశ్చర్యపడిపోయినాడు. చూడండి :–క॥ నేరుతు నని మాటాడను । వారిజభవునంతవాని వశమా తంజా । వూరిరఘునాథ

నాయని। గారి సభను కుందవరపు కవిచౌడప్పా। అన్నాడు. రఘునాథనాయని కుమారుడు విజయ రాఘవనాయుడు రచించిన " రఘునాథనాయకాభ్యుదయ" మనే ద్విపదకావ్యంలో రాచనగరు వగైరాలు వర్ణింపబడిన విధం :-

"ఘనతరమదగజఘటలచే నలరు। పెనులాగడపుఁ బనిపెద్ద భవంతి ।.. హురుమంజితేజీల। నిరుపమంబగు పటాని బవంతిసెజ్జ। ప్రతిలేకనగరి సంప్రతికరణములు। జతగూడి వానియు విశాలశాలయును । తరతరంబులు వేణుదండముల్ పూని। గురిగొల్ల లున్నట్టి కోణెవాకిలియు। రాణువలోఁ గల రాజులు దొరలు। శ్రేణులై యున్న లక్ష్మీవిలాసంబు। చినచల్వరాతిచేఁ జెలఁగిసింగంపుఁ। బనివైఖరులఁ గనుపట్టు వాకిలియుఁ। జెంగటిపున్నాగ శీతలచ్ఛాయ। రంగైన యచ్యుతరంగకూటంబు । లలితనాకపురీవిలాసగేహంబు । కులగిరిఁ బోలులాఁగులచప్పరంబు । కవివర్ణనీయమౌ గరడికూటంబు। నవరత్నమయమైన నాటకశాల। మదనావతారుడై మన్నారుఁడున్న । మదనగోప విలాసమందిరాంగణము। పట్టాభిరామునిభావచిత్రంబు। గట్టి బంగారు చెక్కడపుఁ జప్పరము। నీలంపుఁజాయలు నీడలుదేరఁ। జాల విప్పైయొప్పు *చల్వరా జగతి। గలిగిరెండవపుష్పక విమాన మనఁగ । నలరు శ్రీరామ సౌధాధిరాజంబు। విజయ చిహ్నములచే వెలయుచునున్న। విజయ భవనరాజ వేదికాస్థలిని। కంచుకవర్గంబు గాచియున్నట్టి। కాంచనోరు కవాటఘటిత మార్గంబు। చంద్రకాంతపువింతసంతనపనుల। సాంద్రమై విలసిల్లు జగతిమీఁదటను। పగడాలజగడాల బటువుకంబములు। మగరాలనిగరాల మదన చేతులను। జిన్నారి దంతంపుఁజేరుళ్ళతుదలఁ। జెన్నారమలఁచినజీని పక్షులును। పైగోవకెంపురాపనులు బోదియలు। బాగైనపచ్చరాపలక పైకప్పు। ఇంద్రనీలంబుల నెసఁగులోవరియు। చంద్రిక వెదఁజల్లు చలువగోడలను।.... మేలైన పటికంపు మెటికలు గల్గి। కదనంబులోఁ జోళగని (?) గెల్చినట్టి। పోలికల్ నేపాలభూపాలకునకు। దొరతనం బిచ్చినదోర్విలాసములు। దురములో

*16 మూళ్ల పొడుగు, 13 మూళ్ళ వెడల్పు, 11/2 మూర యెత్తు గలిగి నిగనిగలుదేరుతూ, శ్రీరామ సౌధమున నల్లచల్వరాయి యిప్పటికిన్నీ కలదు. ఇంతకంటె తక్కువది వేరొక మండపమున కలదు. బృహతీశ్వరుని కోవెలమీద యింకొకటి కలదు.



నలపాండ్యతుండీరపతులఁ। జేరి గెల్చినగెల్పు సింహాసనమున । నారామదేవరాయల నిల్పుటయును। మొదలైన విజయముల్ ముద్దులుగుల్కఁ । బదరక వ్రాసిన భావముల్ మెఱయ। నిందిందిరాలక యిందిరారమణి। కందళించిన వేడుకలఁ గటారింప। రమణీయమగునిందిరామందిరంబు। మొదలైన గృహరాజములుగల్గి రాజు। సదన మప్పురమునఁ జాల నొప్పారు..... రాజమూర్ధన్యుఁ డారఘునాథశౌరి। రాజితంబగు నిందిరామందిరమున.... బిరుదుపాత్రలు విజృంభించియారాజు। వరుని ముందరనిల్వ వారిలోపలను । బదచాళి గొనియె రూపవతీ వధూటి। గొదలేక పేరణిగొనె చంద్రరేఖ। మిక్కిలికోపుల మెరవడిఁ జూపి। జక్కిణి వినిపించె శశిరేఖయపుడు! (లోకనాయిక కీరవాణి మొదలగువారు) మురళి రబాబు తంబుర దండెచెంగు। స్వరమండలంబు రావణహస్తమనఁగ। విలసిల్లుజంత్రముల్ వేర్వేఱఁబూని. వెలఁదులు కొందఱు వినిపించిరపుడు। భువిమెచ్చనచ్యుతాభ్యుదయకావ్యంబు। నవరసచిత్రంబు నలచరిత్రంబు। హరిదైన పారిజాతాహరణంబు। మెరవడిఁ జూపువాల్మీకి చరిత్ర జానకీకళ్యాణ చాటుకావ్యంబు। తానిర్వహించిన తక్కిన కృతులు। కొందఱు వినిపింపఁ గొందఱు తగిన। సందర్భముల సమస్యలు సేకరింప। నెదుట సంగీతసాహిత్య నాట్యములు। మొదలైన విద్యలు మూర్తీభవించె। ...... ముద్రికాభరణంబు ముత్యాలయొంట్లు। భద్రమౌ శ్రీరామభద్రతాళియును। ధరియించి నామతీర్థమునకు వచ్చు। తఱిని ,.....। లక్ష్మమౌలక్ష్మీవిలాసంబుచేరి। పావనంబగు గురుపాదద్వయంబు, సేవించి వారిచే సెలవుగైకొంచుఁ, గపిలధేనువునకు గ్రాసమర్పించి, కపురైన యొక జముకాణము మీఁద। జేరి పద్మాసనాసీనుఁడైయుండి పౌరులు గొల్వ దర్పణము చూచుచును। తిరుచూర్ణరేఖతోఁ దిరుమణి నుదుట। ధరియించి మేనద్వాదశపుండ్రములును। సవరించి మౌక్తికజపసరం బూని। ప్రవిమలాష్టాక్షరీపరమజపంబు।...... ప్రకటవైభవ మొప్ప రాజగోపాలు। నకుఁ దిరువారాధనము సాంగముగను."

రఘునాథాభ్యుదయ నాటకంలోని జమాకర్చులెక్క :-

అట్టవణరంగయ లెక్కవినిపించుట:- “చిదంబరనాథ మొదలారి మీద మూడులక్షల మాళ్లకు చెల్లురెండు లక్షలున్నూ, ముప్ఫైఅయిదువేలు గాకపార్శ్వనిల్వ పదిహేనువేలున్నూ. శుద్ధనిల్వ యాభైవేలున్నూ, అంతునిల్వఅరవై అయిదువేలున్నూ, కుబుసం లక్ష్మయ్యమీద మణియం మనోవర్తి రెండు లక్షలున్నూ, యాభైవేలకు రొఖ్ఖచెల్లు లక్షాయాభై వేలు, ధాన్యానచెల్లు యాభైవేలు, అంతు రెండు లక్షలు గాక నిల్వ యాభైవేలు. నాచమాళిమీదకరతొరలు లక్షవరహాలకు రొఖ్ఖచెల్లు యెనభైవేలు కాక నిల్వ యిరవైవేలు. కోనేటిపిల్లమీద సుంకం పద్ధెనిమిది వేలకు చెల్లు పన్నెండువేలు కాక నిల్వ ఆరువేలమాళ్ళు. అంతునిల్వ లక్షానలభై యొక్క వేలమాళ్ళు”.

ఆ మహాప్రభువుమీద చెప్పబడిన సమస్యలు వందలు! ఒక్కటి :-

“శ్లో॥ కతి కతి న క్షితిపతయః కింతే రఘునాథనాయకాయంతే। భువి బహవః కిల తరవః కింతే సంతానపాదపాయంతే” అరవంలో తిరువైయార్ పురాణం మొదలయిన వెన్నో గ్రంథములు యీ రాజేంద్రుని ఆదరణమీద రచింపబడినవి. “తంజావూరిపాట” అని యిప్పటికి చెల్లుతూవున్న సుప్రసిద్ధి ఆనాడు మనరఘునాథరాయాదులు పుట్టించినదే.

రఘునాథనాయనివారి కుమారుడు విజయరాఘవనాయడు. ఈయన సర్వవిధముల తండ్రినిబోలిన మహాపురుషుడు. మహాభోగి, మహాత్యాగి, అతిసుందరుడు. ఈయన చిరకాలం జీవించి యుద్ధంలో మృతిపొందినాడు. ఈయన కాలంలో యెందరెందరో వేశ్యలు సంగీతసాహిత్యములలో, కవిత్వములో బహుప్రసిద్ధి చెందినారు. శతక్రతుశ్రీకుమార తాతాచార్యులవారు ఈయన గురువు. శ్రీరంగవిమానదర్శనార్థమై యీయన, చుక్కలంటేటట్టు కట్టించిన మేడ యిప్పటికి చెక్కుచెదరకుండా వున్నది. కాని, కొన్నాళ్లకిందట గవర్నమెంటువారు కొన్ని అంతస్థులు తీసివేయించినారు. తంజావూరు, దివాణం, నగరు, యీ ప్రభువు మిక్కిలి పెంపొందించినాడు. రాజగోపాలస్వామికి, మన్నారుదేవునికి అనేక కైంకర్యములు నడిపించినాడు. ఈయన రచించిన



రఘునాథనాయకాభ్యుదయంచివర వున్న విధం :- “ అని హేమకమలా సహాయుని పేర....తన తండ్రియే కులదైవం బటంచు, ననిశంబు గొల్చు మహారాజయోగి, శతసహస్రాధిక సకుటుంబవిప్ర. సతతాన్నదాన దీక్షాధురంధరుఁడు, జీర్ణకర్ణాటక (శ్రీరంగరాయ, పూర్ణసింహాసనాభ్యుదయ ప్రదాత) సింహాసనంబు, పూర్ణించి నిలిపిన పురుషరత్నంబు, కమనీయరుక్మిణీ కళ్యాణముఖ్య, సమధిక నాటకసంవిధాయకుఁడు॥” చెంగల్వకాళయ అనే కవీశ్వరుడు ఈయన పేర అనేక కావ్యములు రచించినాడు. రాజగోపాల విలాసమనే కావ్యములో ఉన్న విధం :-

మ॥ చతురంభోధిపరీతభూవలయవాస్తవ్యావనీదేవతా,
తతులభ్యంజనభోజనాదులను మోదంబందఁగా బ్రహ్మసం
తతిఁబాలించు నృపాలుఁడీతఁడని నిత్యప్రీతుఁడై బ్రహ్మ మ
త్కృతినాథున్ విభవాయురున్నతుల సత్కీర్తుల్ గనంబ్రోచుతున్॥

సీ॥ ఒక్కొక్కయెడఁ జీనిచక్కెర పానకం బానినట్లాహ్లాదమావహిల్ల, ఒక్కొక్కయెడఁ దావి నెక్కొనవిరవాది సరములెత్తినరీతిఁ బరిమళింప, ఒక్కొక్కయెడఁ జవులుప్పతిల్లఁగ మందమారుతంబులు వీచుమహిమ చెలఁగ, ఒక్కొక్కయెడ మేనఁ జొక్కు సంపాదించు వెలఁదివెన్నెల తేటవిధము మించ॥ గీ॥గవిత రచియింప విజయరాఘవవిభుండె, నేర్చు నని వాణి నర్తించు నేర్పు మెఱయఁ, జామరానిలకందళ చలితమగుచుఁ, దనరు సభలోన నలశారదాధ్వజంబు ॥ సీ॥ తీఁగమెఱుంగులతీరున నిరుగడ వరుస బంగారు పావడలు మెఱయ, పఱపుగా వలగొన్న భానుమండలముల హరువున నపరంజిహరిగె లమర, మొగులు మొత్తంబులు మోహరించిన రీతిఁ బమ్ముసాంబ్రాణి ధూపమ్ము లలర, విద్యావిశేషముల్ వేర్వేఱ హవణించుహవణిక బిరుదవాద్యములు మెఱయ॥ గీ॥ వీర వేంకటరాయపృథ్వీ మహేంద్ర, దత్తబహువిధ బిరుదముల్ తనరుచుండ, సముఖమున నిల్చి యాముద్దుచంద్రరేఖ, వివిధవిద్యల వినిపించె వింతయనఁగ॥సీ॥ చౌపదకేళిక రూపవతీకాంత.... చూడామణి చంద్రరేఖ, చెలువగుజక్కిణి చెలువమూర్తి

వధూటి కొరము కోమలవల్లి గురునితంబ, నవపదంబులు లోకనాయికా లోలాక్షి యలదేశి శశిరేఖికాబ్జవదన, దురుపదంబులు రత్నగిరిని తంబినియును బేరణివిధము భాగీరథియును॥ గీ॥ మదనబలదూత్య నవరత్నమాలికాది, బహువిధాలక్ష్యనాట్య ప్రపంచమెల్ల, ఘనత విలసిల్లఁ దక్కినకాంత లెల్ల నభినయించిరి తమనేర్పు లతిశయిల్ల॥ సీ॥ వీణవాయించెను శోణాధరయొకర్తు కిన్నెరమీటెను. కన్నెయొకతె॥... సీ॥ ప్రస్తారసంఖ్యను బదుమూఁడుకోటులు నలుబదిరెండు లక్షలు పదేను, వేలునేనూఱును వింశతియును నాఱువృత్తంబు లందు నీవృత్తమునకు, నీవర్ణనసమస్య నీవు గూర్పు మటన్న నావృత్తమున సమస్యను రచించి యందుకు శ్లోకంబు లాశువుగాఁజెప్పి యవి తెనుంగునను బద్యములు చేసి, యిరువదాఱును ఛందంబు లెఱిఁగియిట్లు॥ కవిత చెప్పినవారు లోకమునఁగలరె, యనుచు వినుతింప వినిపించి ఘనతఁగాంచెఁ, గీర్తనీయ గుణాలంబ కృష్ణమాంబ॥ సీ॥ శ్రీవత్సగోత్రుండు శ్రీకర పాకనాడార్వేలబంధు జనాతిశాయి... పార్వతీ పరిణయ ప్రముఖ ప్రబంధ నిబంధ ధురంధర ప్రౌఢఫణితి॥ గీ॥ యైన చెంగల్వ వేంకటయ్యయును రావి, నూతుల తిరుమలయ్య తనూజకృష్ణ, మాంబయును గన్ననిధికాళహస్తిగిరిశ, కలితచతురోక్తి భారవి కాళసుకవి॥ గీ॥ అయ్యదినముల రామభద్రమ్మవారు, నేఁడు కృష్ణాజి కవితల నేర్పు మెఱసి, వినికిసేయుట లెల్ల మీ ఘనతఁ గాదె, కవివినుతచర్య! చెంగల్వకాళనార్య! సీ॥ శాలివాహన శక సంవత్సరములు వేయేనూఱునేఁబది యేనువరుసఁ, జనఁగ శ్రీముఖ నామసంవత్సరంబున శ్రావణ శుద్ధ పక్షమున ద్వాద, శిని సౌమ్యవాసరంబున దక్షిణ ద్వారకను గృష్ణతీర్థమందు నియమమున, స్నానంబు గావించి సంకల్ప పూర్వంబుగాను షోడశ మహాదానములును, ఘనత మీఱఁ గళావతీ గర్భశుక్తి మౌక్తికఫలంబు రఘునాథ మహిపసుతుఁడు, విజయరాఘవమేదినీ విభుఁడొసంగె, వేదవేదాంగవిదులైన విప్రులకును.... సీ॥ అల సహ్యజాతటి నగ్రహారంబులు బహురేఖమించు నుంబళికయూళ్ళు, బంగరువనుసుల పచ్చలపల్లకి పసిఁ డికొమ్ముల కట్లభద్రకరులు, పడివాగెతేజీలు బంగరుకాళాంజి హడపంబు కాళాంజి హంసకంబు, తరమైన చౌకట్లు తారహారంబులు నంగుళీయాదిరాజార్హ భూష, లెలమి నపరంజిపుల.... ములును గిండ్లు, పెట్టెల కొలంది జాళెలు



మట్టుమీఱినట్టి.... నుడుగర లాత్మఘనత, కనుగుణంబుగ దయచేసి యపుడు మఱియు॥ క. కేళాకూళులుసజ్జల, కేళీవనములును మించు గృహరాజంబుల్, శ్రీలెసఁగనొసఁగిలోకులు, మేలని కొనియాడఁగరుణ మీఱఁగ నంతన్॥ ఉ॥ ఎంతటి భాగ్యశాలి యితఁడెంతటి ధన్యుఁ డటంచు నెంచి శు, ద్ధాంతమునందుఁ బాండ్య వసుధాధిపనందన లాదియైన యా, కాంతలు గొల్వనన్ను సముఖంబునఁ గన్నుల గప్పుకొంచు న, త్యంతబహూకృతుల్ సలుపు నవ్విభు వంశము సన్నుతించెదన్॥

రంగాజమ్మ రచించిన ఉషా పరిణయమున :-

“మఱియును... దానరాధేయుండును... రాజగోపాల నిత్య కైంకర్య ధుర్యుండును, చతుర్వేదశతక్రతు శ్రీనివాసాచార్య చరణసరసిజసేవా నిష్ఠా గరిష్ఠుండును,.... రఘునాథ నృపాలనందనుండును, రచిత కళా వత్యంబికానయనానందుండును నగునవ్విజయరాఘవేంద్రుండు రామణీయక విరచిత రాజరాజ సభా విజయంబగు రాజగోపాల విజయంబునందు నతులిత విలాసవతులైన కులసతులును, విబుధసన్నుతమతియగు విజయవేంకటపతియును, మహితప్రభావుండగు మన్నారు దేవుండును. తతయశోఘనుండగు తాత ఘనుండును, రంగద్యశోవిలాసుండగు చెంగమలదాసుండును మొదలగు నిఖిలజన మిత్రులయిన పుత్రులును, నిరుపమచరిత్ర పవిత్రులయిన పౌత్రులును, నిరవద్యరూపరేఖా కనకపుత్త్రికలయిన పుత్త్రికలును నింపువెలయఁ దామరతంపరై నిండియుండఁ జెంగట శృంగారవతులు రంగురక్తులు మీఱ సంగీతమేళంబు గావింప నగ్రభాగంబున నాచార్యాగ్రేసరుండగు శతక్రతు శ్రీనివాసాచార్యుండు కృతదురితభంగంబగు హరివంశ కథాప్రసంగంబు గావింప నింపుమీఱ, నేనును శృంగారరసంబు చెన్నుమీఱు మన్నారుదాస విలాసంబు వినిపించుచున్న సమయంబున. సీ॥ వేంకటేంద్రుని పుత్త్రి వినుతసద్గుణధాత్రి ఘనయశోరాజి రంగాజి వినుము। మాధుర్యమున మించు మన్నారు దాస విలాసప్రబంధంబు లలితఫణితిఁ । గావించి మిగుల శృంగారంబు గన్పట్టఁబదములు మృదురసాస్పదము లగుచు। రాణింప రచియించి రామాయణంబును

భాగవతంబును భారతంబు॥ గీ॥ సంగ్రహంబుగ రచియించి సరసరీతి॥ మమ్ము మెప్పించితివి చాల నెమ్మిదనర॥ బరcగ హరివంశమున నుషాపరిణయకథ॥ తెనుcగుc గావింపు మిcక నీవు తేట గాcగ" అని సబహుమానంబుగాc దాంబూల జాంబూనదాంబర మాల్యాభరణంబు లొసంగిన నేనును బరమానందంబుం జెందుచుc బతియును, గతియును, గులదైవంబు నయిన నీదుపాదారవిందంబులు డెందంబున సేవించుచున్న తనకు మీ రానతిచ్చు కథాసంవిధానంబు సర్వంబును నవగతంబగుc గావున నట్ల రచియించెదc బంజరశుకంబు మంజువాగ్భణితి రంజిల్లం బలికినం దత్పోషకుండు సంతోషించు తెఱంగున మదీయవచన కుసుమార్చనం బంగీకరించి నన్నుc గటాక్షింపుc డని విన్నవించిన లాలించి యాచార్యచరణంబులకు వందనంబు గావించి యమ్మహామహుని యనుజ్ఞ గైకొమ్మనుటయు, నట్లన సేవించిన దీవించి గురురాజ పట్టభద్రుం డిట్లనియె–

క. నీ పతి మన్నరుదాసుcడు । గోపాలుcడు గనుక నితcడు కోర్కులు హెచ్చం॥ జేపట్టి మనుప నెలకొను॥ నా పలుకుల నెలcత నీ ముఖాంబుజసీమన్. సీ॥ తనరెడు మన్నారుదాసవిలాసంబు నమర నీ వొనరించునప్పుడేము॥ విజయరాఘవమహీవిభునివంశావళి వినిపించితిమి గదా విశదముగను .....మన్నారుదాస విలాసము :– కం॥ చతురాస్యుండనcదగు నీ । పతి యిటు నిను గారవించి బహుమతిదోcపన్॥ గృతిరచియింపుమనెన్ భా॥ రతికిం బ్రతివత్తువమ్మ రంగాజమ్మా॥ సీ॥ నా విభుండైన మన్నారుదాసునిచేత (విజయరాఘవుcడే) ముదమున మంజరీముఖ్యకృతులు, పొగడొంద నంకితంబుగcగాంచు శ్రీరాజగోపాలశౌరికిc గోర్కిమీఱ, నే నంకితముసేయు నిటువంటి మన్నారుదాస విలాసంబు ధరణిలోన, బరమభాగవతుని చరితంబు గావున వినిన వ్రాసినc జదివిన జనులకు॥ గీ॥నాయురారోగ్య పుత్రపౌత్రాభివృద్ధి, ధన కనక ముఖ్యవస్తు వాహనసమృద్ధి, నిరుపమాన కవిత్వ పాండిత్య మహిమ, కలుగు నాచంద్ర రవితారకంబుగాcగ॥

ఈ విద్వాంసురాలి గద్య :–

ఇది శ్రీ రాజగోపాల కరుణాకటాక్ష వీక్షణానుక్షణ ప్రవర్ధమాన



సారస్వతధురీణయు, విచిత్రతర పత్రికాశత లిఖిత వాచికార్థావగాహన ప్రవీణయు. దత్ప్రతిపత్రికా శతస్వహస్తలేఖన ప్రశస్తకీర్తియు, శృంగార రసతరంగిత పదకవిత్వ మహనీయమతి స్ఫూర్తియు, నతులితాష్ట భాషాకవితా సర్వంకష మనీషా విశేష శారదయు, రాజనీతి విద్యావిశారదయు, విజయరాఘవ మహీపాల విరచిత కనకాభిషేకయు, విద్వత్కవిజనస్తవనీయ వివేకయు, మన్నారుదాస విలాస నామకమహాప్రబంధనిబంధన కృతలక్షణయు, మహనీయ రామాయణ భాగవత భారత కథాసంగ్రహణ విచక్షణయుc, బసపులేటి వేంకటాద్రి బహుజన్మతపః ఫలంబును, మంగమాంబా గర్భశుక్తి ముక్తాఫలంబును, రంగద్గుణకదంబయునగు రంగాజమ్మ వచన రచనా చమత్కృతిం జెన్నుమీఱు నుషాపరిణయం బను మహాప్రబంధంబునందుc బ్రథమాశ్వాసము.

* ఈ మహారాజు సదాకాలము వేశ్యలతో సంతోషిస్తూ ఉండగా, పతివ్రత అయిన పట్టపురాణి, వేశ్యను నిందిస్తూ దానిద్వారా యేమో కబురంపిందట. విద్వాంసురాలైన (రంగాజో,కృష్ణాజో ఎవరో!) ఆ వేశ్య ఈ పద్యము రచించి తిరిగి పంపినదట:–

ఉ॥ ఏ వనితల్ మముం దలcప నేమిపనో తమ రాcడువారుగా
రో వలపించునే ర్పెఱుగరో తమ కౌcగిటిలోన నుండcగా
రావదియేమిరా విజయరాఘవ! యం చిలుదూఱి బల్మిచేc
దీవరకత్తెనై పెనcగి తీసుకవచ్చితినా తలోదరీ॥

ఈ క్రింది పద్యమున్నూ ఆ మహారాజును గూర్చి చెప్పబడ్డదే –

ఉ॥ రాజనిభాననా! సరసురాలవు జబ్బుగ నల్లినా వదే
మే జడ? యింతకంటె వలెనే? వెలనే బిగియించి యల్లవే
యోజవరాల! వేఱె పనియున్నది; దోసమె! దోసమే!! మహా
రాజగునట్టి యవ్విజయరాఘవుమై చిగురాకె కోమలీ!
ఇట్టి పద్యములెన్నో ఉన్నవి. వేశ్యలు చెప్పినవే! పద్యాలు సరిగదా!

*ఈ సందర్భం పొరబాటున పూసపాటి విజయరామరాజుగారిదిగా "చాటుపద్య మణిమంజరి" లో వ్రాసినాను. కాదు, ఈ విజయరాఘవనాయణ్ణి గూర్చినదే! ఇంకా కొన్ని పద్యములు ఈ మహారాజు మీదివి అందులో ఉన్నవి చూడండి!.

పదాలెన్నెన్ని ఉన్నవి! ఆహా! వందలువందలు! యక్షగానాలెన్నెన్ని! ఎంతెంత స్వారస్యం! రెండు యక్షగానాల నుండిరెండు పద్యాలు, రెండుపదాలు చూపుతాను:– విప్రనారాయణ చరిత్ర:– క. అక్కక్క! చూచితే వీఁ, డక్కట! మనదిక్కు చూడఁడతంటివాఁడా!, చక్కెరవిల్తుని గెల్చిన, ముక్కంటియు నన్నుఁ జూచి మోహింపఁడటే!

క. నీ నటనలు గని చొక్కను, నా నటనలు గాంచి చొక్కనటుఁడో విటుఁడో, యీ నారాయణదాసుఁడు, సానులకును మౌనులకును సంగతి గలదే!

**పూతనాహరణ నాటకం :–**

నల్లనిదేవర నామము సాతిన, బల్లాలరాయడు బసవయ్య కొడుకు, నారదయ్యసుప్పనాతిని పెళ్ళాడి, బారతకత సెప్పెబైరదేవరకు, రంబకు బుట్టినరాబణుడనగాను, కుంబకర్ణుని పెద్ద కొడుకుగాడంట్రా॥ అతికాయుడంగదు డలధర్మరాజుతో, అతివకై పోట్లాడిరదివింతగాదా!॥ మనకు వరాల్చి మైలారదేవర అనుమంతుదేవర కల్లుడుగాడా॥ తన్ను వేసివాడు నన్నెత్తుకొనిపోయె, కన్నగాడుసూడుకాట్రేనితోడు॥ దూడలుమేపుతూ, ఆడనున్న నన్ను, ఈడకుదెచ్చినవాడెవ్వడురా॥ గొంగడిగానము కోపమువచ్చేని, గంగడు సేసినకపటముగాదా! నా ముక్కులోపల నాలికగానము. యేమి సేసిపోయెనెఱ్ఱుడువచ్చి॥ అక్కలమ్మకు నేడు మొక్కుసెల్లింతాము, వక్కలాకులు వేగవందరవోరీ ॥ గొల్లలకెల్లను కొలము దేవరవయి, యెల్లమ్మయెల్లమ్మ! యేలుకోవమ్మా!॥

పాండ్యరాజులకు, ఈ చోళరాజులకు, అచ్యుతప్పనాయని వారికాలంనుండి తగవులుసాగుతూ వచ్చినవి. తిరుమలశౌరి, భార్యను చంపినాడన్న సంగతి యెంత నిజమో! సరియయిన గ్రంథ దృష్టాంతములు కానరాలేదు. గొబ్బూరి జగ్గరాజుమూలమున నడిచినయుద్ధం సుప్రసిద్ధం. చొక్కనాథనాయనితో యుద్ధంచేసి వీరస్వర్గం పొందేటప్పటికి విజయరాఘవనాయడు ముసలివాడు. ఆ యుద్ధంలో స్త్రీ బాలసహితంగా



అందరూ హతమైనది సత్యము. ఆ నగరిలో ఇప్పటి సరస్వతీ మహలులో ఒక పార్శ్వమందు స్త్రీలందరూ దగ్ధమైరని స్థలజ్ఞులు చెప్పుతూ వున్నారు. ఇప్పటికిన్నీ, ఆ పక్కలకు మహారాష్ట్ర రాజస్త్రీలు ఎవ్వరూ వెళ్లరట! అక్కడ కట్టడపుమీదితట్టు నల్లగా మాడిపోయి చెక్కలు చెక్కలు రాలిపోయినగుర్తు యిప్పటికీ ఆ వెనకటి మహాదహనమును జ్ఞాపకపరుస్తూ వున్నది. పరువుమర్యాదలుగల రాజసంబంధులందరూ ఆ మహాయుద్ధంలో మడిసి పోయినారు. నాయకరాజులు పుణ్యలోపంచేత భూమిపై అవతరించిన దేవతలని చెప్పవచ్చును. వారిదశ ఆ విధంగా నడిచినది. భరతఖండములో ఉత్తరమున కాశ్మీరదేశము యెటువంటిదో దక్షిణమున చోళమండలము అటువంటిది. బంగారుపండగల ఆ భూమిని పరిపాలించి నాయకరాజులు సంపాదించిన భాగ్యమంతా దేవతలపాలు, భూదేవతలపాలు చేసినారు. ఇప్పటికి తంజావూరు జిల్లాలో రెండు వేల దేవాలయము లున్నవి. హిందూదేశం అంతటిలో దేవాలయముల శోభచూడవలెనంటే దక్షిణదేశంలోనే గదా చూడవలెను! వారు దేవాలయములు దేవతాస్థానములుగానే గాక రాజ్యంగరక్షణ స్థానములుగా కూడా కట్టినారు. తంజావూరుబృహతీశ్వరుని ఆలయపుకట్టడిట్టం చూస్తే ఆశ్యర్యం కలుగుతుంది. తంజావూరుజిల్లాలో అగ్రహారములకూ, ధర్మసత్రములకూ మితిలేదు. పంచనదం మొదలైన పుణ్యక్షేత్రముల వైభవం దర్శించి తీరవలెను. ఆ కావేటికాల్వలసొంపు చూచితీరవలెను. విద్యావిశారదులు గనుక ఆ నాయకరాజులు సరస్వతీ భాండాగారం వొకటి నెలకొల్పినారు. అద్భుతగ్రంథములు అనేకం అందులో వున్నవి. పోయినవి పోగా ఆనాడు యజ్ఞనారాయణదీక్షితులు, రంగాజి మొదలైనవారు తమ చేతులతో వ్రాసిన తాటాకుల పుస్తకములు కొన్ని యిప్పటికీ ఆ పుస్తకభాండాగారములో ఉన్నవి. నాయకరాజులు లేరుగాని ఇదివరకు ఉదాహరించిన విధమున రాచనగరు ఇప్పటికీ వున్నది. ఆ కొల్వు కూటములున్నవి. ఆ రామభద్ర విగ్రహాలు ఉన్నవి. ఆలాఁగుల చప్పరాలున్నవి. సంగీతశాల లున్నవి. ఆయుధాగారము లున్నవి. ఎన్నెన్నో వున్నవి. ఆయా భాగములన్నీ గ్రంథదృష్టాంతముల ప్రకారం పరిశీలించి గుర్తించి కాలవైపరీత్యమునకు కటకటా! అని వగచి కన్నులనీరు కార్చినాను.

దక్షిణదేశంలోని ప్రజలు ఇప్పటికిన్నీ నాయకరాజుల పుణ్యకథలు ఒళ్ళుపులకరించగా, కన్నుల ఆనందబాష్పములు రాలగా, స్మరిస్తూ వుంటారు! ఈ విషయం ఇంతట నిలుపుతాను–ఫలమేమి?[1]

చొక్కనాథనాయనివారి ప్రతినిధిగా తంజావూరుకు వచ్చిన "అళగరి" ఆంధ్రభాషపై అంత్యంతాదరము కలవాడు. కామేశ్వర కవిచేత యితడు సత్యభామాసాంత్వన మనేకృతి చెప్పించినాడు. చొక్కనాథనాయని వారికి అతడు సవతితమ్ముడని సత్యభామా సాంత్వనములో వున్నది. ఇందులో దూదుభాయి అని వున్నది.[2]

ఇంక రాయసం వెంకన్ననియోగిగారి పన్నాగములు పరికించండి; బలే తంత్రగొట్టు. చెంగమలదాసును ఉద్ధరించేటందుకు కంకణం కట్టినాడు. అళగరికి, చొక్కనాథనాయనికి స్నేహం చెడగొట్టినాడు. కావలసిన పరివారం కూర్చుకొన్నాడు. ఎంతెంతో చేసినాడు. చెంగమలదాసుని సింహాసనమెక్కించి నాయకరాజ్యం నిలవబెట్టినాడు. ఈతని చరిత్ర యీ విధంగానే నడచివుండెనా చాణక్యుడు, రాక్షసుడు, యుగంధరుడు మొదలైనవారివలె జగత్పూజ్యుడై వుండేవాడు. ఈ పరిశ్రమ అంతా స్వార్థంకోసం నడిచినది. స్వార్థానికి భంగం వచ్చేటప్పటికి, తాను కోరుకున్న పదవి తనకు రాకపోయేటప్పటికిక, కూడదీసిన రాజ్యం కూలదోసినాడు. అంత ఘనకార్యం నడిపిన వానికి

1. చం. చిలుపనితావులుం జవులుఁజిమ్మెడు కమ్మనిపూపుఁ దీవలో । వలగొని గానలక్ష్మినిలువన్ జెలువమ్ములు నించు రూపరే। ఖలొ యనునట్లు తంజపురిఁ గన్నెలు కొందఱు గొబ్బిపాటమె। చ్చులొలుక వీనులంగనులఁ జుబ్బనచూఱలు జుట్టిపొంగితిన్

మ. వినునోవీనులు, కాంచునోకనులు, నువ్విళ్ళూరునోజిహ్వానె। మ్మనమే మయ్యెనొ, తక్కునంగములు నెమ్మాడ్కింబ్రవర్తించునో। యనుమానింపఁగ రాక తంజపురి దివ్యస్తవ్య మార్దంగిక। స్వనగానామృతపానపుందమి మహోత్సాహంబు మాకేర్పడెన్.

2. ఇతడు బింకాలమారి. పొగడితే పొంగిపోయేవాడు. తంజావూరికోట నాలుగు తట్టులనూ యేకోజీని నాలుగురోజులలో తాను వోడించినట్టు "పెద్దళగరి విజయము" అని గ్రంథం చెప్పించుకొన్నాడు. ఉళక్కిగెల్పు చాటించుకొన్నాడు. నాలుగు దిక్కులకూ నాలుగు ఉత్పల మాలికలు పెద్దవి. మొత్తం చరణాలు 530 ఉంటవి. గ్రంథం పెరిగిపోతుంది. కొంచెం కూడా ఉదాహరించలేను



తగదుగదా యింత క్షుద్రపు స్వార్థవాంఛ! తన నీచబుద్ధికి ఫలం అనుభవించక పోయినాడా! అన్నీ అన్నిగానే యేర్పడినవి. దాసీది రాజ్యాంగ విషయంలో ఆలోచన చెప్పడమేమిటి? కోమటిబిడ్డ మంత్రిత్వమేమిటి? "కోమటి పిరికి నూతిలో వురికె" అంటారు. చేతగాని దొరతనం సంగతి యీ విధంగానే వుంటుంది. ఇంతకూ, రాయసం వెంకన్నే చేతులారా చెరిచినాడు. తాను చెడ్డాడు. చోళరాజేలినా, పాండ్యరాజేలినా, ఇద్దరూ తెలుగువారే, మనవాళ్ళే. పిట్టతగవుపిట్టతగవు పిల్లి తీర్చిందన్నట్లు తగవులన్ని చల్లార్చి తానే యేకోజీ రాజ్యంకట్టుకొన్నాడు 1674 సంవత్సరమున; ఈ యేకోజి జగత్ప్రసిద్ధుడయిన శివాజీకి తమ్ముడు. నాటితోసరి చోళదేశానికి తెలుగు రాజ్యపు సంబంధం ; నాటి నుండి నిన్న మొన్నటిదాకా యేకోజీసంతతివారే–మహారాష్ట్రులే పాలించినారు. వీరు నాయక రాజులకీర్తిని నిలిపినారేగాని చెరపలేదు. వీరూ పెక్కుమంది తెలుగు కవులను ఆదరించినారు. తెలుగు భాషను మిక్కిలి పోషించినారు. మహారాష్ట్ర రాజుల చిత్రపటములు ఎన్నెన్నో తంజావూరు నగరిలో వున్నవి. కాని, నాయక రాజుల చిత్రపటం వొకటి కూడా కానరాదు. మహారాష్ట్ర రాజులే నాశపరచి వుందురు. కాలప్రవాహం మహారాష్ట్ర రాజులనూ ముంచివేసినది. భవభూతివర్ణించినట్టు అంతా మారిపోయింది గాని ఆ మేడలు, మిద్దెలు వగైరాలు ఇంకా చెడక, వెనకటి స్థితిగతులను స్మరింపజేస్తూ వున్నవి.

దక్షిణ దేశంలో పుట్టిన తెలుఁగు ప్రబంధాలు వందలువందలు. ముక్కుమొగం చూడక కొందరు వెక్కిరిస్తున్నారు మంచి ప్రబంధాలు కావని; కాని, వారి మాటలను మనం పాటించరాదు. మంచి కాలం వస్తుంది. అందరూ వాటివల్ల ఆనందిస్తారు.

అసలుకు మించిపోయింది కొసరు. అయినా చెప్పవలసిన సంగతులెన్నో చెప్పనేలేదు విడిచిపెట్టినాను. ఈ ప్రచురించిన అసలు కథావృత్తాంతం చెన్నపురి లైబ్రరీలో వున్నది. హెచ్చు తగ్గులు చెయ్యలేదు. కాని, కొత్తచేసినాను. భాషాస్వభావం పాడుచెయ్యలేదు. ఇందులోకథలవంటి సందర్భములు కొన్ని ఉన్నవి – ముక్కరవృత్తాంతం మొదలయినవి. నేను

తీసివేయలేదు. మథురరాజుల చరిత్ర కూడా వ్రాయవలసినదే. ఆంధ్రులు పూర్వమింత ప్రాభవము అనుభవించినారు.* నాయక రాజులకీర్తిని ఆరాధించవలెననే కోరికను ఈ విధముగా తీర్చుకొన్నాను.

**వేటూరి - ప్రభాకరశాస్త్రి.**

చెన్నపురి.
10-6-1914

* సీ॥ చోళ దేశమ్మున్ను చుట్టుముట్టిరి పాండ్య మండలంబున వెన్కనిండిరాంధ్రు। లవలఁగేరళదేశ మాక్రమించిరి మీఁద సింహళంబునకు నంజియలు వైచి। రలనాఁడు తమబాస తెలుఁగుబాసయె రాజభాషగాఁబూజింపఁ బడియె నచట। నాంధ్రులిప్పటికినయ్యె దేశములయందుఁగల రెంద రెందరోకలరు తెలుఁగు॥ గీ॥ ఆంధ్రులన ద్రావిడులనంగ నన్నదమ్ము। లొక్కఫలమున బీజముల్రెక్కమిప్పు। డెందు నైకమత్యంబునఁ బొందిపొసఁగి। యాత్మహితములనందుట యర్హమ కద।

# ప్రబంధరత్నావళి పీఠిక

ప్రాచీన కావ్యాలంకారము లిప్పుడు కొన్ని బయల్పడుచుండుట మనయాంధ్ర భాషావధూటియదృష్టవిశేష మనవచ్చును. చెల్లాచెదరులై లోకమునం జెకుఱుచున్నయట్టి సుకవితాలంకారములు కాలక్రమమున వంకలుదీరి భాషా సౌభాగ్యమును బరిపుష్ట పఱుపఁగలవు. క్రొంగ్రొత్త కవనములఁగూర్చుటతోఁ బ్రాఁబడిన కవనముల బయల్పఱుచుటయు భాషాసౌందర్యమునకుఁ బోషకమేగదా! గ్రంథరూపమును గైకొనకయ, లోకమునఁ జెకుఱుచున్న యాంధ్రకవితా వాఙ్మయమపారముగా నున్నది. అందుఁ గొంత భాషాయోషకుఁ బ్రాణప్రాయ మనఁదగినదికూడను; నాకిట్టి వాఙ్మయమును సేకరించుట యందుఁ గోరిక కొండంత. ప్రాచీనకవీశ్వరరచితము లగుచాటుధారలను బెక్కింటి సమకూర్చి చాటుపద్యమణిమంజరి యనుపేర నింతకుముందు సంతరించితిని.[1] మఱియు నవకము, చవి, చక్కన కలిగి యాంధ్రతావాసనలఁ బరిమళించు మధుర కవితలఁ బెక్కింటి సేకరించి వేఱొక గ్రంథమును వెల్వరింపనున్నాఁడను.[2] ప్రాచీన కవీశ్వర కృతములై యీనాఁడు దొరకకున్న ప్రబంధముల నుండి ప్రాచీనులే సేకరించియుంచిన పద్యసముదాయమును ''ప్రబంధరత్నావళి'' యనుపేర నిప్పుడు ప్రచురించితిని.

ఇందలి పద్యములను సంకలనము సేసినవా రిర్వురు. ఒకఁడు పెద్దపాటి జగన్నాథకవి; నారాయణస్తుతి, శంకరస్తుతి, త్రిపురవిజయము, అర్ధనారీశ్వరము నని మొదలువెట్టి యిట్టి తెలుఁగునఁ బెక్కువర్ణనాంశముల నేర్పఱుచుకొని యైదాశ్వాసములుగాఁ "బ్రబంధరత్నాకర" మను పేర నీతడు గ్రంథము సంధానించెను. పై గ్రంథమున మొదటి మూఁడాశ్వాసములు మాత్రమే తంజాపురపు సరస్వతీపుస్తక భాండాగారమందున్నవి. కడమగ్రంథ మెక్కడను గానరాలేదు. వేఱొక్కనిపేరు తెలియరాదు. అతని సంధాన మాంధ్రసాహిత్యపరిషద్భాండాగారమునందున్నది. ఆ సంధానమునకుఁ బేరు

1. చాటు-ప్రథమ భాగము 1913; ద్వితీయభాగము 1922, 1952 (ప్రకాశకులు).
2. ఇందు 'బాలభాష' అను విభాగము మాత్రమే వెలువడినది. 1930(భారతి). ఇదే ఆ తరువాత గ్రంథరూపమున వెలువడినది. ( ప్రకాశకులు).

లేదు. మొదలు లేదు. తుదలేదు. పరిషత్తువా "రుదాహరణ పద్యము" లని పేర్కొన్నారు.[1] ఈ యిర్వుర కూర్పులందలి పద్యములను గ్రుచ్చియెత్తినేనీ ప్రబంధరత్నావళిని గ్రొత్తవెలయించితిని. పై యిరువుర సంధానము లందుండినను నిప్పటికిక ముద్రితములై సుప్రసిద్ధములై దొరకుచున్న నన్నయాదుల భారతాదులలోని పద్యముల నిందుఁ జేకొనలేదు. కవులను గావ్యములందలి పద్యములను గూడ నకారాద్యక్షర క్రమమునకుఁ దార్చితిని. భాషాకవి చరిత్రాద్యపేక్షకుల కీచేఁత మిక్కిలి సాహాయ్యక మగునని చక్కఁ జర్చించియే సల్పితిని. ఇర్వురసంధానములు వేర్వేఱుతెఱఁగులవి. ఆ రెంటిని జేర్చుటలో విషయానుక్రమణికిఁ జిక్కుకలదు. పూర్వోత్తర సందర్భ రాహిత్యమిప్పుడేకాక యప్పుడు నున్నది. ఆ కూర్పులు కూడఁ గథాఘటితములు కావు. కావున నీ మార్పు సేఁత కొంత చిక్కును దీర్చుటయే.

ప్రయోగరత్నాకరము[2] రంగరాట్ఛందము మొదలగుకొన్ని లక్షణ గ్రంథములందుఁ బ్రాచీనకవికృతములుగాఁ గొన్ని ప్రబంధములపేళ్లతోఁ బద్యము లుదాహరింపఁబడియున్నవి. ఆ పద్యములను గూడ నీ కూర్పునందుఁ జేర్పఁజూచితిని గాని యాలోచింపఁగా నం దసత్యతాసంశయము సంఘటిల్లెను. గణపవరపు వేంకటకవి ప్రభృతులు కొందఱు తమకు సమ్మతము లగుకొన్ని ప్రయోగములను నిల్వరించుకొనుటకయి తమ లక్షణ గ్రంథములందు లక్షణ కల్పనముచేసి లక్ష్యముగాఁ బ్రాచీన కవీశ్వరకృతులైనట్లేవో గ్రంథనామములును పద్యములును సృష్టించియుందురని తోఁచెను. నన్నయ ఇంద్రవిజయములోని దట యీ పద్యము!

క॥ "అంగజుఁ డనుమాసటి చ
క్కంగను రాయంచయేనుఁగను నూఁకుచుఁ జే
చెంగలువ నేజచేఁ జెలి
చంగవనడుచక్కిఁ గ్రుమ్మి సరగున నార్చెన్"

విశ్వాస్యమగునా? ఇట్లే భాస్కరుని సునందోపాఖ్యానము, సోముని

1. ఇది నాకు శ్రీ కె.వి. లక్ష్మణరావు పంతులుగారి మూలమున వచ్చినది.
2. ఇది గణపవరపు వేంకటకవిది. తంజాపుర పుస్తకశాలలో నున్నది.



హరవిలాసము, భీముని నృసింహపురాణము మొదలగునవి. కావున లక్షణ గ్రంథము లందలి పద్యముల నిందుఁ జొందింప మానితిని. అవియెల్ల వేఱొక కూర్పుగా వెల్లడించెదను.

పెద్దపాటిజగన్నాథకవి కృష్ణామండలమందలి యేలూరునకుఁ జేరువనున్న పెదపాడు నందున్నవాఁడు. తన గ్రంథము నతఁడు నీలాచలమందు నెలకొన్న జగన్నాథస్వామి కంకితము సేసినాఁడు. అతని వంశస్థితి మొదలగునది యీ గ్రంథము ననుబంధమును జూచి యెఱుంగునది.[1]

ఇర్వురుసంధాతలును గొంచె మించుమించుగా సమకాలము వారనియే తలఁపవచ్చును. మన మెఱిఁగినంతలో జగన్నాథకవి యుదాహరించినవారిలో మాదయగారి మల్లయ్య, తెనాలి రామలింగయయును, రెండవ సంధాత యుదాహరించిన వారిలో నల్లసాని పెద్దనార్యుఁడును నర్వాచీనులు. జగన్నాథకవి కంటె నిర్వదేండ్లు రెండవ సంధాత ప్రాచీనుఁడయినను గానవచ్చును.

గ్రంథమున నకారాద్యక్షరక్రమమున నుదాహరింపఁబడిన యథర్వణాదులగు కవులను గూర్చియుఁ దత్తత్కృతులను గూర్చియు దెలుపఁ దగిన నూత్నవిషయముల నిఁక నిందుఁ గొండొక వివరించుచున్నాఁడను. ఇందు నేను బేర్కొనని వారింగూర్చి భావికాలపరిశీలనములవలనఁగాని నేఁడే యింతకంటె హెచ్చు పరిశీలించియుండిన ప్రాజ్ఞలోకము మూలమునఁ గాని విశేషవిషయములు బయల్పడవలయును.

అథర్వణాచార్యుడు :- ఈతని భారతము లాక్షణికు లుదాహరించెదరు. 'తృష్ణాతంతు' అన్నపద్యము లక్షణగ్రంథమందలిదే. ఈతని యాంధ్ర ఛ్ఛందస్సు నాకు లభింపలేదు. వికృతివివేకమనియు, త్రిలింగ శబ్దానుశాసన మనియు సంస్కృతమున రెండాంధ్రవ్యాకరణ గ్రంథము లీతనిపేరఁ గానవచ్చుచున్నవి. ఈ రెండును నథర్వణునిపేర నిటీవలఁ గల్పింపఁబడినవే యని యూహ. "శ్లేషే సఖండనిర్బిందోః" రిత్యాదిలక్షణము లుండుటనుబట్టి యా యూహ యుక్తమకాఁదోఁచుచున్నది. అరయఁగా, సంస్కృతమున నున్న యాంధ్రవ్యాక

1. చూ. ప్రబంధరత్నావళి అనుబంధము-ం పు. 129-134 ( 1976) (ప్రకాశకులు)

రణములన్నియుఁ గొంత యసత్యకల్పనముతోఁ గూడినవిగనే కన్పట్టును.
రా.బ. కందుకూరు వీరేశలింగము పంతులుగారు :-

"ప్రమాణ మకలంకస్య పూజ్యపాదస్య లక్షణమ్"[1] అని వికృతి వివేకమున బేర్కోఁబడిన యకలంకుఁడు కర్ణాటక వ్యాకరణమును రచించిన యకలంకుఁడనియు, నాతడు క్రీ.శ. 1604 లో నుండెను గావున నది యహోబల పండితుని కాలముననే సృష్టింపబడియె ననియుఁ గ్రొత్తవెల్వరించిన కవులచరిత్రమున విశేష విషయము చేర్చినారు. ఇది సిద్ధాంతము కానేరదు. అకలంకుఁడు ప్రాచీనుఁడున్నాఁడు. ప్రాకృత వ్యాకరణకర్తలలోఁ బూజ్యపాదుఁడు ప్రాచీనతముఁడు; ప్రసిద్ధుఁడు; క్రీ. 1490 ప్రాంతమున 'నౌదార్య చింతామణి'[2] యను ప్రాకృత వ్యాకరణము రచించిన శ్రుతసాగరుఁడు వీరిని బేర్కొన్నాఁడు. వికృతివివేకమునఁ బేర్కొనబడినవారు వీ రేల కారాదు? ఆ శ్లోకము లివి :-

"సమంతభద్రై రపి పూజ్యపాదైః కలంకముక్తై రకలంకదేవైః
యదుక్త మప్రాకృత మర్థసారం త త్ప్రాకృతం చ శ్రుతసాగరేణ
శ్రీపూజ్యపాదసూరి ర్విద్యానందీ సమంతభద్రగురుః।
శ్రీమదకలంకదేవో జినదేవో మంగళం దిశతు.

శ్రీపూజ్య పాదనకలంకసమంతభద్ర
శ్రీ కుందకుందజినచంద్రవిశాఖసంజ్ఞాః
శ్రీ మాఘనందిశివకోటిశివాయనాఖ్యాః
విద్యాదనందిగురవశ్చ మమీ దిశంతు."

సమయ సంకోచముచే నీ విషయమింతట విడిచెదను. బ్రహ్మశ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు,

1. జైనులకు:- శ్లో॥ ప్రమాణకలంకస్య పూజ్యపాదస్య శాసనమ్ । ద్విసంధాన కవేః కావ్యం రత్నత్రయమిదం స్మృతమ్.
2. ఇది విశాఖపట్టణమున శ్రీ పరవస్తువారి యార్షపుస్తకశాలలో నున్నది.



"క. మగణమ్ము గదియ రగణము
వగవక కృతిమొదటనిలుపు వానికి మరణం
బగునిక్క మంద్రు మడియఁడె
యగునని యిడి తొల్లి టెంకణాదిత్యుఁడనిన్."

అను పద్య మథర్వణాచార్యుని ఛందమందలిదని కుమారసంభవ పీఠికలోఁ జేర్చినారు. వారు దీని నేదేని లక్షణగ్రంథములను జూచి కైకొనిరో యథర్వణఛందమును జూచియే కైకొనిరో చెప్పలేదు. ఇది యథర్వణుని దగునాఁడాతఁడు నన్నిచోడని కంటెఁ దర్వాతివాఁడగును. మఱియు వారే క్రీడాభిరామమును ముద్రించుచు దానికి నాందిగా "అంబరసీమఁ దారలు" అను పద్యము నతకరించి యది 'యథర్వణుని భారత విరాటపర్వమున మొదటి యాశ్వాసము నుండి' యెత్తఁబడినట్లు వ్రాసినారు. వారు దాని నథర్వణభారత విరాటపర్వ ప్రథమాశ్వాసమునఁ జూచిరేమోగాని, యిందు 'దామరాజు సోమయభరత' మందలిదిగాఁ గూర్పఁబడియున్నది. ఏది సత్యమో?

అన్నమయ్యంగారు, తాళ్లపాక :- ఈతఁడు రా.బ.కం. వీరేశలింగముపంతులు గారి కవులచరిత్ర ప్రథమభాగమునఁ జేరవలసినవాఁడు. పదునాల్గవ శతాబ్దిలో నించుమించుగా శ్రీనాథునికాలమున నున్నవాఁడు. తిరుపతి తామ్రశాసనమునుండి ఈ విషయ మెఱుఁగఁబడును.

అప్పన :- ఈతఁడు భోజమహారాజుచే సంస్కృతమున రచియింపఁబడిన చారుచర్యను దెలుఁగుసేసినవాఁడు. ఏనాఁటివాఁడో తెలియదు. రచనమును బట్టి ప్రాచీనుఁడని యూహించితిని. గ్రంథారంభ మిట్లున్నది.[1]

"క. ప్రత్యూహబహుళతిమిరా
దిత్యుడు శ్రీకీర్తిభారతీసంతతసం
పత్త్యున్నతుండు శ్రీహరి
నిత్యుఁడు నాగాంబయప్పనికిఁ బ్రియమొసఁగున్

1. ఇది శ్రీ ముక్త్యాల ప్రభువులగు శ్రీరాజావాసిరెడ్డి చంద్రమౌళీశ్వర ప్రసాద బహద్దరుగారి పుస్తకశాలలో నున్నది. తంజావూరు పుస్తకశాలలో గ్రంథారంభము కొంచెమున్నది. (ముద్రితము 1922; 1957)

సీ. విద్వన్నుతుండు భారద్వాజగోత్రుఁ డాపస్తంబసూత్రుండు పరమపుణ్య
విమలోజ్జ్వలాంగి గోవిందార్యునకుఁ గులద్వయశిరోభూషణధర్మచరిత
నాగమాంబకుఁ గూర్మినందనుఁ డప్పయమణిమౌళి సింగనామాత్యుమేన
యల్లుఁడు ధార్మికుఁ డనఘుండు శ్రీ వల్లభాచార్యుతమ్ముండు హరిపదాంబు

గీ. జాతషట్పదుఁడుభయభాషాకవిత్వ
మానవైదగ్ధ్యుఁ డప్పనమంత్రివిదుఁడు
సంస్కృతంబున నొప్పారు చారుచర్యఁ
దెనుఁగు సేసెఁ దా నెంతయుఁ దేఁటపడఁగ

ఉ. రాజహితంబుపొంటె సుకరంబుగ వైద్యసునీతిధర్మని
ర్వ్యాజపథానుసారమధురంబుగ నిర్జరభాషఁ దొల్లి యా
భోజునిచేతఁ జెప్పఁబడి పొల్పగు నీకృతి నూత్నసత్కళా
భోజుఁడు మంత్రియప్పన ప్రబుద్ధుఁడు చేసెఁ దెనుంగు బాసఁగన్.

**ఎఱ్ఱయ, కూచిరాజు** :- సకల కథానిధాన మని,[1] కొక్కోకమని యీతని కృతులు రెండున్నవి. కొక్కోకము సర్వత్ర దొరకునదియే. ఇందలి సకల పురాణసారము మూఁడవది. ఇది యింతదనుక లభింపలేదు. సకల కథానిధానపుఁబీఠికలో నిది పేర్కొనఁబడినది. చూడుఁడు.

సీ. శ్రీవత్సగోత్రవారిధిపూర్ణశీతాంశుఁ డగుకూచమంత్రికి నాత్మజుఁడవు,
వివిధాష్టభాషాకవిత్వవాచాప్రౌఢిఁ బూర్వకవీంద్రులఁ బోలినాఁడ,
వఖిల పురాణేతిహాసకావ్యస్మృతిచయము రచించిన చారుమతివి,
మా పినతండ్రియౌ మల్లమంత్రికిని గొక్కోకంబు సెప్పిన కోవిదుఁడవు,

గీ. రసికు లభినుతిసేయఁ బురాణసార
మనుపమంబుగ నాకిచ్చినట్టి ప్రోడ
వట్లుగావున నొకటి నిన్నడుగఁ దలఁచి
యిచ్చటికిఁ బిల్వఁబంచితి నెఱ్ఱనార్య!'

1. ఇది ప్రాచ్యలిఖితపుస్తకశాలలో గ్రంథపాతములతో నున్నది. ముద్రింపఁ దగిన యుత్తమకావ్యము. ప్రత్యంతరము దొరకలేదు.



**కేతనప్రెగడ** :- ప్రయోగరత్నాకరమందు "భాస్కరుని కేతన కాదంబరి" అని కలదు. దశకుమారచరిత్ర కర్త మ్రానయకేతన కావున నాతఁడు వేఱగును. తిక్కన సోమయాజి పితృవ్యుఁ డొక కేతన కలఁడు. అతని తండ్రి భాస్కరుఁడే. దశకుమారచరిత్రమం దీ విషయము గానవచ్చుచున్నది. అందలి వర్ణనమును బట్టి చూడఁగా నా భాస్కరుని కేతనయుఁ గవిగా నెఱుఁగఁబడుచున్నాఁడు.

చ. కవితకు ముఖ్యుఁ డీతఁ డనఁ గామితవస్తువు లిచ్చువాఁడునా
నవరసభావకుం డితఁ డనన్ బురుషార్థపరాయణుండునా
నవునన రాజనీతివిషయజ్ఞుఁడితం డనఁ గీర్తిచంద్రికా
ధవళితదిక్కుడై నెగడె ధన్యుఁడు కేతనమంత్రి యిమ్మహిన్. (దశకుమార)

కాదంబరీ దశకుమార చరిత్రములందు రసవత్తరమగు కాదంబరిని వీడి రెండవదియగు దశకుమారచరిత్రమునే కేతన తెలిఁగించుటకుఁ గారణము తతఃపూర్వమే యది తెలిఁగింపఁబడియుండుట యగునేమో? తన కృతికిఁ బతియగుచున్న తిక్కన సోమయాజికృతులనే పేర్కొనని యీ యభినవదండి యిఁక నాతనికిఁ బెద్దతండ్రి యగువాని కృతిని బేర్కొనక పోవుటలో నసందర్భమేమి యుండును? కాఁబట్టి యీ కాదంబరీకర్త కేతన తిక్కన పెద్దతండ్రి కేతన కాఁగూడును. ఇఁక నా కువలయాశ్వచరిత్రకర్త కేతన ప్రెగ్గడ యేతఁడో? ఇదియెల్ల నానుమానికమే.

**కొమ్మయ, నిశ్శంక** :- ఈతని వీరమాహేశ్వరము దొరకలేదు. శివలీలావిలాసము[1] రెండాశ్వాసములు మాత్రము చేకూఱెను.

**గంగరాజు (గంగాధరుఁడు) చిరుమూరి** :- రా.బ. వీరేశలింగము పంతులు గారు కవులచరిత్ర ప్రథమభాగ పీఠికలో నైరావతచరిత్ర మీతని కృతిగా వ్రాసినారు. ఐరావతచరిత్ర ప్రతులు రెండు నేనెఱుంగుదును.[2] రెండింటను బీఠికాగద్యములు లేవు. కృతి మంచిది. చిన్నది. కథ భారతేతిహాస ప్రసక్తము.

1. ఇది నా దగ్గరనున్నది. తప్పులకుప్ప. ఆరంభము రెండు కాగితములు పోయినవి. మచిలీపట్టణములో నున్న యిమ్మానేని వీరేశలింగమునాయనిగారి వలనఁ జేకుఱినది.
2. ఒకటి ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో నున్నది. వేఱొకటి విశాఖపట్టణమున శ్రీ పరవస్తువారి యార్షపుస్తకశాలలో నున్నది.

కాని సంస్కృతాంధ్ర భారతములం దాకథ గానరాదు. కర్ణాట భారత మందుమాత్ర మున్నది. ఆంధ్రమున వేఱుగ నున్న యీకృతి యత్కర్తృకమో నాకెఱుంగరాలేదు. గంగరాజుకృతి యని మీ రెట్లు వ్రాయఁగల్గితి రని శ్రీ వీరేశలింగము పంతులవారికి వ్రాసి కనుఁగొంటిని. శ్రీరామకృష్ణకవిగారపూర్వ వాఙ్మయ పరిశోధన మనుపేరఁ బ్రచురించిన యుపన్యాసమునఁ జూచి వ్రాసితిమని బదులు వ్రాసిరి.[1] కవిగారట్లుపన్యసించినచో నాధారమేమో? తెలియవలసియున్నది.

చిక్కయ,చందలూరి :– నాచికేతూపాఖ్యానము నిర్వురు తెల్గున రచియించినారు. ఈతఁడును, శ్రీనాథుని బావమఱంది దగ్గుబల్లిదుగ్గనయును; ఈతఁ డేనాఁటివాఁడో! దుగ్గన నాసికేత (నాసికా+ఇత) పదమును బ్రాసమున 'స' వచ్చునట్లు సవ్యుత్పత్తికముగాఁ బేర్కొనుటచేనట్లే ముద్రించితిని. ఉపనిషత్తులయందు నాచికేతుపదమే కన్పట్టును. దుగ్గనకృతి శివకాంచీమాహాత్మ్యము దొరకలేదు. నాసికేతోపాఖ్యాన[2] మున్నది.

చౌడయ, గంగరాజు :–కసువామాత్యున కంకితముగా నొక సాముద్రిక మున్నది. అది యాతని దగునో? ఈతఁ డేనాఁటివాఁడో? నంద(న) చరిత్రము దొరకలేదు.

తిక్కన :– విజయసేనము నందలి దని యిందు వైశ్యవర్ణన (156 –వ పద్య) మున్నది. ప్రబంధమణిభూషణమున నీ క్రింది పద్యము తిక్కన విజయసేనము లోని దని శ్రీకవిగారు వ్రాసినారు.

"సీ॥ అమ్మెద ననినఁ బద్మాక్షుకౌస్తుభమైన వెఱవక కొనియెడు వెరవు గలిగి
విలువ యిచ్చెదమని వేఁడినఁ బులిజున్నుఁ గమ్మపసిండియు నమ్మఁ గలిగి,
యేవస్తు వెంతప్రొద్దెందఱు చనుదెంచి యెంతటి గడిగిన నెదురఁ గలిగి,
తమయింట లేనియర్థము లర్థపతియింట నైన వెదకిన లే వనుట గలిగి,

1. శ్రీ వీరేశలింగముపంతులుగా రన్యదీయములగు విషయము లనేకములు స్వకపోలసాధితములట్లు కవులచరిత్రమునఁ జేర్చినారు. ఆయా విషయముల కాకరము తెలుపకుండుట భావిపరిశీలకులకుఁ జిక్కుఁగల్గించును.

2. ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో.



గీ. తమ కులాచారవర్తన (క్రమ) ము కొఱకు
నంగడులయొప్పునకును బేహార మాట
గాని లాభమునకు నాట గాదనంగ
వఱలుదురు పురవరమున వైశ్యవరులు."

ఇదియు వైశ్యవర్ణనమే. రెండు పద్యములును విజయసేనమందలివే యగునా?

**తిమ్మయ, కుంటముక్కల** :– ఈతని శైవాచార సంగ్రహము[1] దొరకియున్నది. **త్రిపురాంతకుఁడు, రావిపాటి** :– ఈ కవీశ్వరునికృతి[2] యుదాహరణము మాత్రమే సమగ్రముగా దొరకియున్నది. తారావళి, అంబికాశతకము, ప్రేమాభిరామము దొరకలేదు. క్రీడాభిరామమునకు సంస్కృతమైన ప్రేమాభిరామమును రచియించుటచేతనే యేమో యీతనిఁ గూచిరాజు–ఎఱ్ఱయ యిట్లు తన కొక్కోకమునఁ బేర్కొన్నాఁడు.

"సీ–గీ మునిసనత్కుమారు ధనదతనూభవు
నాశ్వినుల జయంతు నభినుతించి
పృథివి రావిపాటి త్రిపురాంతకాదిశ్వం
గారకవుల నెల్ల గారవించి."

ప్రేమాభిరామము శృంగారకావ్యమే యగును గదా! రామకృష్ణకవిగారు త్రిపురాంతకుఁడు మదన విజయ మను కామశాస్త్రగ్రంథమును (వాత్స్యాయన సూత్రములకుఁ దెలుఁగఁట) రచియించెనని వ్రాసినారు.[3] దొరకి నంతవఱకుఁ బరికింపఁగా నీతనియాంధ్రకవిత యతిప్రశస్తముగా నున్నది. ఈ క్రింది రెండు పద్యములుగూడ నంబికాశతకమందలివి.[4]

1 ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో.

2. తంజావూరు పుస్తకశాలలో నున్నది. శ్రీరామకృష్ణకవిగారు ముద్రించినారు.

3. క్రీడాభిరామ పీఠికాదులు చూడుఁడు.

4. ప్రయోగరత్నాకరమునం దున్నవి. మా.రా. కవిగారు ఉదాహరణ పీఠికలోఁ గూడ నుదాహరించినారు. మొదటి పద్యము నర్థ మసందర్భముగా నున్నది. తుదువఁగ, కదుగఁగ, ముంపఁగ, తొడరిన తల్లి అని యుండఁగూడును.

"చ. బెడఁగగురత్నదర్పణముఁ బేరిన వెన్నెల పోసి నిచ్చలుం
దుడువక పాలసంద్రమునఁ దోఁచి సుధాకరుమేనికందుఁబోఁ
గడుగక నేరెటేట సితకంజము ముంపక నైజకాంతి తోఁ
దొడరినఁ దల్లి! నీ మొగముతో సరిపోల్పఁగఁ జాలు నంబికా!

ఉ. ఱెప్పలబోరుఁదల్పు లిసిఱింతలువాఱెడు చూపుఁ గుంచియం
ద్రిప్పి తళుక్కనం దెఱచి తిన్ననిమోమునఁ గాయువెన్నెలల్
ముప్పిరిగొన్న వేడుకలు మూఁగినసి గ్గసియాడఁ బ్రీతి నీ
వప్పరమేశుఁ జూచి తనువర్ధముఁ గొంటి పొసంగ నంబికా!"

**నరసింహభట్టు, ఆమదూరి** :– ఈతని షోడశకుమార చరిత్రము దొరకలేదు; కాని, వేఱొకకవి, వెన్నెలకంటి సూరనకుమారుఁ డన్నయామాత్యుఁడు రచియించిన షోడశరాజ చరిత్ర మొకటి దొరికినది.[1] శ్రీ బహుజనపల్లి సీతారామాచార్యులుగారు శబ్దరత్నాకరమున షోడశకుమార చరిత్ర మొకటి యెల్లనకృతముగా నుదహరించినారు. వారు పరికించిన యా ప్రతి యెక్కడ నున్నదో!

**నాగనాథుఁడు, పశుపతి** :– ఈతఁడు వెన్నెలకంటి సూరనకంటెఁ బ్రాచీనుఁ డే కావలెను. శ్రీ వీరేశలింగము పంతులుగారు వెన్నెలకంటి సూరన (విష్ణుపురాణకర్త ) కాలము క్రీ.శ. 1480–90 ప్రాంతమని యసమర్థసాధనము లతో సిద్ధాంతపఱచినారు. కాని, తత్కృతిపతి యగు బసవయ రాఘవుఁడు[2] క్రీ.శ. 1526–29 ప్రాంతమున నున్నవాఁడగుటచే నాతఁ డంతకుఁ గొంత తర్వాతివాఁడగును.

**నన్నిచోడుఁడు** :– ఈ కవి కాలనిర్ణయాదికమును గూర్చి పెక్కురు చర్చించియున్నారు. అన్ని చర్చల పర్యవసానము నింతే. ఈ కాలమువాఁ డని నిర్ధారించుటకుఁ దగిన సాధనములు లేవు. శ్రీ చిలుకూరి

1. ఇది నాదగ్గఱ నున్నది. గ్రంథపాతములతో నిండి యందదుకులుగా నించుకమాత్రము మున్నది.

2. బసవయరాఘవుని శాసనము. (బట్టర్వర్తుగారి శిలాశాసనముల వాల్యూము 2 లో నెల్లూరుజిల్లా , కనిగిరి తాలూకా శాసనములలోఁ జూడుఁడు.)



వీరభద్రరావుగారాంధ్రుల చరిత్రమున నిట్లువ్రాసినారు. క్రీ.శ. 925–40 సం. ప్రాంతమున నున్న యీ సత్యాశ్రయుని నన్నెచోడ మహాకవి తన కుమారసంభవకావ్యమున నీ క్రింది పద్యములోఁ బేర్కొని యున్నాఁడు.

క. మును మార్గకవిత లోకం
బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గు నిలిపి రంధ్రవిషయమునఁ
జన సత్యాశ్రయునిఁ దొట్టి చాళుక్యనృపుల్."

దీనింబట్టి నన్నయభట్టారకునకు నూఱేండ్లకుఁ బూర్వమే యాంధ్రకవితా సతి వర్ధిల్లుచున్నదని స్పష్ట మగుచున్నది.'

శ్రీ వీరభద్రరావుగారుగాని, మఱియెవరుగాని నన్నిచోడఁడు నన్నయకంటెఁ బ్రాచీనుఁడని చెప్పఁజూచుటకును, గావచ్చు నని లోకము విశ్వసించుటకు నీ పద్యమే ప్రధానాధారముగా నున్నది. శ్రీరామకృష్ణ కవిగారు ప్రచురించిన కుమారసంభవ ముద్రితప్రతిలో నీ పద్యమిట్లున్నది. 1909 సం॥ దీనిని ముద్రించినారు. అప్పు డీ పద్యమును వారు పాఠాంతరమును జూపలేదు. వారి యచ్చునకు మాతృక యెక్కడిదో చెప్పను లేదు. కవిగారు కుమార సంభవము రెండవభాగపుఁ బీఠికలో నిట్లు వ్రాసినారు. "కుమారసంభవ ప్రతులలో నొకటి నాకు నైజాము రాజ్యమునఁ బ్రాచీనశాసన శోధనార్థము పోవుచుండఁగాఁ గర్ణాటదేశముననే లభించెను. తక్కినవి రెండును శుద్ధద్రవిడ దేశముననే యగపడెను" ద్రవిడ కర్ణాటదేశములందు మూఁడుప్రతులు దొరికినను నచ్చులోఁ బెక్కులు గ్రంథపాతములుండుట వింతగా నున్నది. ఆ మూఁడు ప్రతులు నొక్కమాతృకకే పుత్త్రికలాయేమి? కాకున్నచో నవి పాఠభేదములు లేకయు సమానగ్రంథపాతములు గలిగియు నుండుట వింతగదా? పట్టికలో ముఖ్యపాఠభేదములని వారు చూపినవి ప్రాయికముగా ముద్రణమం దర్థానుగుణముగాఁ జేయఁబడిన సంస్కారములకు వ్రాఁతప్రతిలో నున్న తప్పుపాఠములుగా గోచరించుచున్నవి. కుమారసంభవ ప్రతుల యెక్కయుఁ బాఠములయొక్కయు రహస్యము లింకను బయల్పడవలసియే యున్నవి. కాని తంజాపురపు సరస్వతీ పుస్తక భాండాగారమునఁ దాటియాకులపై వ్రాయఁబడిన కుమారసంభవపుఁబ్రతి యున్నది. అక్కడఁ

దక్క నింతవఱకుఁ బ్రత్యంతర మెక్కడను మనకుఁ గనరాదు. వినరాదు. ఆ పుస్తకములోఁ బై పద్యమిట్లున్నది.

"క. మునుమార్గకవిత లోకం
బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గును నిలిపి రంధ్రవిషయం
బునఁ జనఁ జాళుక్యరాజు మొదలుగఁ బలువుర్."

కవిగారికి "చన సత్యాశ్రయునిఁ దొట్టి చాళుక్యనృపుల్" అన్న పాఠమెక్కడనుండి వచ్చినదో! వా రింకనెక్కడి ప్రతి సంపాదించినారో! ప్రథమభాగమును ముద్రించునప్పటికి వా రీ తంజావూరు ప్రతి నెఱుఁగనే యెఱుఁగరు గావలయు. ఎఱఁగియుందురేని యనర్ఘ మగునీపాఠమును జూపకుండుట కేమికారణము? తంజావూరు పుస్తకశాలలో నన్నిచోడని కుమారసంభవ మున్నదని యెల్లరు నెఱిఁగిన తర్వాత క్రీ.శ. 1914లో వీరు ప్రచురించిన కుమార సంభవపు రెండవ భాగమున "చాళుక్యరాజు మొదలుగఁ బలువుర్" అను పాఠాంతరమున్నట్లు తెలిపిరి. కాని యిప్పుడయినను దంజాపురపుఁ బుస్తకమును వీరు చూచినట్లు వ్రాయలేదు. కావున నీ పాఠము మఱియొక ప్రతిలోఁ జూచినారేమో?అత్యూహ లెందులకు? తంజావూరు పుస్తకపాఠము మాత్రమే మనకిప్పుడు గ్రాహ్యము; శ్రీకవిగారి పాఠము గలమాతృక బయల్పడువఱకును. అట్టిప్రత్యంతరము బయల్పడెనా యది పాఠాంతరముగాఁ గూర్చుకొందము. ఇఁకఁ "జాళుక్యరాజు మొదలుగ" నన్నప్పుడు రాజరాజ నరేంద్రుడే యేలకారాదు?చోడఁడు నన్నయకంటెఁ బ్రాచీనుఁ డనుట కాధారములు తగినవి లేవు. శ్రీ వీరేశలింగము పంతులుగారు నన్నిచోడని భాషాప్రయోగములను గూర్చి చేసిన యాక్షేపములు నిలువఁ జాలనివి.[1] వానినెల్ల నిర్వచించుట కిక్కడ స్థలముచాలదు. పాల్కురికి సోమనాథుఁడు 1180 ప్రాంతముల నున్నవాఁ డనుపంతులవారి సిద్ధాంతము పోలును. నన్నిచోడఁ డంతకు ముందటివాఁడో వెనుకటివాఁడో సిద్ధాంత మేర్పడలేదు గదా! ఈ యిర్వురిలో నొకని పుస్తకము నింకొకఁడు చక్కఁగా సంగ్రహించుకొన్నాడు. ఇది చదివి చూడుఁడు :

1. ఆంధ్రకవుల చరిత్రము 1 భాగము.



"ద్వి. నెట్టన నేలకు నింగికి సూత్ర,
పట్ట మ్రోఁకాళ్లకు బట్టతలలకు
ముడివెట్టఁ దననీడ గడవంగఁ బాఱ,
వడినెండమావుల కడ గళ్లుగట్ట;
పాయక రెండుగాఁ బాఱెడునీరు,
వ్రేయఁ బుల్లున్న గోరో యని యమ్మ;
ఊనార యొలువఁ జత్రాతిపైఁగ్రుంగ,
నేనుంగుపురు డోమ నిసుము త్రా ద్వేన;
లలిగొన దెసలు తాళములు వాయింపఁ.
జెలఁగుచు రోఁకటఁ జిగుళులు గోయఁ
గలి వెన్న పుచ్చఁ గొండలు దొంతిఁ బేర్చ,
నిలమంచుఁ గుంచానఁ గొలువ రేఁబవలు
సేయ నాకసమునఁ జిత్రరూపములు,
వ్రాయ వాయువుఁ బట్ట వడగళ్ళుగుళ్లు
గట్ట వెన్నెలగుంపుగాఁ జేయవచ్చి
పుట్టినప్పుడే నేర్చు బుద్ధులప్రోఁక." (పండితా)

సీ॥ నేలయునింగియుఁ దాలముల్ వాయింప నెండమావులఁ బట్ట బండతలయు,
మ్రోఁకాలు ముడివెట్ట రోఁకటఁ జిగుళులు గోయఁజత్రాతిపైఁ గ్రుంగ నిడుపు,
లేక చిత్రము వ్రాయ నాకాశమునఁ దాఁపరము నిడ మంచుఁ గుంచములఁ గొలువ,
నేనుంగుపురు డోమ రానార గొన గాలి గంటిడ నిసుమున గట్టు దాల్ప,

గీ॥ నీరినడుము దెంప నేలఁ దెన్నుండి చే
వెల్పఁ గలిగియుఁ ద్రచ్చి వెన్న గొనఁగఁ
గడవ నేర్పు గలిగి కందువు మా నెద్దై
కత్తిగంటు లయిన యత్తగంతు." కుమా. భా. 2-135

ఇట్లీ యిర్వుర గ్రంథముల నుండియు వలసినన్ని సంవాదములు చూపవచ్చును. సులువుగా ద్విపదలో సోమనాథుఁడు కూర్పఁగా నన్నెచోడఁ డిట్లు సీసపద్యమునఁ జేర్చుకొన్నాఁడేమో! సూక్ష్మముగా నీయిర్వుర కృతులను

బరిశీలించినచో నీ విషయము బయల్పడఁగలదు. భాషావ్యుత్పత్తిలోఁ జోడఁ డును, సోమనాథుఁడును గూడ సమధికులేయని యాయాగ్రంథములఁ జక్కంజదివి యెఱిఁగినవారు భావింతు రని నా నమ్మకము.

**పెద్దిరాజు, పొన్నాడ**:– ప్రబంధమణిభూషణపుఁ బీఠికలో శ్రీరామకృష్ణకవి గారిట్లు వ్రాసిరి. "విన్నకోట పెద్దన కావ్యాలంకారచూడామణియుఁ[1] బ్రద్యుమ్నచరిత్రయు రచియించెను. రెండవ కృతి చాలఁ బ్రౌఢమయినది. దానిలో నుండి 113–వ పద్యము మాత్రమే గ్రహింపఁబడినది. "కావ్యాలంకార చూడామణికర్త యింటిపేరు విన్నకోట గదా! ప్రద్యుమ్న చరిత్రకర్త యింటిపేరు పొన్నాడ యని యిందున్నది. కవిగారట్లు వ్రాయుట కేమి యాధారమో? ప్రద్యుమ్న చరిత్రము వారికడ సమగ్రముగానుండెను గాఁబోలును. లేనిచో నది చాలఁ బ్రౌఢమయినదనియు నన్నూటయేఁబదికిఁ బై పడిన పద్యములు యత్కర్తృకములో, యేకృతులలోనివో తమ కెఱుఁగ రాకపోయిన యా ప్రబంధమణిభూషణమున, 113–వ పద్యమొకటి మాత్రమే ప్రద్యుమ్నచరిత్రము నుండి గ్రహింపఁ బడినదనియు నెట్లు చెప్పఁగల్గుదురు? కవిగారు ప్రబంధమణిభూషణ మనుపేరుతోఁ బ్రచురించిన సంధానమునకుఁ బ్రతులు నాల్గయిదు తంజాపురపుఁ బుస్తకశాలలో నున్నవి. కాని వానియందు లేని పద్యములనేకములు వీరి ముద్రణమునఁ జేరినవి. వీ రే యే ప్రతులను బట్టి యా గ్రంథమును ముద్రింపఁగల్గినారో తెలియదు.

**పోతరాజు**:– ఈతఁడొక బేతాళ పంచవింశతి రచియించెనట! శ్రీ రామకృష్ణ కవిగారు తమకు దొరికిన కవిభల్లటుని విక్రమార్కచరిత్ర బేతాళపంచవింశతి యందలి వని యుదాహరించిన పద్యములు కూచిరాజు ఎఱ్ఱయ రచించిన సకల కథా నిధానమందలి బేతాళపంచవింశతి కథలలోనివే. ఇటీవల నొకబేతాళపంచవింశతి భాగము దొరికినది[2] అది యత్కృతియో?

**మల్లయ, నంది** :–ఈతఁడును ఘంటసింగయయును గలసి జంట కవులుగదా!

1. కావ్యాలంకార చూడామణి 7 ఉల్లాసములు మాత్రము ముద్రింపఁబడెను. ఇంకను మఱికొంత గ్రంథము ముద్రింపఁబడవలసి యున్నది.
2. ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో నున్నది.



అఘోరశివాచార్య దక్షిణామూర్తి శివాచార్యులకు వీరు శిష్యులు, విద్యానగరమున 'శివాచార్య' పీఠమొకటి యాకాలమున నుండెను. అందు వైరాగ్యశివాచార్యా ఘోరశివాచార్య దక్షిణామూర్తి శివాచార్యాదు లధిష్ఠాతలు, అఘోర శివాచార్యాదుల కృతులు శైవాగమ గ్రంథములు శైవతత్త్వామృతాదులు పెక్కులున్నవి. లక్షద్వయాధ్యాపకుఁడట యఘోరశివుఁడు. మా.రా. కవిగారు క్రీడాభిరామ పీఠికలో "..... అవి రుచ్యములుగావని నందిసింగనయు ఘంట మల్లయయు– (ఇంటిపేర్లుఁ బేర్లును దార్మారు.) గలసి యార్వీటి తిమ్మరాజున కంకితముగా షష్ఠస్కంధమును శృంగారషష్ఠ మనుపేరుతో రచించిరి" అని వ్రాసినారు. నందిమల్లయ ఘంటసింగయలు ప్రసిద్ధులు. వారుగాక వీరు వ్రాసిన విధముగాఁ గూడ నిర్వురున్నారా? ఏమో? లక్షణ గ్రంథకర్తలు రాచమల్లువారి శృంగారషష్ఠమని యుదాహరింతురు ఇదియెట్లో? ప్రయోగ రత్నాకరమున శృంగారషష్ఠమందలిదిగా నీపద్య ముదాహృతము.

"ఉ. చండాంశు ప్రభవీక్ష తిమ్మయతనూజా! తిమ్మ; విధ్వస్తపా
షండంబైన త్రిలింగభాగవత షష్ఠస్కంధభాగంబు నీ
కుండక్కెం జతురాననత్వగుణయుక్తు ల్మీఱ వాణీమనో
భండారోద్ధతి చూఱకారబిరుద ప్రఖ్యాతి సార్థంబుగన్."

ఈ సంధానమున మలయమారుతము సర్వయ షష్ఠస్కంధ ముదాహరింపఁబడినది.

**రామయ్య, ఆంధ్రకవి** :– వాసిరాజు రామయ్యాయు నీతఁడు నొక్కఁడో? వేఱో? ఈతఁడు ప్రాచీన కవులను మాత్రమే స్తుతియించినాఁడు. అందు "ఛందోనిబంధనచాతురీధౌరేయ వాగ్ధాము వేములవాడ భీము" ననుచున్నాఁ డు– లాక్షణికులు గూడఁ బెక్కురు కవిజనాశ్రయము వేములవాడ భీమకవి రచితమని యుదాహరించెదరు.

"క. చను నుత్తమగండాధ, ర్వణహనుమదనంతకవిరాక్షస జయదే
వనుత శ్రీధరగోక, ర్ణనీలకంఠాది భీమనచ్ఛందంబుల్"

అనఁగా "దశవిధచ్ఛందములు." రంగరాట్ఛందస్సు.

ఈ విషయము మిక్కిలి సందిగ్ధముగానే యున్నది. భీమకవియే రచియించి కోమటియగు మల్లియరేచనిపేరఁ బ్రకటించెనని నానుడి! ఆ కోమటి మిక్కిలిగా నందుఁ బ్రశంసించుకొనఁబడినాఁడు. వేములవాడ భీమకవియో కోమట్లను బడఁదిట్టినాడు; వినుఁడు.

ఉ. "కోమటి కొక్కటిచ్చి పదిగొన్నను దోసము లేద, యింటికిన్
సేమమెఱింగి చిచ్చిడినఁ జెందద పాపము; వానినెప్పుడే
నేమఱుపాటున న్మఱియు నేమి యొనర్చిన లేద దోస; మా
భీమునిలింగమాన! కవిభీముని పల్కులు నమ్మియుండుఁడీ.

చ. గొనకొని మర్త్యలోకమునఁ గోమటి పుట్టఁగఁ బుట్టెఁ దోన బొం
కును గపటంబు లాలనయుఁ గుత్సితబుద్ధియు రిత్తభక్తియున్
ననువరిమాటలున్ బరధనంబును గ్రక్కున మెక్కఁజూచుటల్
కొనుటలు నమ్ముటల్ మరియు గొంటుదనంబును మూర్ఖవాదముల్.

లేములవాడ భీమన యిట్లు సెప్పఁగా వేఱొకకవి దాని నిట్లు ప్రశంసించినాఁడు.

ఉ. లేములవాడభీమ! భళిరే! కవిశేఖర సార్వభౌమ! నీ
వేమని యానతిచ్చితివి యిమ్ములఁ గోమటి పక్షపాతివై
కోమటి కొక్కటిచ్చి పదిగొన్నను దోసము లేద యంటివా
కోమటి కొక్కటీక 'పదిగొన్న'ను ధర్మమె ధర్మపద్ధతిన్"[1]

కోమటి సొమ్ముఁదిని కృతినమ్ముకొని యాతని నెంతో పెద్దగాఁ బ్రకటించిన కవినోరే యాకోమటి కొలమువారినిట్టు తిట్టునా? ఏమో? కృతి చెప్పించుకొని వెల్లడించుకొని తుదకుఁ గోమటి ద్రోహము చేయఁగాఁ దిట్టినాఁడేమో? ఏమో ఊహలెందులకు?" ఘనుఁడన్ వేములవాఁడ వంశజుఁడ" నిత్యాది చాటు పద్యములకుఁ బ్రసక్తుఁ డగు భీమకవి కవిజనాశ్రయకర్త కానేరఁ డనియే నాతలంపు. అతఁడు శివభక్తిపరాయణుఁడు. ఐతిహ్యములు, చాటుపద్యములు, నితర కవికృతస్తుతులు, నీ విషయమును రాద్ధాంత పఱుచుచున్నవి. పార్వతీపరమేశ్వరులే తమకుఁ దల్లితండ్రులనుట శైవుల సంప్రదాయము. " ధర నుమా మాతా పితా రుద్ర యనెడు ! వరపురాణోక్తి నీశ్వరకులజుండ.... బసవని పుత్త్రుండ బసవగోత్రుండ"[1] పాల్కురికి సోమనాథుఁడు.

"ఇట్లే భీమకవియు దాక్షారామభీమేశ నందనుఁడ" నని చెప్పికొన్నాఁడు. ఇఁకఁ గవిజనాశ్రయకర్తగా గ్రంథమున నెఱుఁగఁబడు రేచన జైనుఁడు. శైవులకును జైనులకును బ్రచండవిద్వేషము. వీరికి వారికి నాఱుచాళ్లపెట్టు. మతమున విశ్వాసము, పట్టుదల, నెట్టుకొనియున్న యా కాలమున మాఱుమతమువాని పేరఁ గృతిని వెల్లడించుటయేకాక యందుఁ దనకు మిక్కిలి విద్వేషింపఁదగిన యా మాఱుమతపుదేవరను బ్రశంసించుటయు 'భీమేశనందనుఁడ'నని చెప్పుకొనుస్వమతాభిమానికి భీమకవివంటివానికి సంభవింపదు. కవిజనాశ్రయమున జినదేవతాప్రశంసయేకాక స్తోత్రముకూడ నున్నది. శ్రీ జయంతి రామయ్య పంతులు గారు[2] దక్షిణ దేశమున దొరికిన యొక్క ప్రతిలో మాత్రమున్నవని యేడు పద్యములవతారిక యనుపేర గవిజనాశ్రయమునఁ బ్రకటించినారు. ఇంచుమించుగ ముప్పదినలువది కవిజనాశ్రయపుఁ దాళపత్త్రప్రతు లాంధ్రదేశముననుదక్షిణ దేశమున బరిశీలించితినిగాని యా పద్యములు నాకెందును గానరాలేదు. పంతులుగా రాపద్యములను గూర్చి యిట్లు వ్రాసినారు. " ఈ యవతారిక యొక్క ప్రతిలోమాత్ర ముండుటచేఁ బ్రక్షిప్తమని తోఁపవచ్చును గాని, కవితావైఖరిని బట్టిచూడ నది ప్రక్షిప్తము కాదనియే నా నమ్మకము." పంతులుగారి యీ నమ్మక మసమర్థమని నా నమ్మకము. అనంతుని ఛందమందలి మొదటి పద్యమే యీషద్భేదముతో నీయవతారికకు మొదటి పద్యముగా నున్నది.

క. శ్రీవల్లభు యతిగణసం, సేవితపాదారవిందుఁ జింతితఫలదున్
భావజగురు నలఘుచ్ఛం, దోవినుతు మురారి భక్తితో వినుతింతున్.

---

1. ఈ పద్యమున లేములవాడ యనియొకలదు. తక్కిన భీమకవి చాటువులన్నిటిలోఁ గూడ లేములవాడ యను పాఠమున్నది. ఇది ప్రయోగరత్నాకరమున నుదాహరింపఁబడినది.

1. కం.వీ. కవులచరిత్రమున, "దీనినిబట్టి సోమనాథుఁడు లింగార్యుని ఛాత్రుఁడయి నట్టును బసవేశుని పుత్రుఁడయినట్టును గనంబడుచున్నాఁడు" అని యుండుట సరికాదు.

2. కవిజనాశ్రయము శ్రీరామయ్య పంతులుగారిచేఁ బ్రకటింపఁబడినది. అందు రెండవపద్యమున "పరహిత చరితుండ నాంధ్రపదభక్తిమెయిన్" అను పాఠమున్నది. ఒక ప్రతిలో 'జితేంద్ర' యని యున్నదనియు, నదికవి సమ్మతమైనచో జినేంద్రయని యుండవలెననియు వారు వ్రాసిరి. అనేక తాళపత్త్రప్రతులలో 'జినేంద్ర' యన్న పాఠమున్నది.

లేకపోయినను భీమేశనందనుఁ డగుభీమకవి యిట్లు 'మురారి' నిష్టదైవముగా స్తుతియించు నని నమ్మరాదు, కాన యిది యాతనిది కానేరదు. ఇంక రెండవ పద్యము :

"క. శ్రీకరముగ రేచనపై
లోకంబున సుకవివరులు లోలతఁ బొగడన్
బ్రాకటముగ నీఛందము
లోకం బౌ ననఁగఁ దెలుఁగులో నొనరింతున్.

ఇందుఁ బ్రాసమునకై ' శ్రీకరముగ' 'లోకంబున' ప్రాకటముగ' 'లోకంబౌననఁగఁ' నని నాల్గుపడిరాళ్ళు పడినవి. యతికై 'లోలత' వచ్చినది. కవిజనాశ్రయమందలి శైలికి నీపద్యముల శైలికిని బోలికయే లేదు. ఈ ఛందము తెల్గులో నొనరింతునని రచింపబోవువాఁ డెట్లు చెప్పగూడును? రచింపఁబోవుదశలో 'నీఛంద మనుటకుఁ బొసఁగుఁవాఁ డెట్లు? కవిజనాశ్రయమును బఠించినఁ కవితాలుబ్ధుఁడెవఁడో దాక్షిణాత్యుఁ డిటీవల నీ యవతారిక నైతిహ్యమును బట్టి కూర్చిన ట్టీపద్యమే చెప్పక చెప్పుచున్నది ఇట్టి కవితా వైఖరినిబట్టి చూచి యట రామయ్యపంతులుగా రిది ప్రక్షిప్తముకాదని నమ్ముచున్నారు. 5,6,7 పద్యములు గూడ నస్వరస మగు కూర్పుతో నున్నవి. మఱియుఁ బంతులుగారు;

క. పరఁగిన విమలయశోభా
సురచరితుఁడు భీమనాగ్ర సుతుఁ డఖిలకళా
పరిణతుఁ డయ్యెను భూసుర
వరప్రసాదోదిత ధ్రువశ్రీయుతుఁడై"

క. అసమానదానరవితన
యసమానోన్నతుఁడు వాచకాభరణుఁడు ప్రా
ణసమానమిత్రుఁ డీకృతి
కిసహాయుఁడు గా నుదాత్తకీర్తిప్రీతిన్.

అని గ్రంథమం దుండవలసిన పద్యములను సాధుపాఠములుగల



సముచితప్రతుల తోడ్పాటు లేమిచేఁ గావలయు, "విమల యశోభాసురనిరతుఁ డు" "భూసురవరుఁడు ప్రసాదోదితధ్రువశ్రీయుతుఁడై" 'యాచకాభరణుఁడు' నను నపపాఠములతో గ్రహించి " ఈ పద్యము లనన్వయముగా నుండుటచేత నందుఁ బేర్కొనఁబడిన భీమునకును గ్రంథమునకును గల సంబంధ మిట్టిదని నిర్ణయింపవలను గాకున్న "దని పీఠికలో వ్రాసి ప్రక్షిప్తములట్లు గ్రంథమునఁ జేర్పక క్రిందఁ గూర్చినారు. పైపద్యము లనన్వితములుగావు. గ్రంథమునఁ గూర్చుకొని చూచినచోఁ దేటపడఁగలదు. పాఠము తప్పుగా నున్నప్పుడు సమన్వయ మెట్లేర్పడును?

మఱియు, రామకృష్ణకవిగారు భీమకవిదేశము నైజాంరాష్ట్రమందలి లేములవాడయగునో యని నీతిశాస్త్రముక్తావళిపీఠికలోఁ దెలిపినతలఁపును రామయ్య పంతులుగారు కొన్ని యుపపత్తులతోఁ బొందించి బలపఱిచినారు. వాస్తవము కావచ్చును. నైజాంరాష్ట్రమందలి లేములవాడలో వెలసిన యీశ్వరునకు రాజేశ్వరుఁడని సుప్రసిద్ధనామ మయ్యెను. మనభీమకవి తఱచుగాఁ దనయిష్టదైవమును 'భీమేశ్వర' 'భీమలింగ' నామములతోనే పేర్కొన్నవాఁడయ్యెను. ఆ రాజేశ్వరునకుఁగూడ భీమేశ్వరుఁడని సుప్రతీతి కలదా? అక్కడ సుప్రసిద్ధమయిన రాజేశ్వరనామమును విడచి స్థలాంతరమున సుప్రసిద్ధమగు భీమేశ్వర నామమును బేర్కొనుట భీమకవి గోలకొండ రాష్ట్ర వాస్తవ్యత్వమునకుఁ గొంత బాధకము. పద్యములలోనున్న వేములవాడ యన్న పేరు గోదావరీమండల మందలి వేములవాడకుఁ గుదురకపోవుట తత్రత్యత్వమునకు బాధకము. కవినిఁ గూర్చియుఁ గవికావ్యములను గూర్చియు నిదమిత్థ మని నిర్ధారణ మేర్పడని యప్పు డీ స్థలమును గూర్చి యింత చర్చ యెందులకు?

మఱియు, రామయ్యపంతులుగారు 'ఘనుఁడన్ వేములవాడ' అన్న పద్యమున శ్రీరామమూర్తిగారు 'కల్పించిన' 'వెలుంగాధీశ' యన్న పాఠమునకు బదులుగా వీరేశలింగము పంతులుగారు ' తెలుంగాధీశ' యన్న పాఠమును జెప్పి' రనియుఁ 'దెలుంగ్వదీశ' యని కాని, 'తెలుంగధీశ'యని కాని యుండవలయునే కాని 'తెలుంగాధీశ' యనుట వ్యాకరణ దుష్టమనియు నట్లు భీమకవి ప్రయోగింపఁ దనియు గర్హించి'కళింగాధీశ' యని చేర్చుకొని, "కళింగాధీశ "యను పాఠ మీ ప్రతీతి కనుగుణము. సర్వవిధముల నిర్దుష్టము;

ఇదియే కవిప్రయుక్తపాఠ మై యుండవలయును" అని వ్రాసిరి కాని యీ పాఠము వీరి కెట్లు వచ్చినదో చెప్పనొల్లకపోయినారు. కావుననే వీరేశలింగముపంతులుగారు "తెలుంగాధీశ" యన్న పాఠము వ్యాకరణదుష్ట మగుటచే నది కళింగాధీశ యని యుండవలెనని యొకరనుచున్నారు" అని యది రామయ్యపంతులుగారు సంస్కరించిన పాఠమయిన ట్లభిప్రాయపడినారు. 'తెలుంగాధీశ' యనుట వ్యాకరణదుష్ట మనెడు వాదము గ్రాహ్యముకాదు. తద్భవ, దేశి, నామములకు డు ప్రత్యయము పరమగుచో నకారాదేశము వచ్చును. రంగఁడు, లింగఁడు, మారఁడు, సూరఁడు, గరువఁడు, తిప్పడు మొ॥ ఇట్లే తెలుఁగఁడు కూడను. తెలుఁగఁడే తెలఁగఁడని కూడ మాఱెను. 'తెలుఁగుఁడు' అని యుండదు. 'తెలుఁగు' అన్నట్లుకూడఁ గానరాదు. సంస్కృతసమాసఘటిత మగునప్పు డా యకారాంత రూపమే ప్రాతిపదిక మగును. కళింగ గంగు, సాళ్వమంగు అను రూపములున్నను గంగ్వధీశుఁ డు, మంగ్వధీశుఁడు, నని యుండదు. పంతులుగారు 'తెలుంగాధీశ' యనుట వ్యాకరణదుష్ట మనునప్పుడు, శ్రీనాథకవిసార్వభౌముని 'యక్షయ్యంబుగ' పద్యమును మరచిపోయినారు. వీరేశలింగము పంతులుగారి పాఠము యుక్తమే. "సుచరిత్రాఢ్యుని వత్సవాయతెలుఁగున్ క్షోణీశ చూడామణిన్" అని కం. వీ. గారు ప్రచురించిరి గాని యదికూడ "వత్సవాయుతెలు(ల) గక్షోణీశ చూడామణిన్" అనియే యగునని నానమ్మకము.

ఇఁక నా 'కళింగాధీశ' యన్న పాఠమును రామయ్యపంతులుగారు నా చాటుపద్యమణిమంజరి నుండి గ్రహించియుండవచ్చును. ప్రాచ్యలిఖిత పుస్తకశాలలోని యొక తాళపత్రప్రతిలోఁ జూచి దానిని జాటుపద్య మణిమంజరిలో 'తెలుంగాధీశ' యనుటకుఁ బాఠాంతరముగా ముద్రించితిని. లోకమువాకులందుఁ దెలుంగాధీశ యన్న పాఠమే పాదుకొనియుండుటను బట్టియు శ్రీనాథునకుఁ గస్తూరికాభిక్షాదానము సల్పిన తెలుంగురాయని పేరే భీమకవికూడఁ గస్తూరికాభిక్షమే యాచించినవాని పేరుగా నుండుటలో సందర్భవిశేష ముండఁ దగియుండుటనుబట్టియుఁ ద్రోసిపుచ్చుటకు సాహసింపక ప్రధాన పాఠముగా దీనినే యుంచితిని. ఈ పాఠము పరిత్యాజ్య మనుటకు వ్యాకరణదుష్ట మనెడు కారణము తగనిది. ఇతర విధములఁ 'గళింగాధీశ' యన్న పాఠము పరిగ్రాహ్యతరము కావచ్చును.



మఱియు వీరేశలింగము పంతులుగారు "సోమ గురువాక్యములు పెట్టి భీమసుకవి, గరిమ బసవపురాణంబు గణనచేసె" నని పిడుపర్తి బసవన బసవపురాణపద్యమును గొని వ్యాఖ్యానచాతుర్యముచే 'గణనచేసె' ననుటకుఁ గర్ణాటీకరించుటగా నర్థముఁ గూర్చి, పాల్కురికి సోమనాథుని యాంధ్రబసవ పురాణమునుబట్టి కర్ణాటభాషలో భీమకవిచే రచియింపఁబడిన బసవపురాణము నుదాహరించి యా యర్థమును స్పష్టపఱిచిరి. పిడుపర్తి బసవన బసవపురాణపుఁ దాళపత్రప్రతులలో "గరిమ బసవపురాణంబు కన్నడించె" నని యున్నదిగావున వ్యాఖ్యానశ్రమమక్కఱలేకయే యయ్యది కంఠోక్తమగుచున్నది. కాని, యా భీమకవియే వేములవాడ భీమకవి యని పంతులవారు పల్కుటకుఁ ప్రమాణమో! లేదు. వేములవాడ భీమకవి చాటుపద్యములలోఁ గూడ దాక్షారామ భీమేశ్వరుని స్మరించియున్నాఁడు. కర్ణాటక బసవపురాణకర్త యాతఁడే యగు నాఁడందలి యెన్మిదాశ్వాసములలో నెక్కడనేని భీమేశ్వరుని స్మరింపకుండునా? తెలుఁగుఁగవీశ్వరులచే స్తుతింపఁ బడుట కాతఁ డేవేని తెలుఁగుఁ గబ్బములను గూర్చియే యుండవలెను గదా? ఏవో యవి చేకుఱవలసియే యున్నవి. ప్రయోగరత్నాకరమున వేములవాడ భీమకవి నృసింహపురాణమందలివని కొన్ని పద్యము లుదాహరింపఁబడినవి. ఎంత నిజమో! వీరేశలింగముపంతులుగా రీతఁ డారాధ్యబ్రాహ్మణుఁడనిరి. కోవెల గోపురాజు నన్నయభట్టును భీమకవిని వేఱుగా స్తుతియించి, తిక్కనాదులను "మత్కులచంద్రు' లని తర్వాతఁ జెప్పుకొన్నాఁ డు. మీఁది చర్చవలన వేములవాడ భీమకవి విషయము సర్వమును సందిగ్ధమే యగు చున్నది.

**రామలింగయ్య– తెనాలి**:– రామకృష్ణుఁడు వేఱు, రామలింగఁడు వేఱుగా మా.రా. కవిగారు వ్రాసినారు.[1] సత్యము కావచ్చును.[2]

---

1. ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక. 1. క్రీడాభిరామపీఠిక చూడుఁడు.
2. ఉ. గ్రాంథిక సన్నుత ప్రతిభఁ గాంచి రసజ్ఞత మించి యాదిమ
   గ్రంథము లుగ్గడించి ఫణిరాట్పరికల్పితశాస్త్రవీథికిన్
   బంధువులైన సత్కవులఁ బ్రార్థన చేసెద దుష్ప్రబంధ సం
   బంధ మహాంధకార ఖరభానుగభీరవచోమచర్చికన్.

(మిగతా ప్రక్క పేజీలో)

**వల్లభరాయఁడు** :– శ్రీ మా.రా. కవిగారు వల్లభరాయఁడు రచించినట్టున్న క్రీడాభిరామ[1] మను వీథినాటకమే శ్రీనాథుని వీథి నాటకము కావచ్చుననిరి.

---

సీ మహిత మూలస్థానమల్లికార్జున శిరస్థ్సల చంద్రచంద్రికాధవళితంబు,
చెదలువాటీపుర శ్రీరఘూద్వహభుజాస్తంభ రక్షణవిధాసంభృతంబు,
వేదండముఖతటాకోదితపద్మసౌగంధిక గంధపాణింధమంబు,
రాజబింబాననారాజిత గాంధర్వ మాధురీసాధురతీధరంబు,

గీ. కరటికటనిర్గళద్ధ్వాన నిరవధిక స। మగ్రనూతనవృష్టిజంబాలితాఖి
లావనీపాలమందిర ప్రాంగణంబు। గురు సమృద్ధుల సైదోడు కొండవీడు

మ. పరగన్ వారిధివేష్టితాఖిలమహీభాగంబునన్ రెడ్డిభూ
వర సింహాసనమై శుభాయతన మై వర్ధిల్లు తత్పట్టణం
బురుబాహాబల సంపదం బెనుచు భద్రోద్యోగి నాదెండ్ల గో
పరసాధీశుఁడశేష బంధుకుముద ప్రాలేయధామాకృతిన్.

గద్యము. ఇది శ్రీమదేలేశ్వరగురువరేణ్యచరణారవిందషట్చరణ సకలకళాభరణ రామనార్యసుపుత్ర సుకవిజనమిత్ర కుమారభారవిబిరుదాభిరామ రామలింగయ ప్రణీతంబైన యుద్భటారాధ్య చరిత్రంబునం .... ..... ....

మన్మిత్రులు చల్లా సూర్యనారాయణరావుపంతులుగారు దీనినిబంపినారు. పాండురంగమాహాత్మ్య కర్తయు, నేతత్కృతికర్తయు నొక్కఁడే యనిగాని, వేఱనిగాని నిర్ధారింపఁదేలకున్నది. అతఁడు నీతఁడును రామయపుత్రులే.“ శైవవైష్ణవ పురాణావళీ నానార్థరచనా పటిష్ఠైకరమ్యమతివి” కావున, నాతఁడుకూడ నీ శైవకథ రచియించి యుండఁదగును. అక్కడ రామకృష్ణుఁడని యిక్క డరామలింగఁడని యున్నది. ఇక్కడఁ దెనాలి ప్రశంసకానరాలేదు. ఈ యుద్భటారాధ్యచరిత్రము కూడ బయల్పడినఁగాని యథార్థము తేలదు. ఇందు ఉదాహరింపఁబడిన పద్యమందు నాదెండ్ల గోపమంత్రి పేర్కోఁబడినాఁడు. ఈ రామలింగనికిఁ గుమారభారతి యని బిరుదు.

1. మా.రా.కవిగారు, క్రీడాభిరామపుఁబీఠికలోనే యిట్లు వ్రాసినారు. “చంద్రశేఖరుఁడను నియోగిపుంగవుఁడు నరసింగరాయల మంత్రియని సాళువాభ్యుదయమున నున్నది, కావున “చంద్రశేఖరు క్రియాశక్తిరాయల యొద్దఁ బాదుకొల్పితి సార్వభౌమ బిరుదు” అనునది స్పష్టముగా నర్థమగుచున్నది.” సాళ్వాభ్యుదయము ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో నున్నది. అందెక్కడను నరసింగరాయలకుఁ జంద్రశేఖరుఁడనునియోగిపుంగవుఁడు మంత్రిగా నున్నట్టు కానరాదు. వారు మఱెక్కడి ప్రతిలో నట్టుచూచినారో: ఆచరణమున కట్టి యర్థములేదు. శృంగారశ్రీనాథమందలి “కనకాభిషేకము” చూ.



శ్రీ కం. వీ. పంతులుగా రది ‘యతిసాహస’ మనిరి. నా నిశ్చయము తప్పక యది శ్రీనాథుని కృతియే యగునని; కారణసామగ్రి పుష్కలముగా నున్నది. ముద్రింపఁబడునా “ శృంగార శ్రీనాథ” మను గ్రంథమున నీచర్చకలదు.

**శేషనాథుఁడు** :– ఈతని పర్వతపురాణము ముద్రితము.

**శ్రీనాథుఁడు** :– వల్లభాభ్యుదయ మను శ్రీనాథకృతి యొక్కటి యున్నట్టిందలియొక్క పద్యమెఱిఁగించుచ్నుది. వల్లభాభ్యుదయమును గూర్చి శ్రీ మా.రా. కవిగారిట్లు వ్రాసినారు. “వల్లభాభ్యుదయములోఁ గృష్ణాతీరమున నుండు శ్రీకాకుళస్వామి తిరునాళ్ళలో జరుగు నసభ్యములు దీనికంటెఁ బచ్చిగానున్నవి. మఱియు నాంధ్రవల్లభుని తిరునాళ్లలోని విధవాదుర్వర్తనములు శ్రీనాథుఁడు విశదముగా వర్ణించియున్నాఁడు..... .... శ్రీనాథుఁడు శ్రీకాకుళాధీశ్వరుఁడగు తెలుఁగురాయని దర్శించి యతని కంకితముగా వల్లభాభ్యుదయమును జెప్పెను గదా! అప్పుడు ‘అక్షయ్యంబుగ సాంపరాయని తెలుంగాధీశ’ అని శ్రీనాథుడు చెప్పెను” ఈ వ్రాఁత శ్రీకవిగారా వల్లభాభ్యుదయమును జక్కఁగాఁ జదివి యెఱింగినవా రని చెప్పుచున్నది గదా! ఆ గ్రంథము శ్రీకాకుళాధీశ్వరుఁ డగు తెలుంగురాయని కంకితమట! అతడేయట సాంపరాయని తెలుంగురాయఁడు. సాంపరాయని తెలుంగురాయఁడు కృష్ణాతీరమందలి శ్రీకాకుళము నేలినాఁడననుట కట్టుకత. ఆధారము లేవియును లేవు. ఈ విషయమునఁగల యసందర్భములు పూర్ణముగా నా“శృంగార శ్రీనాథము” న వెల్లడింపఁబడినవి. ఇప్పటికి నఱువది యేండ్లకుఁ బూర్వ మొకకవి శ్రీకాకుళక్షేత్రమాహాత్మ్యమును వల్లభాభ్యుదయమును గూర్చి యిందలి పద్యమొకటి తక్క మనకిఁక నేమియుఁదెలియదు. శ్రీ కవిగారు గ్రంథమును జదివినట్లు వ్రాయుచున్నారు. వారు దానిని వెల్లడింపవలసి యున్నారు.

**హరిభట్టు** :– ఈతడు బహుగ్రంథకర్తగా నున్నాఁడు. ఈతని మాత్స్యవారాహపురాణములు దొరకియున్నవి. ఉత్తరనృసింహపురాణము దొరకలేదు. విష్ణుభాగవతము నేకాదశద్వాదశస్కంధములుగూడ నీతఁడు తెలిఁగించినాఁడు. ఆంధ్రసాహిత్యపరిషత్పుస్తక భాండాగారమున ‘హరికభట్ట’ రచించినట్టు పై రెండు స్కంధములు నున్నవి. హరిభట్టనుటకు హరికభట్టనుట వ్రాఁతగాని దోషమే.

నీతిసారము, పంచతంత్రి, కామందకము[1] మొదలగు కొన్ని గ్రంథములకుం గర్తలెవరో యెఱుఁగరాదు. మఱికొన్ని పద్యము లేగ్రంథము లందలివోకూడ నెఱుఁగరాక యున్నవి. ఇందుఁ బేర్కొనఁబడిన కవీశ్వరులు పెక్కురు ప్రాయికముగా కం.వీ. కవులచరిత్రము ప్రథమభాగమునఁ జేరఁ దగినవారగుదురు. ఇంతవఱకు నాంధ్రభాషలోఁ గవిజనాశ్రయముతక్క జైనప్రసక్తమగు కబ్బము కానరాలేదు. ద్రవిడకర్ణాటభాషలలో జైనకృతులు పెక్కులున్నవి. ఇందు జినేంద్రపురాణ మనియు నాదిపురాణ మనియు రెండు జైన ప్రబంధము లుదాహరింపఁ బడినవి. కాని, వానియందలి పద్యము లెక్కువగాఁ జేకొనఁబడ వయ్యెను. ఉన్న పద్యములం జూడగాఁ బ్రాచీనతరరచనముగాఁ దోఁపకున్నది.

సంస్కృత వాఙ్మయమున శార్ఙ్గధరుని పద్ధతి, జల్హణుని సూక్తిముక్తావళి, వల్లభదేవుని సుభాషితావళి మొదలగు సంధానగ్రంథముల మూలమున నిప్పుడనుపలభ్యమానములగు కావ్యములయుఁ గవులయు వృత్తాంతము లెన్నో గుర్తింపఁబడుచున్నవి; అట్లే యీ సంధానములు గూడ నెందఱనో యా పూర్వకవులను, నెన్నింటినో యపూర్వకావ్యములను బయల్పఱిచినవి. ఇందుఁ గొన్ని యేని మన భావిపరిశీలన మూలమున బయల్పడఁగలవని విశ్వసింతము. మఱియు నెఱ్ఱాప్రెగ్గడరామాయణము మొదలగు ప్రాచీన ప్రబంధము లిందుఁగూడ ననుదాహృతములు పెక్కులు మనకు దొరకవలసియున్నవి. పేరుకూడ లేకుండఁ గాలప్రవాహమింక నెన్ని మంచికావ్యములను ముంచివైచినదో గదా!

ఈ సంధాతలు ప్రాచీనులే యగుటచే వారి కాయా కవీశ్వరుల కావ్యములు దొరకియే యుండుననియు వారు వానిని బఠించియే పద్యములను సంగ్రహించిరనియు విశ్వసింపఁగూడును. అయినను బ్రతివిలేఖకాదుల మూలమున నిప్పుడు దొరకిన ప్రతులందుఁ గొన్ని కావ్యములపేళ్ళును, గవులపేళ్లును దార్మారయి యుండవచ్చును. కొన్ని పద్యముల విషయమున నీ రెండు సంధానములకును ద్వైవిధ్య మేర్పడెను. ఈ పద్య మీ కావ్యమందలి దగును గాదని నిర్ధారింప నా కావ్యములు దొరకినంగాని కుదురదుగదా!

1. తంజావూరు పుస్తకశాలలో వేంకటరాజ ప్రణీత మగు కామందకము పద్యకావ్య మున్నది. అది యిది కానట్టున్నది.



ఈ సంధానములకుఁ బ్రత్యంతరములేవి లభింపవయ్యె.

ఈ గ్రంథము చెన్నపురిలో ముద్రింపఁబడుచుండుటయు నే నక్కడ నుండరాక యవిరతప్రయాణములతో దేశాటనము సల్పవలసియుండుటయు సంఘటిల్లుటచే నచ్చుపని చూడనేకాక పీఠికవ్రాయను వలసిన గ్రంథపరికరము పరికింపను గూడఁ గుదురదయ్యెను. అయినను నా రెండు ప్రాచీన సంధానములను జతకూర్చుట మొదలుగా నిట్లు ముద్రితమై వెల్వడుదాఁకఁ జెన్నపురిలో మన్మిత్రులు బ్రహ్మశ్రీ గన్నవరపు సుబ్బరామయ్యగారు సల్పిన తోడ్పాటు, పరిశ్రమము మిక్కిలి పెక్కువ. వారి తోడ్పాటు లేనిచో నే నిప్పు డీ గ్రంథమిట్లు ముద్రింపఁజాలను. మా ముద్రణావసరమునఁ గూడఁ గొన్ని పొరఁబాట్లు పొసఁగి యుండవచ్చును. సందిగ్ధము లగు పద్యభాగము లట్లే నిల్పితిమి. ప్రయత్నపూర్వక మగు విపర్యయ మిందేదియు నుండదు. ప్రమాదములు సరిపఱుచుకొనఁ బ్రాజ్ఞులకు నమస్కారము.

వేటూరి ప్రభాకరశాస్త్రి

9 -1 -18

# చారుచర్య ఉపోద్ఘాతము

చారుచర్య యను గ్రంథము సంస్కృత భాషలో భోజమహారాజుచే సంధానింపఁ బడినది. భోజమహారాజు బహు గ్రంథకర్త. క్రీ.శ. పదొకొండవ శతాబ్ది (1000–1056) యందున్న వాఁడు. వైద్యశాస్త్రమునకును, నీతిశాస్త్రమునకును, ధర్మశాస్త్రము నకును నవిరోధముగా మానవుఁ డెట్లు జీవితచర్య నడుపుకొనఁ దగునో యది చక్కగా నా చారుచర్యయందుఁ జెప్పఁ బడినది. సామాన్యముగా మానుషానంద మనుభవింపఁ గోరువారందఱుఁ దెలిసి కొనవలసిన విషయములెన్నో యందుఁ గలవు. వ్రాఁత ప్రతులలో భోజుని యా సంస్కృత చారుచర్య రెండు తెఱఁగుల నగపడుచున్నది. ఒకటి చిన్నది, వేఱొకటి ఇంచుక పెద్దది, వాని వ్రాతప్రతులు మూఁడు మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో నున్నవి.

## తెలుఁగు చేఁత

ఈ తెలుగు రచన మా భోజుని గ్రంథమున కనువాదమేగాని సరియయిన తెలిఁగింపు కాదు. ఆ రెండు దెఱఁగుల సంస్కృత గ్రంథములకును నిది సంగ్రహముగా నున్నది.వానిలోని విషయములన్నియు నిందుఁ గానరావు. దీని రచయిత పేరు మంత్రియప్పన.

## మంత్రియప్పన

ఈతఁడు భారద్వాజగోత్రుఁడు. ఆపస్తంబసూత్రుఁడు. నాగమాంబ కును గోవిందార్యునకును గుమారుఁడు. సింగనా మాత్యుని మేనల్లుఁడు. శ్రీవల్లభాచార్యుని తమ్ముఁడు. ఈతఁడు తన్ను 'గణకలలామా' యని, 'మంత్రిశేఖరా' యని సంబోధించుకొన్నాఁడు. ఆ మంత్రిత్వమునో గణకత్వమునో ఈతఁ డేరాజుపాలనమునఁ జేసినాఁడో తెలియదు. ఇంతకంటెఁ గవివంశాది వృత్తాంతమును గూర్చి విశేషము లెఱుఁగరావు.

## ఈతని కాలము

ఈతని కాలముకూడ స్పష్టముగా నెఱుఁగరాదు. మడికి సింగన



సంధానించినసకలనీతిసమ్మత[1] మను రాజనీతి గ్రంథము నఁ జారుచర్య యందలి పద్యమిది యుదాహరింపఁబడినది.

చ. గొనకొని కొండముచ్చులఁ జకోరములన్ శుకశారికాదులన్
బెనుతురు భూపతుల్ విషముపెట్టినయన్నముచూచి యోలిఁ జ
య్యన నవి వెంద్రుకల్ విడువ నక్షులుమూయఁగఁ గూయుచుండఁగాఁ
గని కుటిలప్రయోగములు గాంచుటకై నృపమంత్రిశేఖరా.

దీనిచే మడికిసింగనకంటె నీ చారుచర్య రచించిన యప్పన మంత్రి ప్రాచీనుఁడని తేలుచున్నది. మడికి సింగనకాలము స్పష్టముగా మన మెఱుఁగుదుము. అతని పాద్మోత్తరఖండమున నీ క్రింది పద్యము కలదు.

మంగళ. ఆకర యుగానల మృగాంక శకవత్సరము
లై పరఁగు శార్వరినిఁ బుణ్య
ప్రాకటిత మార్గశిర పంచమిని బొల్చు నుదు
పాలసుతవాసరమునందున్
శ్రీకరముగా మడికిసింగన తెనుంగున ర
చించెఁ దగఁ బద్మపురాణం
బా కమలమిత్ర శిశిరాంశువుగఁ గందసచి
వాగ్రణికి మంగళ మహాశ్రీ.

శాలి 1342 (క్రీ.శ. 1420) న నాతఁడు పద్మపురాణము రచించెను. అప్పనమంత్రి యంత కింకను బ్రాచీనుఁడగును గదా! ఆ ప్రాచీనత యెంతదో గుర్తింప నాధారము దొరకలేదు.

కర్ణాటాంధ్ర భాషా ప్రబంధములలోఁ గృతికర్త తన పేరనే సంబోధించుకొనుచుఁ బద్యములఁ జెప్పుకొను సంప్రదాయము కొన్ని ప్రాచీన కృతులందుఁ గానవచ్చుచున్నది.తెలుఁగున బద్దెననీతి యట్టిది. ఈ చారుచర్యకును నా బద్దెన నీతికిని శైలియందు సాదృశ్యము కొంత యగపడుచ్నుది. ఏకకాలరచనములయి యుండునని నా తలఁపు. ఆ బద్దెన, తిక్కన కించుమించుగా సమకాలము వాఁడగునని తలఁపఁబడుచున్నాఁడు.

1. సకలనీతిసమ్మత మముద్రితము. శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారి దగ్గఱవ్రాఁత ప్రతి కలదు. కాగితముల మీఁద వారు వ్రాసికొన్నారు. దాని నేను జూచినాఁడను. (తర్వాత నిది ముద్రితము–ప్రకాశకులు)

ఈ యప్పనయు నప్పటివాఁడు కాఁదగును. అనఁగా మడికిసింగనకు నూఱేండ్లు ముందున్నవాఁడగు నన్నమాట.

మడికిసింగన సకలనీతిసమ్మతముననే గాక ఈ చారుచర్య పెదపాటి జగన్నాథకవి సంధానించిన ప్రబంధ రత్నాకరమునఁ గూడ నుదాహరింపఁ బడినది. తాంబూలప్రశంసా పద్యములు సీ. కఠినమై దొడ్డ – సీ. లఘుకారికృమిదోష– చ. వదన వికాససౌరభ–, అను నుపక్రమములు గలవి జగన్నాథకవిచే నుద్ధరింపఁబడినవి. నేను ప్రకటించిన ప్రబంధరత్నావళిలో వానిని జూడఁదగును.

## వ్రాఁతప్రతులు

ఇప్పటి కాఱేండ్లకుఁ బూర్వము తంజావూరు సరస్వతీ పుస్తక భాండాగారమును బరిశీలించుచు నీ చారుచర్య కృత్యారంభమును మాత్రమక్కడ శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారును నేనును జూచితిమి. చెత్తగా నొకమూలఁ జేర్చి యుంచిన కొన్ని విడివిడి యాకులలో నాగరాక్షరములతో వ్రాయఁ బడిన యొక పీఁచుకాగితమున నాల్గుపద్యములే యక్కడఁ జిక్కినవి. కడమగ్రంథ మెంతవెదికినను గానరాలేదు. అప్పుడే యప్పనయను కవి భోజకృతియగు చారుచర్య యను గ్రంథమును దెనిఁగించెనన్న విషయము మాకుఁ దెలిసెను. ఆ నాల్గు పద్యములను వ్రాసి యుంచుకొంటిమి. పదపడి రెండేండ్లకుఁ బ్రాచీన గ్రంథపరిశోధనార్థము కృష్ణామండలమునఁ బర్యటించుటలో ముక్త్యాల ప్రభువులగు శ్రీ రాజావాసిరెడ్డి శ్రీ చంద్రమౌళీశ్వర ప్రసాద బహద్దరు జమీందారుగారి పుస్తక భాండాగారమున సమగ్రముగా నీ చారుచర్య వ్రాఁతప్రతిని జూచితిని. కాని, యందుఁగవికుల గోత్రాది వృత్తాంతమును దెల్పు (సీ. విద్వన్నుతుండు) అన్న పద్యములేదు. గ్రంథపాతములు వ్రాఁత తప్పులు నుండెను. ఆ గ్రంథగౌరవము నెఱిఁగి శ్రీ ముక్త్యాల ప్రభువులు తామే దానిని ముద్రింప నుత్సహించిరి. ప్రత్యంతరము కొఱకు వారింత కాలము ప్రతీక్షించినను దొరకదయ్యెను. కడకుఁ బ్రత్యంతరాపేక్ష వదలుకొని యెట్లో సంస్కరింపించి ముద్రింప నారంభించి యచ్చుచిత్తులను శ్రీవారు నాకడ కనిపిరి. ఆ సమకాలముననే యానుషంగికముగా నాంధ్రసాహిత్యపరిషత్తువారి లిఖిత గ్రంథపట్టికను (ముద్రితము)



నేను జూడఁ దటస్థించెను. అందు " వైద్యపద్యములు – మంత్రియప్ప" యని కానవచ్చెను. అది చారుచర్యయే యగునని నిర్ధారించుకొని పోయి పరికించి పరిషత్కార్యదర్శ్యన్యతములగు బ్రహ్మశ్రీ కే.వి. లక్ష్మణరావుగారి తోడ్పాటున నా వ్రాఁతప్రతిని దెచ్చుకొని నాకడనున్న యచ్చు చిత్తులతో సరిచూచితిని. ఈ వ్రాఁతప్రతిలో గడపటి పత్రము పోయినది చూడఁగా ముక్త్యాలప్రతిలో నేయే తప్పులున్నవో, యేయే గ్రంథపాతములు వ్రాఁతలోనే విడువఁబడినవో, యాయా తప్పులే యాయా గ్రంథపాతములే యిందును గానవచ్చెను. కవివంశాది వృత్తాంతము గల సీసపద్య మిందును లేదు. ఈ రెండు ప్రతులను నొక్కదేశ మందలివై యొక్కమాతృకనుండి యేర్పడిన పుత్త్రికలో వానివాని పరంపరలోనివో యయి యుండుననుకొన్నాఁడను. ప్రత్యంతరము దొరకినదన్న పరితోషమేగాని పరిషత్పుస్తకమువలనఁ దగినంత లాభము కలుగలేదు. తంజావూరులో దొరకిన పద్యములలోను బ్రబంధరత్నాకరములో నున్న పద్యములలోను గల పాఠభేదములు చూపితిని. కవికుల గోత్రాదిక మెఱిఁగించు సీసపద్యమును తంజాపురమున దొరకినదానిని జేర్చితిని. సంస్కృత గ్రంథమునుబట్టి కొన్ని తప్పులు దిద్దితిని. గ్రంథపాతములకుఁ జేయఁబడిన పూరణములకు గుర్తులుంచితిని. ఈ విధముగా యథాప్రజ్ఞము సరిపఱిచి ముద్రణార్థ మా యచ్చుచిత్తులను శ్రీవారి కనిపితిని.

శ్రీ ముక్త్యాలప్రభువులగు శ్రీరాజా వాసిరెడ్డి శ్రీ చంద్రమౌళీశ్వర ప్రసాదబహద్దరుగారు విద్యావినోదముచే బహుధనము వ్యయించి ముద్రాయంత్రమును నెలకొల్పి శ్రీకృష్ణ భారతాది బహు గ్రంథములను రచింపించుచు ముద్రింపించుచు భాషకు మహోపకృతి సేయుచున్నారు. లఘుతరమయినను బ్రాచీనతరమై యుపయుక్తాంశములతోనున్న ఈ చారుచర్యను శ్రీవారు ప్రకటించుట యెంతయుఁ బ్రశంసార్హము. వారి చల్లని చేతిప్రాపున మన యాంధ్రభాషాకన్య యింకను మంచి ప్రోపుఁబడసి వర్ధమానయగుఁగాక యని యర్థించుచున్నాను.

చెన్నపురి, వేటూరి ప్రభాకరశాస్త్రి.
6–7–22.

# శ్రీకాకుళ శ్రీహరిశతక పీఠిక

శ్రీకాకుళము కృష్ణా తీరమునఁ గల ప్రఖ్యాత పుణ్యక్షేత్రము. ఇది యిప్పుడు చల్లపల్లి జమీనులో నున్నది. ఆంధ్రవల్లభ కాకుళేశ్వర నామాంతరములు గల యంధ్రనాయకస్వామి యిక్కడ వెలసియున్న వేల్పు. ప్రాచీన కాలమున నీ శ్రీకాకుళ మంధ్రరాజులకు రాజధానిగా నుండెనని యిప్పటి చరిత్రకారులు కొందఱు వ్రాసియున్నారు. ఆ వ్రాఁత యంత ప్రామాణికముగాఁదోఁపదు. క్యాంబెలు దొరగా రింగ్లీషున వ్రాసిన తెలుఁగు గ్రామరును విశ్వసించి వారట్లువ్రాసిరి. అథర్వణాచార్యకృతముగాఁ ద్రిలింగ శబ్దానుశాసన మనుపేర నుపలబ్ధమయిన వ్యాకరణగ్రంథమందలి యీ క్రింది శ్లోకములు పైవారి వ్రాఁతలకాధారము. బ్రహ్మాండపురాణమందలి వట యీ శ్లోకములు :– "ఆంధ్రనాథోమహావిష్ణుర్నిశుంభ దనుజాపహః! పురా స్వాయంభువమనోః కాలే కలియుగే హరిః, కాకులే రాజవర్యస్య సుచంద్రస్య తనూభవః, ప్రాభవత్సర్వదేవైశ్చవేష్టితో లోకపూజితః శ్రీశైల కాళభీమేశ మహేంద్రనగ సంయుతమ్, ప్రాకారం తు మహత్కృత్వా త్రీణిద్వారాణి చాకరోత్, త్రిలోచన స్సన్మహేశ స్త్రిశూలం చ కరేధృతః, త్రిలింగ రూపేణ వసన్ త్రిద్వారేషు గణైర్వృతః, ఆంధ్రవిష్ణు స్సురయుతో దనుజేన నిశంభునా! యుద్ధ్వాత్రయోదశ యుగాన్ హత్వాతం రాక్షసోత్తమమ్, అవసత్తత్ర ఋషిభిర్యుతో గోదావరీతటే తత్కాల ప్రభృతి క్షేత్రం త్రిలింగమితి విశ్రుతమ్, తత్రత్యా స్తత్సమాలాపాస్తత్కాలీనాహ రేర్భవాః, కాలేన మహతాసర్వం తత్సమం స్వల్పబుద్ధిభిః అస్ఫుటేనోచ్చారి తాని తద్భవానీతి మే మతిః" ఇది ప్రామాణికమైన చరిత్రాంశము కాఁదగునో తగదో యర్థంపరికించిన వారికి గోచరింపకపోదు. ఈ కథ స్వాయంభువ మన్వంతరమందలి దట! విస్తరింపను.

ఈ నడుమ శ్రీకాకుళ క్షేత్ర మాహాత్మ్యమను సంస్కృత గ్రంథమొకటి ముద్రింపఁబడెను. అదియు బ్రహ్మాండపురాణాంతర్గతమే యని కలదు. ఈ శ్లోకము లందున్నవేమో అని పరిశీలించితిని గాని కానరాలేదు. అందలి కథాంశమునకును మీఁది శ్లోకముల కథాంశమునకును సంగతియే లేదు. అందు సుచంద్రాది వృత్తాంతము కానరాదు. ఇటీవల నచ్చునఁ దీర్పబడిన



యా స్థలమాహాత్మ్యమున గూడఁ గొన్ని కూర్పులు మార్పులు జరిగినవని తత్రత్యులు స్థలజ్ఞులు చెప్పుచున్నారు. నేనా ప్రాంతములం దాస్థలమాహాత్మ్యపు ప్రాఁతప్రతికయి వెదకితిని. కాని, దొరకినదికాదు. ఇప్పటికి నూఱేండ్లకుఁ బూర్వము వల్లభాభ్యుదయ మనుపేర నీ శ్రీకాకుళక్షేత్రమహాత్మ్యము ప్రబంధరూపమున దెలిఁగింపబడినది. అది యిప్పుడు దొరకియున్నది. ఆ తెలుఁగుప్రబంధము సంస్కృతగ్రంథమును బట్టి రచింపబడినదే. అతడును దనకు దొరికిన సంస్కృత గ్రంథము తార్మారుగా నున్నదని చెప్పుకొన్నాడు. అచ్చుపడిన యా సంస్కృతస్థలమాహాత్మ్యమునకును నీ తెలుఁగు గ్రంథమునకును బహుభేదము లున్నవి.

అచ్చుపడిన సంస్కృత గ్రంథమున నాంధ్రనాయకపదములనిష్పత్తిని గూర్చి యిట్లున్నది:– "యదయం చంద్రవంశీయై ర్నృపై ర్విష్ణు పరాయణైః, నియతం పాల్యతే దేశ స్తదయం చాంధ్ర నాయకః, అకారవాచ్యే న చ యద్విష్ణునాద్రియతే సదా, తదాంధ్రోభూదయం దేశ స్తదీశోప్యాంధ్ర నాయకః , ఆ మంగీకార మాచష్టే దృఙ్ ధాతుర్ధారణార్థకః, ఆ మిత్యధియతాయం యద్విష్ణు నాంధ్రస్త దుచ్యతే.... ఋషీనగస్త్య ముఖ్యాంస్తాన్ తోషయ న్భక్తవత్సలః అంగీకుర్వన్నధృతయం తమాంధ్రం పరిచక్షతే, ఆంధ్రాణా మిష్టదైవత్వాత్ స్వధృత్యాంధ్ర ఇతీరణాత్, ఆంధ్రాధి దైవీభూతత్వాత్ శ్రీ శోభూ దాంధ్రనాయకః , ఆంధ్రేషు మధ్యవర్తిత్వా దాంధ్రలోక శుభాశ్రయాత్, ఆంధ్ర సంసేవితత్వాచ్చ సోఽ య మాంధ్రేశ్వరోహరిః" ఇన్ని త్రోవలతోనున్న యీ నిష్పత్తులు నవీనము లేమోయని నాకు సంశయమగుచున్నది. ప్రాచీనకాలమున "అంధ్ర" పదమే కాని "ఆంధ్ర" పదమున్నట్టు కన్పట్టదు. శాసనము లందేమి ప్రాఁత వ్రాతలందేమి "యంధ్ర" పదమే కన్పట్టుచున్నది. "తయేతేంఽ ధ్రాః పులిందాః పుల్కసాః" అని వేదమందున్నదట! ఇక్కడ పదచ్ఛేదము "అంధ్రాః" అనియే యగును.

"శైవాని దైవతాన్యత్ర త్రీణి క్షేత్రాణి సంతి వై, శ్రీశైల కాలహస్త్యా ఖ్యద్రాక్షారామాభిధాన్యపి." ప్రాచీనులు శ్రీశైల కాళేశ్వర ద్రాక్షారామముల త్రిక్షేత్రములని చెప్పుచుండఁగా నిందుఁ గొందఱిటీవలివారు చెప్పుచున్న శ్రీశైల కాళహస్తి ద్రాక్షారామములు బేర్కొనబడినవి.

త్రిలింగ శబ్దానుశాసనోద్ధృత శ్లోకములకు, సంస్కృత స్థలపురాణము నకు, తెలుఁగు పద్యకావ్యమునకు సంగతి లేదంటిని. అట్టి దింకొకటి కూడ నున్నది. శ్రీనాథ కృతియే యని పెక్కురు నమ్ముచున్న క్రీడాభిరామ మను వీధి నాటకమున శ్రీకాకుళ క్షేత్రవర్ణన సందర్భమునఁగల పురాణ గాథ యొక విధముగా నున్నది. అందలి పద్యములివి :-

గీ. కారవేల్ల మతల్లికా కల్పవల్లి
కడుపు నిండారఁగాంచిన కొడుకుఁ గుఱ్ఱ
జారచోర మహాధూర్త చక్రవర్తి
దేవవేశ్యాభుజంగుండు తెలుఁగుభర్త

ఆ.వె. పసిడికోర వేఁడి పాలారగించినఁ
బుల్లసిలిన యధరపల్లవమున
విప్రకన్య చనపు వెలయించుచున్నాఁడు
విశ్వమునకుఁ గాకుళేశ్వరుండు.

ఉ. ఈరసమెత్తు వేదములు హ్రీ వహియించుఁ బురాణజాతముల్
సౌరభహీనమై నుపనిషత్తులు వెంబడు నాగమావళుల్
గారవ ముల్లసిల్ల సిరికాకుళనాథుడు నాగదేవభ
ట్టారకు నింటఁ బుట్టి ప్రకటంబగు వేడుక నాదరింపఁగన్."

ఇట్టి కథా ఘట్టము మీఁది గ్రంథములలోఁ గానరాదు. పురాణ గాథల విషయ మిట్లుండెను. శ్రీకాకుళ మొకప్పుడాంధ్ర రాజధానిగా నుండెననుటకు నమ్మఁదగిన యాధారము నాకేదియుఁ గానరాలేదు. ఇప్పుడక్కడ నించుమించుగా ముప్పది శిలాశాసనములు గలవు. వానియం దట్టి ప్రశంస కానరాదు. ప్రాచీన కాలమున నీ క్షేత్రము మహావైభవ మనుభవించినది. ఈ విషయము కొన్ని సంస్కృతాంధ్రగ్రంథములందును, శాసనములందును బ్రస్తావింపఁబడెను. కొన్నింటిని బేర్కొనెదను.

## 2

కేయూరబాహుచరిత్రమున :- " పాటించి కాకుళేశ్వరు తిరునాళ్లలో నర్థులకేటేట నర్థమిచ్చు" చ. నలువుగ గాకుళేశు తిరునాళుల లోపల



గుండమంత్రి నిర్మలమతిఁబెట్ట వేగమయి (?) మాడలు రత్నచయంబుఁ జల్లఁగా। నలవడు హేమవృష్టిక్రియ నర్థులు చాతకకోటిగాఁగ లోఁ। గలగొనరాలుముత్యములు గానఁబడున్ వడగండ్లకైవడిన్. ఈ గుండమంత్రి పొన్నూరి జేరువనున్న నందూరునం దున్నవాఁడు. వెలనాటి రాజగు రాజేంద్రచోడని మంత్రి.

భోజరాజీయమున- సీ॥ విలసితంబగు కృష్ణవేణ్ణ మలాపహారిణి భీమరథి నాథరిత్రియందుఁ। దనరు నదీత్రయాంతర్వేది యగు పావనక్షేత్రమున శోభనముల కెల్ల। ధర నివాసంబైన పెరుమగూరుపురంబునందు విద్వజ్జనానందమైన । జీవన స్థితిచేతఁ జెన్నొందు వంశకర్తృత్వ సంపత్తిఁ బ్రభుత్వమంది। నెమ్మిఁ బ్రత్యక్ష పరమపదమ్మనంగ । నొప్పు శ్రీకాకుళంబున కొడయఁడైన । యంధ్రవల్లభ హరిసేవ నలరుచుండు। బెక్కు విధముల ముమ్మడి తిక్కవిభుఁడు.

భోజరాజీయ కర్త యనంతామాత్యుని తండ్రి యీఁతడు. ఇందుఁ బేర్కొనఁ బడిన పెరుమగూ రిప్పుడు నున్నది. కందుకూరి వీరేశలింగము పంతులుగారీ పద్యము నుదాహరించి శ్రీకాకుళము నాంధ్రవల్లభుని (తెలుఁగు రాయని) అగు పరిపాలనకాలము స్పష్టపడుచున్నదని కవుల చరిత్రమున దొలుత వ్రాసిరి. ఇప్పటి కొత్త కూర్పునందు పూర్వపువ్రాతను బూర్తిగా దిద్దుకొన నొల్లక యటునిటుగాకుండ నించుక సవరించినారు.

క్రీడాభిరామమున- స్రగ్ధర - గరుడ స్తంభ ప్రతిష్ఠాకలన మొదలుగాఁ గల్పమంత్రోక్త పుష్పాధ్వర పర్యంతంబు కృష్ణాతటిని తటమునన్ ద్వాదశక్రోశ ధాత్రీ పరివేషాభ్యంతర శ్రీపరమపదమునన్ బర్వకాలంబునందుం.... భగవదనుమతిం బాపముల్ గాకయుండున్- ఇందు శ్రీకాకుళక్షేత్రము చుట్టుకొలత పండెండ్రు క్రోశములని యున్నది. ఈ గ్రంథమున శ్రీకాకుళ ప్రస్తావము మఱికొంత కలదు. ఉదాహరింపరానిది.

శ్రీకాకుళేస్తవే -

శ్లో. భావస్స్యాక్షా జ్జలధి దుహితుర్భావనా యోగ భాజాం కళ్యాణానా

మహమహమికా కాంక్షితం వేదనాద్యైః, సౌభాగ్యస్య ప్రథమ గణనా సన్నివేశః
కృపాయాః పారే కృష్ణం వసతి భగవాన్ పావనః కాకుళేశః.

ఈ స్తోత్రమును రచియించిన వరదదేశికుఁడు విశిష్టాద్వైత ప్రవర్తక ప్రవరులగు వేదాంతదేశికుల కుమారుఁడు. ఈయన శ్రీకాకుళేశ్వరుని దర్శించి పై స్తోత్రము రచించియున్నాఁడు.

శ్రీకృష్ణదేవరాయఁడు కళింగదేశ విజిగీషను దండువెడలి విజయవాడలోఁ గొంతకాలముండెను. అప్పుడు శ్రీకాకుళక్షేత్రము వచ్చి యాంధ్రనాయకస్వామి కైంకర్యము జరిపి శాసనమొకట చెక్కించినాఁడు. ఆ శాసన మిది- హరేర్లీలా వరాహస్య దంష్ట్రా దండ స్సపాతునః । హేమాద్రి కలశాయత్ర ధాత్రీ ఛత్రశ్రియం దధౌ॥ స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శక వర్షంబులు ౧౪౪౦ అగు నేటి బహుధాన్య నామ సం॥ ఫాల్గుణ శుద్ధ ౧౧ శుక్రవారం శ్రీకాకుళపు తెలుంగురాయలకు శ్రీమన్మహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప కృష్ణదేవ మహారాయలుంగారు దణ్ణం సమర్పించి యిచ్చిన ధర్మశాసనము. స్వామిని కుంభసంక్రమణ పుణ్యకాలమందున దర్శించి కొండపల్లిసీమకుం జేరి వచ్చిన దేవరపుంగోట స్థలంలోపలి యేర్లగడ్డ గ్రామం ౧న్ని మేడూరు స్థలం లోపలి లంకపల్లి గ్రామం ౧న్ని శ్రీకాకుళానను స్వామి ప్రతిగ్రహలబ్ధమయిన సత్రాలభూమి తోటలు, నిత్యావసరాలు, శ్రీరామానుజ కూటము, ద్వాదశులు, సహితమయిన భూమిన్ని, కొత్తలంక, చింతల్లంక, ఉండ్రపలంక, పిరాట్లంక, పురుగుడులంక, క్రోసూరు, నంజెల్లి వచ్చిన కంభాల దొడ్డిన్ని, కొండవీటి సీమలోని పెదగాడివట్టున్ను, వినికొండ సీమలోని కారుమంచిన్నీ, స్వామిసన్నిధిని ధారాపూర్వకముగాను స్వామి నిత్య నైవేద్యాలకున్ను అంగరంగ వైభవాలకున్ను యెడ మడవక జరుగుటకై శ్రీకాకుళుని తెలుంగు వల్లభునికి సమర్పిస్తిమి గనుక ఆ చంద్రార్క స్థాయిగాను అవధరించేది. స్వదత్తాద్ద్విగుణం (ఇట్టిది కొంత) ఈ అయిదు గ్రామాదులున్ను శ్రీ వల్లభునికి సమర్పించి యీ అయిదు గ్రామాదులలో యిందువల్లను వచ్చిన నిత్య నైవేద్యం కట్టడి దద్ధోజనం పళ్యాలు ౪. అలంకార ప్రసాదం పళ్యాలు ౪ అప్పాలు ౨౬ పళ్లెం ౧కి అతి రసాలు పళ్లెం ౧ వడల పళ్లెం ౧. ఇడ్డెనకుడుముల పళ్లెం ౧. పప్పుకూరలు నెయ్యిపచ్చళ్లు..... ఆరగించే పళ్యాలు ౬౦న్ని ఆనవ్రాల ప్రసాద పళ్యాలు ౨ వెరశి ఆరగించే పళ్యాలు ౭౪ ఇంటికి పళ్లెంవారి అమృతపడిని.



ఈ శాసనమునఁ బేర్కొనఁబడిన యేకాదశీతిథియే, యాముక్త మాల్యద రచియింప నాంధ్రనాయక స్వామి కృష్ణరాయలను బ్రబోధించిన యేకాదశీదినముగా మనము తలంపఁదగును. కే.వి లక్ష్మణరావుగా రీ విషయమును పరిషత్పత్రికలో వ్రాసియున్నారు.

శ్రీకృష్ణరాయలవారి యాస్థాన విద్వాంసుఁడును బహుగ్రంథకర్త యునగు లొల్ల లక్ష్మీధర పండితుఁ డొక శాసనమున నీ శ్రీకాకుళాంధ్ర నాయకస్వామి నిట్లు స్తుతియించినాఁడు.

శ్లో॥ ఉరసి నిహితలక్ష్మీ బాహువల్లీయుగేన
స్వకరమేకీకృత్య కేళీవినోదే
కువలయదళదామా నద్ధమందారమాలాం
దధదివ వితనోతు శ్రీకలాం కాకులేశః

ఈ లక్ష్మీధరపండితుని వంశమువా రిప్పటికిని శ్రీకాకుళక్షేత్రము దగ్గఱనే కృష్ణ కద్దరినిగల వెల్లటూరునం దున్నారు.

శ్రీకృష్ణదేవరాయల వారి నాఁటి వఱకు నీ శ్రీకాకుళక్షేత్రము మహోన్నతదశ నందియున్నది. ఆంధ్రనాయకస్వామి నిత్య కైంకర్యములకు వార్షికోత్సవములకును ననేకగ్రామములు చెల్లుచుండినవి. అనర్ఘరత్నాభరణము లనేకము లీ స్వామికి సమర్పితము లయినట్టు శాసనము లందుఁ దెలియుచున్నది. పద్య రూపమున నున్న శాసన మొక్కటి.

చ॥ వరశకరాజవర్షములు వార్ధివిలోచన విశ్వసంఖ్యలం౹ బరగు స్వభానువత్సరము భాసిలు చైత్రము పౌర్ణమాసియం౹ దురుతర భక్తి బల్లనృపుఁ డుబ్బుల కాకుళ తెల్గురాయలం । దిరముగఁ గాంచి కా, న్కయని దేవరకిచ్చె దెలుంగు పాలెమున్.

గీ॥ తెల్గురాయని కళ్యాణ తిరుమహోత్సవాదులకుఁ దెల్గురాయల వారి పేర౹ గల్గు పాలెంబు నిచ్చెఁదా ఘనత మీఱ సర్వకర పరిహారమై శాశ్వతముగ.

గీ॥ దీని నెవ్వఁడు కాపాడుఁ దేజముగను? స్వామి తిరునాళ్లు సాగించు వారలకును। మొక్కులిడి వారి పాదముల్మోదమునను, శిరముననుదాల్తువారల శిష్యజనుఁడ।

క॥ ఈ ధర్మమెవ్వఁడేనియుఁ। గాదని సాగింపకున్న కఠినుండయినన్। మాధవ పదముల దప్పు న ।రాధముఁ డాశమనుపురికి నరుగుచు నుండున్

స్వస్తిశ్రీ శకవర్షంబులు ౧౩౨౪ అగు నేటి స్వభాను నామ సంవత్సర చైత్ర శు. పౌర్ణమీ గురువారంనాడు స్వస్తి సమస్తగుణ గణాలంకార శ్రీమదన్న మాంబాదయ సుపుత్రులయిన బల్లమహారాజ శ్రీమత్కాకుళ తెలుంగు రాయలకు తిరుకళ్యాణ మహోత్సవార్థమయి దేవర స్వనామాభిధేయంబైన తెల్గురాయని పాలెము ఆచంద్రార్కస్థాయిగాను ధారాపూర్వకం చేసి యిస్తిమి గనుక యిందుల స్థానాధిపతులు సాగించంగలవారు.

కంచర్ల శరభన కవి రచియించిన యధ్యాత్మరామాయణమున నీ శ్రీకాకుళక్షేత్ర ప్రశంస కలదు. శా॥౧౩౬౧ కాలమున వీర ప్రతాపరాయల పేర, శ్రీకాకుళాంధ్ర నాయకునికి పండ్రెండు పుట్ల విత్తనాల వట్టుభూమి దానము చేయబడిన ట్లందుఁగలదు.

శ్రీకృష్ణరాయల యనంతరము, శ్రీకాకుళ క్షేత్రము మిక్కిలి తార్మారయినట్లు తెలియుచున్నది. గ్రామసన్నివేశము కొంత కృష్ణామహానదీ ప్రవాహపతితమయినది. ఇప్పుడున్న యాంధ్ర నాయకస్వామి దేవాలయము ప్రాచీన మయినదిగాఁ దోఁపదు. ప్రాచీన దేవాలయము కృష్ణాప్రవాహ పతితము కాఁగాఁ దర్వాత నిప్పటి దేవాలయము కట్టబడినట్టు గోచరించుచున్నది. ఏలనగా, పండ్రెండు పదుమూఁడు శతాబ్దులలోఁ జెక్కఁ బడిన శాసనములు గల రాళ్లు కొన్ని యిప్పటి దేవాలయము కట్టడము గోడలోఁ బడియున్నవి. ఇప్పుడున్న యాలయము ప్రాచీనమే యగునాడు శాసనముల కీ స్థితి తటస్థింపదుగదా! నూట యిర్వదేండ్లక్రిందట నీ శ్రీకాకుళక్షేత్రము ప్రాచీన వైభవము చెడి, తిరునాళ్లు జరుగక, నిత్యోత్సవమలకుఁ గూడ నభావము తటస్థించి యుండఁగా, కాసుల పుల్లంరాజు (పురుషోత్తమ కవి) యను దిట్టడగు బట్టు రాజు నిందాస్తుతితో నిప్పుడు సుప్రఖ్యాత మయియున్న 'శ్రీకాకుళాంధ్రదేవ' శతకము రచియించినాఁడు.



శ్రీకాకుళ శ్రీహరీ యను మకుటముగల శతకమొకటి ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో నున్నది. వల్లభాభ్యుదయ మను పేరు గల స్థలమాహాత్మ్యపు దెలుగు ప్రబంధమొకటి యున్నది. ఇవిగాక కొన్ని సంస్కృత భాణములలో గూడ నీ శ్రీకాకుళక్షేత్ర ప్రశంస కలదు.

పదుమూడు పదునాల్గవ శతాబ్దులలో నీ స్వామిపేరు పెట్టుకొన్న ప్రఖ్యాత రాజపురుషులు కొందఱు ఎఱుగవచ్చుచున్నారు. శ్రీనాథునికిఁ గస్తూరి యొసఁగుచున్న తెలుంగురాయఁడును రామగిరిరాజు తెలుగురాయఁడును మొదలగువారు ఇప్పటికిని తెనగన్న, తెలగయ్య అను విధమున బెట్టబడు చుండెడి పేళ్లీ శ్రీకాకుళపు తెలుగురాయని పేరును బట్టి పారంపర్యముగా వచ్చుచున్నవే యని నా తలంపు.

ఈ శ్రీకాకుళస్వామి కిట్లు ఆంధ్రవల్లభుఁడని తెలుగురాయఁడని పేళ్లుండుటలో నాంధ్రదేశముతోను నాంధ్రభాషతోను సంబంధవిశేష ముండఁ దగును. ఇప్పుడక్కడనున్న శిలాశాసనము లన్నియును ముద్రితములై వెల్లడి యగునేని మఱికొన్ని విశేష విషయము లేవేని బయల్పడఁ గలవేమో! గవర్నమెంటు వారీ శాసనములను త్వరలో వెల్లడింపనున్నారు.

మ॥ కలలోఁ గన్పడి కృష్ణరాయ విభుచేఁ
గబ్బంబు చెప్పించెఁ బే
ర్వెలయన్ మున్నొకనాఁటి సేవగొనియా
శ్రీకాకుళాంధ్రేశ్వరుం
డలరంగా నిపు డంకినీణ్ణృపతి సే
యంబూను నిత్యోత్సవా
కలనన్ దా నిఁకనెన్ని సన్నుత కృతుల్
కావింపఁగాఁ జేయునో!

(1921. దుర్మతి, మాఘ శు॥ ౮ బ॥ ౧౪ , శనివారం ఆంధ్రపత్రిక సారస్వతానుబంధము లందు ప్రకటింపబడిన ఈ రెండు వ్యాసముల విషయమే కొంత సంగ్రహింపబడి భగవద్ధ్యాన ముక్తావళీ శ్రీకాకుళ శ్రీహరి శతకములకు పీఠికగా 1923లో కూర్పబడినది- ప్రకాశకులు)

# భగవదజ్జుకము

## తొడిమ

భగవదజ్జుక ప్రహసన పుష్పమున పరిమళము గొనువా రీ తొడిమతో దానిఁ బరిగ్రహింతురు గాక!

## గ్రంథకర్త

భగవదజ్జుకమని పేరుగల యీ ప్రహసనమునకుఁ గర్తయెవ్వరో గుర్తించుటకు మూలగ్రంథమున నాధారము గానరాదు. కాని, దాని వ్యాఖ్యాత (పూర్ణసరస్వతి కావచ్చును. ఈయన మేఘసందేశ, మాలతీ మాధవాదులకును వ్యాఖ్యాత) మూలగ్రంథకర్త బోధాయనుఁడని పేర్కొన్నాఁడు. వ్యాఖ్యారంభమున,–

శ్లో. బోధాయనకవిరచితే విఖ్యాతే భగవదజ్జుకాభిహితే,
అభినేయేఽతిగభీరే విశదా నధునా కరోమి గ్రంథార్థాన్.
అంతమున,

శ్లో. ఇతి ప్రహసనాభిఖ్యే పూర్వనాట్యని బంధనే,
హాస్యగ్రాహిత తత్త్వార్థే టీకా దిక్తత్త్వదర్శినీ.

శ్లో. యశ్చాసౌ భవభూతిసూక్తిజలధే రర్థౌఘ యాదోగణ
ప్రక్షోభోత్థితభీతిభంజనకరీం వ్యాఖ్యాతరీం నిర్మమే;
తేనేయం విషమేతివృత్తగహనే బౌధాయనీయే పున
ర్నాట్యే గర్భితశాస్త్ర జృంభితవచోగంభీరగుంభే కృతా.

ఒక మూలగ్రంథము ప్రతిలో నిది కలదు :

శ్లో. బోధాయనకవిరచితం బోధాయతనం విముక్తి శాస్త్రాణామ్;
ప్రహసనరత్నం ప్రత్నం భవతు ముదే భగవదజ్జుకీయం వః,

వరరుచి పాణిన్యాదులగు మునులు కొందఱు శాస్త్రకారులేకాక కావ్యకర్తలు గూడ నయియుండిరి. వారినిఁ బ్రాచీన కవులు కవులనుగా స్తుతించిరి. వారి గ్రంథములనుండి కొన్ని శ్లోకములనుగూడఁ బ్రాచీనాలంకారికు లలంకార గ్రంథములం దుదాహరించిరి. వారి



గ్రంథములును గొన్ని యిప్పుడు దొరకియున్నవి. బోధాయన మహర్షి కూడ నట్లు కావ్యకర్తయై యుండవచ్చును. మహర్షి యగు బోధాయనుఁడిట్టి ప్రహసనము రచించెననుట ప్రత్యయితవ్యము గాదని కొందఱందురు. వరరుచి రచియించిన యుభయాభిసారికను వా రరయఁదగుదురు. శ్యామిలకుఁడు పాదతాడితకమం దిట్లు చెప్పినాఁడు :

శ్లో. న ప్రాప్నువంతి యతయో రుదితేన మోక్షం
స్వర్గాయతిం న పరిహాసకథా రుణద్ధి;
తస్మా త్ప్రతీత మనసా హసితవ్యమేవ
వృత్తిం బుధేన ఖలు కౌరుకుచీం(?) విహాయ.

( యతులై యేడ్చుచుఁ గూర్చున్నందువలన మోక్షమురాదు. పరిహాసకథ స్వర్గలాభమును జెడఁగొట్టదు. ప్రాజ్ఞుఁడు కచకుచాదులపై నభిరుచిని జెందరాదుగాని హసించుచునే యుండవలెను.)

శ్రీరామానుజులవారు తమ బ్రహ్మసూత్ర భాష్యమునకు మూలకల్పమని పేర్కొన్న బ్రహ్మసూత్రవృత్తిని (ఇది యిప్పుడు కానరాదు) రచించిన బోధాయన మహర్షియు, గృహ్యసూత్రాది కర్తయగు బోధాయన మహర్షియు (ఇద్దఱు నొక్కరగుదురో కారో!) మనయెఱుక కందియున్నారు. విష్ణుపారమ్యమును, బ్రపత్తి ప్రాధాన్యమును, జెప్పు రామానుజ మతమునకు మూలాధారమయిన యా బ్రహ్మసూత్రవృత్తిని రచించిన బోధాయనుఁడీ ప్రహసనకర్తయగు ననుట యొప్పిదముగా నాకుఁదోఁపదు. ఈ ప్రహసనమున "త్వాం పాతు..... రుద్రస్య సదర్చితః పాదః" అని నాందియున్నది; యోగదర్శనమునకుఁ బ్రాముఖ్యము ప్రతిపాదితమయినది; విశిష్టాద్వైత సిద్ధాంత వాసనకూడఁ గానరాదు. కల్పసూత్రకారుఁడు గూడ నీ గ్రంథకారుఁడు గాఁగూడదనియే నాతలఁపు. ఆయన ప్రతిపాదించు శాంతికపౌష్టిక శ్రౌతకర్మ ప్రాధాన్య మిందుఁ గానరాదు.

ప్రాచీన కవులు కొందఱు బోధాయనునిఁ గూడఁ గవిగాఁ బ్రస్తుతించిరి. రఘువీరచరితమను నాటకమును రచించిన సుకుమారకవి తన నాటక ప్రస్తావనలోను

శ్లో“. యైర్బోధాయనసూక్తి పుష్పకలికాః కర్ణావతంసీకృతా
యేషాం బిల్హణ సూక్తిమౌక్తికసరాః కంఠా నలంకుర్వతే;
మాధుర్యైకభువాం మురారివచసామాస్వాదియైస్స్వాదిమా
సంతుష్యంతి తయేవ నూతనసుధా వేణీషు వాణీషు నః.

నాసికేతోపాఖ్యానము రచియించిన దగ్గుఁబల్లి దుగ్గన కవి ( శ్రీనాథుని బావమఱఁది) గ్రంథావతరణికలోను,

సీ. ప్రణుతింతుఁ బన్నగరాజ వాల్మీకి స
త్యవతీతనూజ బోధాయనులను
ప్రార్థింతు దిఙ్నాగ రాజశేఖర కాళి
దాస సౌమిల్లిక భాసకులను.”

అని వినుతించిరి. ఈ బోధాయనుఁడు బ్రహ్మసూత్ర వృత్తికారుఁడును గల్పసూత్రాదికారుఁడునుగాక వేఱొకఁడేనిఁ గావచ్చును.

## గ్రంథప్రాచీనత

రేచర్ల సింగభూపాలుఁడు రసార్ణవసుధాకరమున నీ భగవదజ్జుక ప్రహసనమును బేర్కొన్నాఁడు. [1] ఆ రేచర్ల సింగభూపతి పదునాల్గవ శతాబ్దివాఁడు. గావున నీ గ్రంథమంతకు బ్రాచీనమనుట యొక విశేషముగాదు. క్రీ.శ. 600లో నున్న మహేంద్ర విక్రమవర్మ యను పల్లవరాజు చెక్కించిన మామండూరు శిలాశాసనమున నీ భగవదజ్జుకము పేరున్నది. ఆ

1. శుద్ధం కీర్ణం వైకృతం చ తచ్చ ప్రహసనం త్రిధా; శుద్ధం శ్రోత్రియ శాఖాదే ర్వేషభాషాది సంయుతమ్. చేటచేటీజనవ్యాప్తం తల్లక్ష్యం తు నిరూప్యతామ్; ఆనందకోశ ప్రముఖం తథా భగవదజ్జుకమ్, కీర్ణంతు సర్వైర్వీధ్యంగై స్సంకీర్ణం ధూర్తసంకులమ్, తస్యోదాహరణం జ్ఞేయంబృహత్సౌభద్రకాదికమ్, యచ్చేదం కాముకాదీనాం వేషభాషాది సంగతైః, షండతాపస వృద్ధా ద్యైర్యుతం తద్వైకృతంభవేత్, కలికేళీప్రహసన ప్రముఖం తదుదాహృతమ్. ఈ శ్లోకములిటీవల ననంత శయనగ్రంథమాలలో ముద్రితమయిన నాగరీలిపి గ్రంథమందు చేరలేదు. పూర్వము శ్రీ వేంకటగిరి రాజాగారిచే ముద్రితమైన తెలుఁగులిపి గ్రంథమందుఁ గలవు.



గొప్పశిలాశాసన మిప్పుడు శిథిలమై యక్కడక్కడ కొంతకొంత మాత్రమే చదువఁ దగినదిగా నున్నది. [1]

ఈ మహేంద్రవిక్రమవర్మ విద్యావిశారదుఁడు. కిరాతార్జునీయకారుఁడగు భారవికవి యీయన యాస్థానమున నుండెను. [2] ఈ రాజు స్వయము మత్తవిలాసమని యొక ప్రహసనమును గూడ రచియించినాఁడు. అది యీనడుమ దొరకినది. ముద్రితమైనది. శిలాశాసనమున దానిపేరుగూడఁ గలదు మత్తవిలాసముతో పాటు దీనిఁగూడ నా మహేంద్రవిక్రమవర్మయే రచించియుండవచ్చునేమో యని యూహించుటకు, వ్యాఖ్యాత బోధాయనకృతమనుట, యితరకవులు బోధాయనుఁగవినిగాఁ బ్రస్తుతించుట, వేఱొక బోధాయన కవికృతియెఱుఁగ రాకుండుట, కొంతబాధకమయినను, నారెండు ప్రహసనము లందును రచనాసామ్యముండుట కొంతసాధకమగుచున్నది. భగవదజ్జుకము పరిహసించునట్టే మత్తవిలాసముగూడ బౌద్ధమతమును బరిహసించుచున్నది. భగవదజ్జుక మందున్న వాక్యములే కొన్ని మత్తవిలాసమందు నున్నవి కాని, మత్తవిలాసము భగవదజ్జుకమంత ప్రౌఢముగా లేదు. ప్రాచీనమగు భగవదజ్జుకమును మహేంద్రవిక్రమవర్మ మత్తవిలాసమందనుకరించెనేమో! మామండూరు శాసనము స్పష్టముగా గుర్తింపఁదగియుండె నేని యనుమానములకు నపోహములకు నవకాశము లేకుండెడిది.

కర్త బోధాయనుఁడో, మహేంద్రవిక్రమవర్మయో, మఱొకఁడో యెవ్వరయినను, క్రీ.శ. 600కుఁ దర్వాతివాఁడు మాత్రము కాఁడని మామండూరుశాసనమిప్పుడు గూడఁ బేరెత్తి చెప్పుచున్నది.

## గ్రంథార్థము

ప్రహసనమనగానే పాఠకులు సాధారణముగా మన తెనుఁగు దేశమునఁ బ్రకటితమైయున్న లంబోదరప్రహసనమును స్మరించి దానివలె

1. సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్ వాల్యూము IV చూ.
2. దండి రచితమగు అవంతిసుందరీకథను జూడఁదగును. ఈ గ్రంథమును శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు ప్రకటించుచున్నారు.

నిదికూడఁదుచ్ఛమును జుగుప్సితమును నగు బందుబూతుపరిహాసముతో నిండియుండునని రోఁత చెందుదురేమోగదాయని భీతిచెందుచున్నాను. ఇది యట్టిదిగాదు ఇందుఁ గల హాస్యము విందుగూర్చునది. ఆ హాస్యముగూడ నాపాతహృద్యమేకాక యాలోచనామృతమునై యధ్యాత్మతత్త్వబోధక మగుచున్నది. హాస్యచ్ఛలమున నధ్యాత్మ తత్త్వమును బోధించుటలోఁ గవి యిం దసాధారణ చాతుర్యమును జూపినాఁడు. వ్యాఖ్యాత యీ ప్రహసనమునఁ బ్రత్యక్షరము యోగదర్శనపరముగా నంతరార్థముఁ జెప్పుచు వ్యాఖ్యరచించి నాఁడు. ఆయన చెప్పిన యంతరార్థమితీరిట్టిది :-

శ్లో. అస్మిన్ నాట్యరసే నిసర్గగహనే యోగీంద్రశిష్యా వుభా
వాత్మానౌ పరజీవభేదకథితా వన్యా తథై వాజ్జుకా;
మూలాధార సముద్గతా ససుషిరా నాడీ సుషుమ్నా, పరే
చేట్యౌ చోభయ పార్శ్వగే ససుషిరే నాడ్యా విడాపింగళే.

శ్లో. అవిద్యా గణికా మాతా మోహో రామిలకో మతః
వైద్యో హి కల్ప సంకల్పౌ కాలస్తు యమ పూరుషః
ఏవం ప్రేక్షామయం యోగం యుంజన్నర్తకతాపసః
ప్రత్యంచ మచ్యుతం సద్య స్సాక్షాత్కృత్య సుఖీ భవేత్.

వ్యంగ్యమయిన యీయంతరార్థముమాట యెట్లున్నను వాచ్యమయిన బాహ్యార్థమందే బహుధర్మము లిందుఁ బ్రతిపాదితము లయినవి: ఫలాభిసంధిలేక చేయుకర్మము బంధకముగామి, అంతరాత్మ కర్మాత్మల (పరమాత్మ జీవాత్మల) విభేదము, భోగాస్థైర్యము, ప్రామాణ్యపరిజ్ఞానము, అధ్యయనావశ్యకత, సంగరాహిత్యము, యోగప్రశంస, స్వధర్మజిజ్ఞాస, పరధర్మజిహాస మొదలగునవి.

పయిఁ బేర్కొన్నవానికంటె నీ ప్రహసనమున నింకొక పరమ ప్రయోజనము గలదు. క్రీ. యేడవశతాబ్దికిఁ బూర్వకాలమున భరతఖండమున బౌద్ధమతమునకుఁ బ్రాభవము హెచ్చుగానుండెను. ప్రత్యక్షానుమానములను మాత్రమే ప్రమాణముగా నంగీకరించుచు భూతదయనే పరమార్థముగాఁ జెప్పుచునున్న బౌద్ధసిద్ధాంతములు తేటగా లోకమునఁ బాటికెక్కుచుండెను.



శబ్దమునుగూడఁ బ్రమాణముగా నంగీకరించి యప్రత్యక్షవిషయముల నందుండి సాధించుచున్న దర్శన మతముల కప్పుడు తళ్లువచ్చెను. ఇప్పటి కేఁబది యేండ్లకు ముందు క్రీస్తు మతమువారి బోధలు. చర్చులు మొదలగునవి భారతీయుల కెంత వలపుగొలుపునవిగా నుండి యెంతవ్యాప్తి చెందెనో, యా కాలమున బుద్ధమతమువారి బోధలు, స్తూపములు సంఘములు గూడ, నంత వలపు గొలుపునవిగా నుండి యంతవ్యాప్తి చెందెను. బౌద్ధమతమును నిర్మూలించుటకయి యాస్తికు లనఁబరగిన వైదికమతములవా రప్పుడు బహుగ్రంథముల రచించిరి; శబ్దప్రమాణ మంగీకరింపనివారిని నాస్తికులని గర్హించిరి; తర్కము లందు దించి యోడించిరి. ఏమిచేసినను నెనిమిదవ శతాబ్దిలో శంకరు లుదయించి యద్వైతసిద్ధాంతమును రాద్ధాంత పఱుచు నంతదాఁక బౌద్ధమతమునకు నిజముగా బలము క్రుంగలేదు, బౌద్ధమతప్రచారమును భంగపఱుచుటకై యాకాలమున నీ ప్రహసన రచన మావశ్యకమయినది. ఇందు శాండిల్యుఁడను శిష్యుఁడు బౌద్ధమత వ్యామోహమునఁబడి చెడినవాఁడు. అప్రత్యక్షముల నాతఁడు నమ్మఁడు; శబ్ద ప్రమాణమును విశ్వసింపఁడు; వేళకు భోజనముఁ జూచుకొనుచు; అప్రయోజకమయిన యనుతాపముఁ జూపుచుభూతదయ యని యుసురుడుగుచున్న వేశ్య నుపచరింపఁ బోవును; తగదన్న యాచార్యునిఁ దెగఁదిట్టును. వెంగలితనము నిట్లు వెల్లడించుచున్న శిష్యునిఁ బరివ్రాజకుఁ డెంతయు శాంతుఁడై చక్కదిద్దెను. ఈ ప్రహసనముఁ బ్రయోగించునప్పుడు చూచినఁగాని లేక చదివినను గాని బౌద్ధమతమునెడఁబెడమొగము పెట్టనివారుండరు. కవి యిందు బౌద్ధమతము నంత సక్కఁగా వెక్కిరించి నాఁడు. ఆ కాలమున నీ ప్రహసనము బౌద్ధమతవ్యాప్తిని గొంత పడఁ గొట్టియు నుండును. ఈ ప్రహసనమందు యోగదర్శనము పరమార్థ సాధకముగా నిరూపింపఁబడినది; మహేశ్వరాదులు యోగాచార్యులు స్మరింపఁబడిరి. శంకరాద్వైత మాకాలమునకు జన్మింపనే లేదు. ఇందు "అష్టౌ ప్రకృతయః" - ఇత్యాదిగా సాంఖ్యదర్శనముగా నొకవాక్యమును, "అదిణ్ణాదాణాదో " ఇత్యాదిగా బౌద్ధపిటకపుస్తకములలోనిదిగా నొక వాక్యమును గానవచ్చుచున్నవి. కపిలముని సాంఖ్యసూత్రములలోఁగాని యీశ్వరకృష్ణుని సాంఖ్య సప్తతిలోఁగాని మొదటివాక్యము కానరాదు. అది యేగ్రంథములోనిదో నే నెఱుఁగఁజాలనయితిని. ఈ వాక్యముగల గ్రంథమేదో

నాకాలమందుండి యిప్పు దంతరించెనేమో! రెండవది బౌద్ధపిటక పుస్తకములలోఁ గలదట. “ అదత్తాదానా ద్విరమణం శిక్షాపదం, ప్రాణాతిపాతాద్విరమణం శిక్షాపదం, ముథావాదా ద్విరమణం శిక్షాపదం, అబ్రహ్మచర్యా ద్విరమణం శిక్షాపదం, అకాలభోజనా ద్విరమణం శిక్షాపదం, అస్మాకం; బుద్ధం, ధర్మం, సంఘం, శరణం గచ్ఛామి.” ప్రాకృతమూలమున కిది సంస్కృతచ్ఛాయ. “మాకు పరవిత్తాపహరణమునుండి తప్పుకొనుట యభ్యసింపవలసినది; ప్రాణి హింస నుండి తప్పుకొనుట యభ్యసింపవలసినది; అసత్యోక్తి నుండి తప్పుకొనుట యభ్యసింపవలసినది; అబ్రహ్మచర్యము నుండి తప్పుకొనుట యభ్యసింప వలసినది; అకాలభోజనము నుండి తప్పుకొనుట యభ్యసింపవలసినది; నేను బుద్ధదేవుని శరణము చొచ్చెదను; బౌద్ధధర్మమును శరణముచొచ్చెదను; బౌద్ధసంఘమును శరణము చొచ్చెదను.” మొదటి యైదింటికిఁ బంచ శిక్షాపదములని కడపటి మూఁడింటికి శరణత్రయమని వెరసి యెన్మిదింటికి నార్యాష్టాంగములని బౌద్ధులలో వ్యవహారమట.

‘ రోమాంచోముఖశోషశ్చ’ ఇత్యాదిగా నిందుదాహృతమయిన శ్లోకము చరక సుశ్రుతాదులలోఁ గలదేమో గుర్తింపఁజాలనయితిని. ఆ కాలమునఁ గూడ నపండితులు చేతఁగాని వైద్యముఁ జేయుచుండుట నిందుఁగల వైద్యహాస్యము తెలుపుచున్నది.

పరివ్రాజకుఁడు వేశ్యాశరీరమునఁ బ్రవేశించి కొంతవింత నడపు చుండఁగా వింతపై వింత యన్నట్లు పరివ్రాజక శరీరమున వేశ్యాప్రాణములను యమపురుషుఁడు ప్రవేశపెట్టెను. తన శరీరమున వేశ్యాప్రాణములకుఁ బ్రవేశము కల్గునని పరివ్రాజకుఁడు ముందెఱుఁగఁడు. అది జరిగిన తర్వాత వేశ్యాశరీరమందుఁగల పరివ్రాజకుఁడు భాషింపనే లేదు. ఆశ్చర్యము చెంది యాలోచించుచున్నాఁడు. శాండిల్యుఁడును ఆలోచనాంబుధిలో మునిఁగినాఁ డు. కవి యిక్కడ కడునేర్పు చూపినాఁడు.

## కథాస్థానము

అజ్జుక ప్రశ్నింపఁగాఁ జేటి ‘బావ ఇదుగో వస్తున్నానని చెప్పి నగరంలోకే వెళ్లాడు.’ అన్నది వ్యాఖ్యాత యిక్కడ నగరమనఁగా ‘పాటలీపుత్ర’మని



వ్యాఖ్యచేసినాఁడు. అది యుక్తమే. యమపురుషుడు యమలోకము దారిని బేర్కొనుటలో గంగ నుండి యుపక్రమించి దక్షిణముగానున్న నదీనగ నగరాదులను జెప్పినాఁడు. కావునఁ గథాస్థానము గంగకావల నుండవలసినదే కదా!

## తెలుగుచేఁత

ఈ ప్రహసనము ప్రాకృత బహుళము. ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో విచ్ఛాయముగాఁ దప్పులతో దీని వ్రాఁతప్రతి యొకటి కలదు. దానిఁజూచి వ్రాసికొని యెట్లో నేను దెలిఁగించితిని. కాని కొన్ని చోట్లఁ దప్పులు దిద్దఁ గుదురనివిగా నుండెను. కథారంభముననే “పరివ్రాజక:– శాండిల్య! శాండిల్య! (పృష్ఠతో ఉవలోక్య) న తావదృశ్యతే; సదృశమస్య తమోవృతస్య” అని యుండవలసిన వాక్యములోని యేకదేశము’న తావదృశ్యతే సదృశమస్య తపోవ్రతస్య’ అని యుండెను. ఇట్టి చిక్కులింకను బెక్కులు గలవు. కర్తపేరులేని వ్యాఖ్యానము క్రొత్తగా నపుడు పయి పుస్తకశాలకు వచ్చెను. నే నావ్యాఖ్యానము సాహాయ్యమున సర్వసంశయముల దీర్చుకొన్నాను. ఆ వ్యాఖ్యానమునఁ గూడఁ బ్రాకృత వాక్యములకు వ్యాఖ్యయే కలదుగాని సరిగా ఛాయలేదు. అయినను నది సరిగా గుర్తింపదగినదిగానే యుండెను. ఇప్పటి తెలుఁగు పలుకుబడి చొప్పున నేనా ప్రాకృతము నించుక స్వతంత్రించి విడఁబఱిచి యనువదించితిని. నా తెలుఁగుచేఁత యెట్లున్నదోకాని మూలగ్రంథము మిక్కిలి హృద్యమయినదని నే ననఁగలను.

శ్రీభారతీ పత్రికలో నా తెలుఁగుచేఁత ప్రకటింపఁబూనిన సమ కాలముననే బీహార్ అండ్ ఒరిస్సా జర్నల్‌లో మూలగ్రంథము విచ్ఛాయముగానే ముద్రితమై వెల్వడెను. చూచితినిగాని యది యనేక లోపములతో నసంగతమై యున్నది. గ్రంథభాగములే యందు విడువఁబడినవి. దానిఁ బ్రకటించినవారు వ్యాఖ్యానము నెఱుఁగరు. నే నిప్పుడు సరిపఱుచుకొన్న మూలము వారి ముద్రణముకంటె నెంతో గుణవంతముగా నున్నది వారికి దాని కర్తనుగూర్చి కాలమునుగూర్చి యేమియు నెఱుఁగరాలేదు. బౌద్ధమత ప్రశంసనుబట్టి ప్రాచీనమయిన దని మాత్రము వారు భావించిరి.

కడుఁజిన్నదగు నీప్రహసన పుష్పమునకు దొడిమ యింక నెక్కుడుగా నుండరాదుగదా!

శ్రీభారతీపత్రికలోఁ బ్రకటించునప్పుడు కూర్చిన యచ్చు కూర్పును, చెక్కించిన చిత్రమును దర్వాత నేనిట్లు పుస్తకముగా ముద్రించుకొనునప్పు డుచితముగా నొసఁగి యచ్చొత్తించి యిచ్చిన శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారియెడఁ గృతజ్ఞుఁడ నగుచున్నాను.

రక్తాక్షి
విజయదశమి
(1924)

వేటూరి ప్రభాకరశాస్త్రి

( 1925 లో భగవదజ్జుక సంస్కృత ప్రహసనమును వావిళ్ల వారిచేత శ్రీ ప్రభాకరులు ప్రకటింపజేసిరి. నాగరిలిపిలో ముద్రింపబడిన ఆ గ్రంథమున శ్రీ ప్రభాకరశాస్త్రి గారి పీఠిక సంస్కృతమున గలదు. అనుబంధమున దానిని చేర్చితిమి – ప్రకాశకులు.)

# ఉద్భటారాధ్య చరిత్రము

ఉద్భటారాధ్య చరిత్ర మపూర్వ సత్ప్రబంధములలో నొక్కటి. దీనికి

## కర్త తెనాలిరామలింగకవి

అనఁగానే దీని సత్ప్రబంధత్వము గొంత సమర్థిత మగును గదా! తెనాలి రామలింగకవి యని తెనాలి రామకృష్ణకవి యని యొక్కనినే యటు నిటు గూడ లోకము పేర్కొనుట గలదు. తొలుత నాతఁడు శైవుఁడనియు, నప్పుడు రామలింగఁడని పేరయ్యెననియు, దర్వాత వైష్ణవము పుచ్చుకొనె ననియు, నప్పుడు రామకృష్ణుఁడని మార్పుపేరయ్యె ననియుఁ బ్రతీతి. దీనిని వీరేశలింగము పంతులుగారు మొదలగువారు గొందఱు నమ్మిరి. మఱికొందఱు నమ్మరయిరి. ఆ రెండుపేళ్లు [1] నొక్కనివే యని నేనును విశ్వసించుచున్నాఁడను. అట్లు విశ్వసించుట కిదివఱకున్న యాయైతిహ్యము మాత్రమేకాక యపూర్వముగాఁ గొన్ని యాధారములును నాకగపడినవి. తెలుపుచున్నాఁడను.

## రామలింగఁడే – రామకృష్ణుడు

రామకృష్ణకవి కృతములుగా నిదివఱకు దొరకి ప్రకటితము లయియున్న గ్రంథములు రెండు. అవి పాండురంగమాహాత్మ్యమును, ఘటికాచలమాహాత్మ్యమును. రామలింగకవి కృతిగా నిప్పుడు క్రొత్తగా దొరకి ప్రకటితమయినది యుద్భటారాధ్య చరిత్రము. తొల్త నాతఁడు శైవుఁడుగా నుండి తర్వాత వైష్ణవుఁడుగా మాఱెననియే నేనిందు ముందు నిరూపింపనున్నాఁ డను గాన యుద్భటారాధ్య చరిత్రము మునుపటి గ్రంథముగాను తక్కిన రెంటిని దర్వాతివానిఁగాను దెలుపుచున్నాఁడను.

ఉద్భటారాధ్య చరిత్రమున రామలింగకవి స్వవిషయ మిట్లు తెల్పుకొన్నాఁడు :–

1. విశ్వకర్మవంశ్యుఁడు, ధీరజనమనోరంజనకర్త, తెనాలి రామలింగ కవి యొకఁ డున్నాఁడు. అతఁడు వేఱు.

సీ. కౌండిన్యముని రాజమండలేశ్వరవంశపాథోధి నవసుధా భానుమూర్తిఁ
బాలగుమేలేశ పదపయోజద్వయీధ్యానధారణ సముదాత్తచిత్తు
మానితాయాత యామానామ భావితవిపుల మహాయజుర్వేదవేది
రామేశ్వరస్వామి రమణీయ కరుణావిశేషపోషితవిలసిత సమగ్ర

గీ. సహజ సాహిత్య మాధురీ సంయుతాత్ము
లక్కమాంబకు ఘనయశోలక్ష్మి వెలయ
రామధీమణికిని బుత్త్రు రామలింగ
నామవిఖ్యాతుఁ గావ్యనిర్ణయధురీణు.

గద్యమునందును, " ఏలేశ్వర గురువరేణ్య చరణారవింద షట్చరణ సకలకలాభరణ రామనార్య సుపుత్ర సుకవిజనమిత్ర కుమారభారతీ బిరుదాభిరామ రామలింగయప్రణీత" మని యున్నది.

పాండురంగమాహాత్మ్యమున రామకృష్ణకవి యిట్లు చెప్పుకొన్నాఁడు.

సీ. ......శైవవైష్ణవ పురాణావళీనానార్థ
ములు నీకుఁ గరతలామలకనిభము

గీ. అంధ్రభూమికుచాగ్రహారాభ మైన
శ్రీ తెనాల్యగ్రహారనిర్ణేత వగ్ర
శాఖికాకోకిలమ వీవు సరసకవివి
రమ్యగుణకృష్ణ! రామయరామకృష్ణ!

క. కౌండిన్యసగోత్రుఁడ వా
ఖండలగురునిభుఁడ వఖిలకావ్యరససుధా
మండనకుండలుఁడవు భూ
మండలవినుతుఁడవు లక్ష్మమావరతనయా!

"శా-రదనీరూపము రామకృష్ణ కవిచంద్రా ! సాంద్ర కీర్తీశ్వరా"

క. వాక్కాంతాశ్రయు భట్టరు
చిక్కాచార్యుల మహాత్ము శ్రీగురుమూర్తిన్
నిక్కపుభక్తి భజించెద
నిక్కావ్యకళాకలాప మీడేఱుటకున్.



గద్యమున-ఇది శ్రీమత్పరమపదనాథనిరవధిక కృపాపరిపాకపరిచిత సరసకవితాసనాథ రామకృష్ణకవినాథ ప్రణీతంబైన - అని యున్నది.

| రామలింగకవి | రామకృష్ణకవి |
|---|---|
| కౌండిన్యగోత్రుడు | కౌండిన్యగోత్రుడు |
| శుక్లయజుర్వేది | శుక్లయజుర్వేది |
| తండ్రి రామయ్య | తండ్రి రామయ్య |
| తల్లి లక్ష్మమ్మ | తల్లి లక్ష్మమ్మ |
| కుమారభారతీబిరుదాభి | శా-రదనీరూపము |
| . రాముడు | రామకృష్ణ కవిచంద్రా! |

ఉద్భటచరిత్రము బాల్యమున రచించినది గాన 'కుమార భారతి' యని బిరుదు చెప్పుకొన్నాఁడు. పాండురంగమాహాత్మ్యము ముదివయసున రచించినది గాన 'శారద నీ రూపము' అని కృతిపతి తన్ను సంబోధించినట్టు చెప్పుకొన్నాఁడు. కాన, యీభేదము సంగతమే. ఇన్ని సరిపడి యున్నను నుద్భటచరిత్రమున రామలింగయ యని గ్రంథకర్తపేరును పాలగుమి యేలేశ్వరుఁడని గురుని పేరును, పాండురంగమాహాత్మ్యమున రామకృష్ణుఁ డని గ్రంథకర్తపేరును, భట్టరుచిక్కాచార్యులని గురునిపేరును గానవచ్చుట, గద్యములరీతులు భిన్నములుగా నుండుట రెండు నొక్కనిపేళ్లే యను సిద్ధాంతమునకుఁ గొంత బాధకముగాఁ గానవచ్చును. ఈ భేదములు మతము మాఱుటచే నేర్పడినవే యని నే ననెదను.

## అందుకు సాధకములు

ఇందుమతీపరిణయ మని తెనాలి రామభద్రకవికృతి యొకటి కలదు[1] అందిట్లున్నది.

1. ఇది తంజాపురపు సరస్వతీ పుస్తక భాండాగారమునఁగలదు. శ్రీ మానవల్లి రామకృష్ణకవి, యం.ఎ.గారు దీని విషయము 1914 సంవత్సరాదిసంచికలో "తెనాలి కవులు" అను వ్యాసమునఁ దెలిపినారు. వారే దీని ప్రతిని చెన్నపురి గవర్నమెంటు లైబ్రరికిని నొసఁగినారు.

...................... కవితాఘనతామహు మత్పితామహున్
రామయ రామకృష్ణకవిరాజుఁ దలంచి నుతించి మ్రొక్కెదన్

గీ. తదనుసంభవమణిని సుదక్షిణాప
రిణయముఖకావ్యరచనాధురీణు నాంధ్ర
కవికదంబములోనఁ బ్రఖ్యాతి గన్న
యన్నప కవీంద్రు ధీసాంద్రు నభినుతింతు.

*    *    *

సీ. ప్రౌఢి మీ పెదతాత పాండురంగాదిస
త్కృతులు చేసెను రామకృష్ణసుకవి
యనుజుఁ డన్నప్ప మీ పినతాత రచియించెఁ
బరcగ సుదక్షిణాపరిణయంబు
మీ తాత శ్రీగిరి చాతురీ విఖ్యాతి
శ్రీశైలమాహాత్మ్యకృతి యొనర్చె
కడిమి మీ తండ్రి యిమ్మడి రామకృష్ణాఖ్యుఁ
డనఁ గీర్తి గనె సంస్కృతాంధ్రములను

గీ. నౌర యనిపించె మీయన్న వీరరాఘ
వాఖ్యకవి సర్వకవితామహత్త్వమునను
ని న్న నూచానసంతాను నెన్నఁ దరమె?
ప్రాజ్ఞహృదయాబ్జరవి రామభద్రసుకవి!

దీనింబట్టి చూడcగాఁ బాండురంగ మాహాత్మ్యాదులను రచించిన తెనాలి రామకృష్ణకవియును, సుదక్షిణాపరిణయము రచించిన తెనాలి యన్నయ కవియును నన్నదమ్ములని యేర్పడుచున్నది. దీనికి సరిగానే సుదక్షిణాపరిణయమున;

గీ. నవ్యసుగుణాభిరామ తెనాలిరామ
పండితాగ్రణిసత్పుత్త్రు భవ్యమిత్రు



హరపదాంభోజ సౌముఖ్యు నన్నపాఖ్యు
నన్నుఁ బిలిపించి యాదరోన్నతి వహించి.,

*    *    *

గద్యము–“ ఇది శ్రీమత్తెనాలి రామేశ్వరశాశ్వతకృపాకటాక్షలక్షిత కవితాభిరామ రాయపండితకుమార సహజశైవాచార సంపన్న ధీమదన్నయ నామధేయప్రణీతం బైన సుదక్షిణాపరిణయమందు” అని యున్నది.

ఈ సుదక్షిణాపరిణయ పద్యముల వలనఁ గూడఁ దెనాలి రామకృష్ణుఁడు, తెనాలియన్నయ, యన్నదమ్ములగుట యితర ప్రమాణనిరపేక్షముగానే యేర్పడుచున్నది. ఇర్వురును రామయ పండితుని కొడుకులే; తెనాలివారే; ఒక కాలమువారే. ( అది ముందు తెలియనగును. ) అంతేకాక రామలింగఁడే రామకృష్ణుఁడయ్యె ననుటను గూడ నీ సుదక్షిణాపరిణయమే స్వతంత్రముగా సాధించుచున్నది. ఉదాహృతగద్యపద్యములవలన నన్నయ సహజశైవాచారుఁ డనియుఁ దెనాలిలో వెలసిన రామేశ్వరస్వామి యనుగ్రహమునఁ గవిత నేర్చినవాcడనియు, మఱియు,

గీ. కాళిదాసాది సంస్కృత కవులఁ దలcచి
యాంధ్రభాషావిశేషభాషాధిపతుల
నన్నపార్యాదులను బుద్ధి సన్నుతించి
పాలగుమిభీమగురుని సద్భక్తిఁ గొలుతు.

అను పద్యమువలనఁ బాలగుమిభీమయశిష్యుఁ డనియు నెఱుక పడుచున్నది. దీనినిఁ బట్టి యన్నయకుటుంబమువారును సహజముగా శైవాచారసంపత్తి కలవారనియు, తెనాలి రామలింగస్వామి భక్తులనియుఁ, బాలగుమివారి శిష్యులనియుఁ దలcపcగూడును.[1] మన ప్రస్తుతగ్రంథమగు

1. పాలగుమివా రారాధ్యులు గాcబోలును.. రామలింగకవి కింకను నూఱేండ్లకు ముందొకఁ డా యింటిపేరివాcడు శైవాచార్యుcడు కొండవీటి రెడ్డి రాజ్యమున నున్నట్టు శాసనమున్నది. శ్లో. పాల్గుమిశ్రీకంఠగురోః పంచాక్షరమంత్ర పౌనరుక్త్యస్య; శిష్యాయ శిష్యపరిషద్రక్షా దాక్షిణ్యసత్కటాక్షస్య. శక 1336 నాcటిది, పెదకోమటి మాచారెడ్డి శాసనము. శృంగార శ్రీనాథము ననుబంధము చూచునది.

నుద్భటచరిత్రమును రచించిన రామలింగకవి యిట్టి లక్షణములు గలవాఁడు. అతని శైవాచారనిరతి యుద్భటచరిత్రమున స్పష్టముగాఁ గన్పట్టుచున్నది. మఱియు నాతఁడు 'రామేశ్వరస్వామి రమణీయ కరుణావిశేషపోషిత విలసిత సమగ్ర, సహజసాహిత్యమాధురీసంయుతాత్ముఁడ' ననియు 'పాలగుమేలేశ పదపయోజ ద్వయీ ధ్యానధారణ సముదాత్తచిత్తుఁడ' ననియుఁ జెప్పుకొన్నాఁడు. పాలగుమి యేలేశ్వరుఁడును బాలగుమి భీమేశ్వరుఁడును నన్నదమ్ములో తండ్రికొడుకులో యయియుందురు.

మఱి, యన్నయ తన యన్నయని రామలింగనిఁ (లేక రామకృష్ణునిఁ) బ్రస్తుతింపకున్నంతమాత్రాన వారి సౌదర్యవిషయము సందేహింపఁదగినదేమో యనరాదు. తెనాలి రామభద్రకవి తన తాతలన్నదమ్ములు ముగ్గురనియు, మొదటివాఁడు పాండురంగమాహాత్మ్యకర్త రామకృష్ణుఁడనియు, రెండవవాఁడు తన తండ్రి తండ్రి శ్రీగిరి యనియు, మూఁడవవాఁడు సుదక్షిణాపరిణయకర్త యన్నయ యనియు స్పష్టముగాఁ జెప్పినాఁడు గాన యిట్టి సందేహమునకు సందు లేదు.

అన్నయకవి మతము మార్చుకొన్నాఁ డన్నయనాదరముచే నన్నగారిని బ్రస్తుతింపకపోయెనేమో !'సహజశైవాచార' యన్నపద మాయన్న నడుమఁ దెచ్చుకొన్న వైష్ణవాచారము మీఁది వైమనస్యముచేఁ జేర్చుకొన్నదేమో! రామకృష్ణ కవి తన మతము మార్పును దెలుపుకొనకున్నను, బాండురంగమాహాత్మ్యమున 'శైవవైష్ణవపురాణావళీ నానార్థరచనా పుష్టైకరమ్యమతివి' [1] అని తన శైవప్రబంధ రచనమును దెలుపుకొన్నాఁడు.

తెనాలిలో నుండుటచేతనే తర్వాత తెనాలివారని యింటిపేరేర్పడినది గాని యంతకుముందు వారియింటిపేరు గార్లపాటి వారని ప్రాఁతవ్రాఁతలలో నున్నది. గురజాడ శ్రీరామమూర్తి పంతులుగారును వీరేశలింగం పంతులుగారును దీనిని జెప్పిరి. తెనాలిలో నున్న రామయపండితుఁడు శైవాచారపరుఁడు గాన యక్కడ వెలసియున్న రామలింగస్వామిపేరే తన

1. 'శైవవైష్ణవ పురాణావళీ నానార్థములు నీకుఁ గరతలామలకనిభము' లని పాఠాంతరము కలదు. పాండురంగమాహాత్మ్యమున నీ పద్యము పాఠభేదములతో నున్నది.



ప్రథమ పుత్రునికిఁ బెట్టుకొనెనని నేను దలఁచుచున్నాఁడను. అన్నయ చెప్పుట చేతనే కాక యీ క్రింది సాధనము చేతఁ గూడ నాతఁడు శైవాచారపరుఁడని రామలింగేశ్వరస్వామిభక్తుఁడని యేర్పడుచున్నది.

తెనాలిలో రామలింగేశ్వరస్వామి యాలయమున నొక యుత్సవ విగ్రహము పీఠము మీఁద నీ శ్లోక మున్నది.

శ్లో. శ్రీ తెనాలినగరే వ్యరాజయ ద్గార్లపాటిపురరామపండితః
శుక్లమాఘసిత పంచమీ గురౌ రామలింగ ముమయోత్సవాకృతిమ్. [1]

రామలింగని యింటిపేరు గార్లపాటివారని యిదివఱకు వ్రాసినవా రెవ్వరు గాని యీ శ్లోకము నునికినెఱిఁగినట్లు తెలియరాలేదు. రామలింగని యింటిపేరు తొల్త గార్లపాటి వారనుట నీ శాసన శ్లోకము స్థిరపఱుచుచున్నది. ఉద్భటారాధ్య చరిత్రలో రామలింగఁడు తన యింటిపేరేదో పేర్కొననే లేదు. రామకృష్ణుఁడై పాండురంగమాహాత్మ్యమునను బేర్కొనలేదు. 'శ్రీతెనాల్యగ్రహార నిర్ణేత' నని మాత్ర మందుఁ జెప్పుకొన్నాఁడు. అప్పటికిఁదెనాలి వారని యింటి పేరు స్థిరపడకుండవచ్చును. అన్నయ సుదక్షిణాపరిణయమునఁ 'దెనాలి' యింటిపేరు చెప్పుకొన్నాఁడు.

మను మఁ డగు రామభద్రకవి చెప్పుటచేతను, దల్లిపేరు మొదలగునవి సరిపోవుటచేతను రామకృష్ణుఁడును నన్నయయు నన్నదమ్ము లని స్పష్టపడినది. ఉద్భటచరిత్రమందుఁ గానవచ్చు రామ(లింగే) శ్వరస్వామి యనుగ్రహము, పాలగుమివారి శిష్యత్వము, శైవాచారము మొదలగునవి సరిపోవుటచేతను, లోకమందుఁ బారంపర్యముగా వచ్చుచున్న ప్రతీతికిఁ గూడ నిర్వాహ మేర్పడుట చేతను, నుద్భటారాధ్యచరిత్రకర్త యగు రామలింగయయే వైష్ణవమతము పుచ్చుకొని రామకృష్ణుఁడై పాండురంగమాహాత్మ్యము రచియించినాఁ డని, వారు వేఱు పురుషులు గారని, నిర్ణయించుట ప్రమాణదూరము కాదు.

1. ఈ శ్లోకమును గూర్చి గుంటూరిలో శ్రీ మల్లాది సోమయాజులుగారు నాకుఁ జెప్పిరి. పిదపఁ గొంతకాలమునకు దాని నేను జూచితిని. ఇప్పుడొక మిత్రుఁడు చూచి వ్రాసి పంపెను. శుక్ల సం॥ మాఘ శుద్ధ పంచమీ గురువారము స్వామి కణ్ణుపిళ్లగారి పుస్తకమునుబట్టి చూడఁగా సరిపడకున్నది.

# పోలికలు

రామలింగకవియే రామకృష్ణుఁ డయ్యె ననుట కింకను మఱియొక బలవత్ప్రమాణము చూపెదను. పాండురంగమాహాత్మ్యమున 'శైవవైష్ణవపురాణావళీ నానార్థరచనాపటిష్ఠైకరమ్యమతివి' యని చెప్పఁబడుటచే నాతఁ డేవో శైవపురాణ కథల రచియించి యుండవలె ననియు నీ యుద్భటారాధ్యచరిత్రము వానిలోనిది యగు ననియు ననుకొంటిమి. తొలుతఁ దాను శైవుఁడై యున్నపుడు రచియించిన యుద్భటారాధ్య చరిత్రములోని పద్యములే మార్చీ మార్చకుండఁ దర్వాత వైష్ణవుఁడై రచించిన ఘటికాచలమాహాత్మ్యమున నాతఁడు చేర్చుకొన్నాఁడు. ఇవిగో చూడుఁడు.

సీ. అచలసుతాభర్త కర్పించి మఱి కాని
మృగములు లేఁ బూరి మేయ వచట
నసమలోచనునకు నర్పించి మఱి కాని
యళులు క్రొవ్విరితేనె లాన వచట
నంధకధ్వంసికి నర్పించి మఱి కాని
కోయిల లిగురాకుఁ గొఱుక వచట
నంగజారాతికి నర్పించి మఱి కాని
చిలుకలు పండ్లు భుజింప వచటఁ

గీ. దక్కుఁ గలజంతువులు శంభుఁ దలఁచి కాని
యుచితవర్తనములఁ గోరి యుండ వచట
వదనములు వేయుఁ గలయంతవానికైన
నాయరణ్యంబుఁ గొనియాడ నలవి యగునె?

మ. హరిణంబున్ బులి వెంచు సింగ మొగి సయ్యాటంబు లాడున్ గరిన్
బురినీడన్ ఫణిడింభజాలముల నిల్పుం గేకి, చిట్టెల్కలన్
గరుణన్ బిల్లులజాలముల్ బెనుచుఁ గాకంబుల్ నిశావేళ భీ
కరఘూకంబులపొంతఁ గన్ను మొగుచున్ గాంక్షించి తద్భూములన్.

గీ. తబిసి మొత్తంబు ఱేపాడి తానమాడి
డిగ్గియలచేరువలను బూదియ యలందు
కాలమునఁ బల్కును 'త్రియంబకం యజామ
హే ' యటంచును జలపక్షు లెల్లయెడల.



ఉ. సామగుణంబుఁ గ్రోల్చుఁ బికశాబకపంక్తులు శైవధర్మముల్
ప్రేమ నుపన్యసించు శుకబృందము లీశ్వరయోగశాస్త్రముల్
కోమలరీతి శారికలు గూడి పఠించు వినోదలీలలన్
గామవిరోధిఁబాడు నధికంబుగ నచ్చట భృంగపోతముల్.

సీ. అభ్రగంగాప్రవాహమ్ము లెన్నియొ కాని
తల ధరియింతు రందఱును నదులు
పదినూఱుపడగలపాము లెన్నియొ కాని
యందఱు నురగేంద్రహారయుతులు
డాలొందుచంద్రఖండంబు లెన్నియొ కాని
యందఱు ధరియింతు రమృతకరుని
విషరాశిఁ బుట్టినవిషము లెన్నియొ కాని
యందఱు హాలాహలాంకగళులు

గీ. గంధగజదైత్యు లెందఱో కాని యంద
ఱతుల గజచర్మ పటధారులైనవారు
కర్మ బంధంబు....................
క్రాలుకొనకుండ నిద్రింపఁజాలుఘనులు – ఉద్భటచరిత్ర

సీ. మొకరితేఁటులు మూతి ముట్టవు తేనియల్
శ్రీమధుశాసి కర్పించి కాని
కోకిలమ్ములు చివురాకులు గొఱుకవు
శ్రీవనమాలి కర్పించి కాని
లేఁబచ్చికల్ గబళింపవు హరిణముల్
శ్రీనీలమూర్తి కర్పించి కాని
ఫలభుజిక్రియలకుఁ జిలకలు దలఁపవు
శ్రీమాధవునకు నర్పించి కాని

గీ. యితర జంతువులును హరి మతిఁ దలంచి
కాని యేవర్తనమునకుఁ బూన వనిన
నాతపోవనమాహాత్మ్య మభినుతింప
నలవియే వే మొగంబుల చిలువకైన

మ. పులు లేదుల్ మృగశాబకంబుల హరుల్ పోషించు నత్యాదృతిన్
గలభానీకముఁ గాకముల్ మెలఁగు మూలశ్రేణితోఁ బిల్లు లె
ల్కలఁ గాచున్ శిబికోటి లేఁజిలువలన్ లాలించు నుత్పుల్లబ
ర్హలసచ్ఛాయల నుంచి యచ్చటి యరణ్యానీ ప్రదేశంబులన్.

క. ఒక చిత్ర మచటి జటిపా
ళికి మున్ సంజలను గ్రుంకి లేచి సమాధిన్
సకలశకుంతంబులు తా
రకమంత్రోచ్చారణాభిరతి మతిఁ బొదలున్.

మ. శుకముల్ ప్రామినుకుల్ గుణించు గణియించున్ ధర్మమర్మేతిహా
సకథల్ శారిక లీరికల్గొను మనీషన్ శేషభాషావిశే
షకళాశాస్త్ర ముపన్యసించు బకముల్ సాత్రాజితీప్రాణనా
యకనామాళి నళుల్ పఠించు సతతోద్యద్గీతికాచాతురిన్.

సీ. నునుగాలిదూదిపానుపు లెన్నియో కాని
యందఱు శయనీకృతాహివరులు
సురలోకవాహినినిర్ఝరము లెన్నియొ కాని
యందఱు దివ్యతీర్థాంబుపదులు
నీట జనించుమానికము లెన్నియొ కాని
యందఱు కౌస్తుభహారయుతులు
చలివేఁడివెలుఁగులసాము లెందఱొ కాని
యందఱు నిందుకంజాప్తదృశులు

గీ. ఖగకులాధీశు లెందఱు కలరొ కాని
యందఱును బుల్గురాటెక్కియములవారు
నారు వోసినరీతి నున్నారు ధీరు
లన్నగరియందుఁ గాపురం బున్నవారు (ఘటికాచలమాహాత్మ్యము [1])

1. ఘటికాచలమాహాత్మ్యము తెనాలి రామకృష్ణకవి రచిత మయినను నది యాతని మనుమని కాలమున (ఆ మనుమని పేరులేదు) ఖండోజిరాయఁడను మహారాష్ట్రునకుఁ గృతి యీయఁబడినది. కాన, యందుఁ గృత్యవతరణిక రామకృష్ణుని రచనముగాదు. రామకృష్ణుని విషయ మందేమియు లేదు. అది కలావతీ ముద్రాక్షరశాలలో 1902 సం॥ ముద్రితమయ్యెను.



ఉద్భటారాధ్యచరిత్రపద్యముల ఛాయ గల పద్యములు పాండురంగ మాహాత్మ్యమునఁ గూడ లేకపోలేదు కాని, ప్రౌఢతరమయిన రచన మగుటచేఁ బాండురంగమాహాత్మ్యమున నీ విధముగాఁ బాడినపాటయే యనఁదగు పద్యములు గానరావు. ఈ సాధనము లన్నియు రామలింగఁడే రామకృష్ణుఁ డయ్యె నను సిద్ధాంతమును నిర్వివాదముగా నెలకొల్పఁగల వని నానమ్మకము.

## ఇంకొక సాధకము

ఇన్ని సరిపడినను నుద్భటారాధ్యచరిత్ర రచనాకాలమును, బాండురంగ మాహాత్మ్యరచనాకాలమును నొక్కపురుషుని జీవితపరిమాణము నందుఁ బొందనివిగా నుండినచో నిక నీ వాదమెల్ల వమ్మయి పోవలసినదే యగును. ఆ చిక్కు లేకుండ నదియుఁ గుదురుచున్నది. ఒక్కనికే రెండు పేళ్లను సిద్ధాంతము నిర్వివాదముగా నిల్చుచున్నది.

## ఉద్భటచరిత్ర రచనాకాలము

కొండవీడు దుర్గాధ్యక్షుఁడుగా నున్న నాదిండ్ల గోపమంత్రికడ ముఖ్యోద్యోగి యయిన యూరెదేచమంత్రి యుద్భటారాధ్యచరిత్రము కృతి గొన్నాఁడు. అదియెల్లఁ గృత్యవతరణికలోఁ జూడఁదగును. శ్రీకృష్ణదేవరాయఁ డు క్రీ. 1515 సం॥ కొండవీడు జయించెను. అదిమొదలుగాఁ గృష్ణరాయల యేల్బడి కది లోపడినది. రాయలమంత్రి యగుసాళ్వతిమ్మరసు కొండవీటి పాలనమును దనమేనల్లుఁడగు నాదిండ్ల గోపమంత్రి కప్పగించెను. నాదిండ్ల గోపమంత్రి సుప్రఖ్యాతుఁడు. గోపమంత్రి క్రీ. 1517న దేచమంత్రి కొక యగ్రహారము నొసఁగెను.

దేచమంత్రి శైవాచారపరాయణుఁడు ప్రోలనారాధ్యుని వంశమువాఁ డగు చంద్రశేఖరవాచంయముని శిష్యుఁడు. మఱియు మహావిద్వాంసుఁ డగు లొల్లలక్ష్మీధరపండితునకును శిష్యుఁడు. ఆ లక్ష్మీధరుఁడు కటాక్షింపఁగా శివపంచస్తవికీతడు వ్యాఖ్యానము రచించెను.

అందు:-

శ్లో. " నాదిండ్ల గోపనృపతే రూరేదేచ ప్రధానతా
క్వచిదర్థః క్వచి న్మైత్రీ క్వచి ద్ధర్మః క్వచిద్యశః

* * *

....... యస్మా దస్తే మదా దఖిలమనుపతిం దేచయామాత్యవర్య
స్సోఽ యం శ్రీచంద్రమౌళి ర్జయతి గురువరః ప్రోలనారాధ్యవంశ్యః

స చాయం దేచయామాత్యో మహిమస్తవపంచకామ్
లక్ష్మీధరకటాక్షేణ కురుతే గురుతేజసా."

( ఈ గురునింగూర్చి యుద్భటారాధ్యచరిత్రము నవతరణికను గ్రంథావసానమును గూడఁ జూచునది. )

దేచమంత్రి గోపమంత్రిచే నగ్రహారాది సమ్మానముఁ బడసి ప్రఖ్యాతుఁ డయినపిదపనే యుద్భటచరిత్రము కృతి నంది యుండును. ఆకాల మించుమించుగా క్రీ. 1525 అని తలఁపవచ్చును. దీనిచేఁదెనాలి రామలింగకవి కృష్ణదేవరాయల సభలో నున్నాఁడన్న లోకప్రతీతి సదాధారమయి సంరక్షితమగుచున్నది.

## [1]పాండురంగమాహాత్మ్య రచనాకాలము

పాండురంగమాహాత్మ్యము విరూరి వేదాద్రిమంత్రి కంకితమయినది. ఆ వేదాద్రిమంత్రి కందాళ యప్పలాచార్యుల శిష్యుఁడు. మంగయగురువరాజు కుమారుఁడగు పెదసంగ భూపాలునొద్ద వ్రాయసకాఁడు. చిత్రభారతకృతిపతి తండ్రి పెద్దతండ్రులును, వైజయంతీవిలాసకర్త యగు సారంగుతమ్మకవియు నీ కందాళ యప్పలాచార్యులకు శిష్యులు. క్రీ. 1542 పరాభవ వత్సరమున గండికోట ప్రభువు కందాళప్పలాచార్యులకు భూదాన మొసగిన శాసనము గలదఁట. దీనింబట్టి పాండురంగమాహాత్మ్య రచనాకాల మించుమించుగా క్రీ. 1550, 1560 అగునని తలంపవచ్చును. మఱియుఁ బాండురంగ మాహాత్మ్యమున రామకృష్ణునిచే

## భట్టరు చిక్కాచార్యుఁడు

తన గురుఁడుగా స్తుతింపఁబడినాఁడు. ఈ చిక్కాచార్యునికిఁ

1. శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు 'తెనాలి కవులు' అనుపేర 1914 ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలో వ్రాసిన వ్యాసమునఁ బాండురంగమాహాత్మ్యరచనాకాలము జక్కఁగా నిర్ణయించినారు. దాని సారమే యిక్కడఁ జూపఁబడినది.



బలువురాంధ్రకవులు శిష్యులయి యుండిరి. చతుర్వాటికామాహాత్మ్యము, ఆనందకానన మాహాత్మ్యము మొదలగు ప్రబంధములను రచియించిన లింగమకుంట రామకవి (ఈతఁడు తెనాలి రామకృష్ణకవి యల్లుఁడు) యు నాతని తమ్ముఁడగు లింగమకుంట తిమ్మకవియు నీ చిక్కాచార్యులకు శిష్యులు.

క. గురురాయపట్టభద్రుని
నరిహరు శ్రీరంగనాయకాంశభవున్ భ
ట్టరు చిక్కాచార్యుల మ
ద్గురులఁ దలఁచి యడుగులకు నతుల్ గావింతున్
– లింగమకుంట రామకవి.

సీ. శ్రీవైష్ణవహితుండ జిక్కయభట్టరు
శిష్యుండ............
– లింగమకుంట తిమ్మకవి.[1]

మఱియు రామకృష్ణకవులచేఁ గామందకము కృతిగొన్నవాఁడు కొండ్రాజు తిమ్మరాజుకొడు కగు వేంకటాద్రియు నీ యాచార్యుని శిష్యుఁడే.

క. శ్రీచంచద్భట్టరు చి
క్కాచార్యవరార్యశిష్య యతులితశౌర్య
ప్రాచుర్యవర్య గుణర
త్నాచల జయలలితధైర్య నయతత్త్వనిధీ.
(కామందకము కృతిపతి సంబోధనమున)

మఱియు నీ కామందక కృతిపతి, పాండురంగమాహాత్మ్య కృతిపతి యగు విరూరి వేదాద్రిమంత్రి నేలినప్రభువైన పెదసంగభూపాలునకుఁ జెల్లెలి కొడుకు. శా. 1505, క్రీ. 1584 స్వభానువత్సరమున వేంకట రామకృష్ణకవులచే నా కొండ్రాజు తిమ్మరాజు కొడుకగు వెంకటాద్రి కామందకకృతి నందుకొన్నాఁడు.

1. సులక్షణసారకర్త (లింగమకుంట తిమ్మకవి) అప్పకవికంటెఁ దర్వాతివాఁడని కం. వీ. గారు వ్రాయుట ప్రామాదికము.

మ. రమణీయంబుగ శాలివాహశకవర్షంబుల్ గతంబై సహ
స్రము నేనూఱును నాఱునై వెలయఁగాఁ బ్రౌఢిం దెనిఁగించి రౌ
ర మహిం దిమ్మయ వేంకటాద్రివిభుపేరన్ వేడ్కఁ గామందకీ
యము వేంకటరామకృష్ణులు స్వభాన్వబ్దంబునన్ రూఢిగాన్.

వీనిఁబట్టి చూడఁగాఁ బాండురంగమాహాత్మ్య రచనాకాలము క్రీ. 1565 ఇంచుమించుగా నగు నని యేర్పడుచున్నది. అనఁగాఁ దెనాలి రామలింగకవి యించుమించుగా క్రీ. 1525 ఉద్భటచరిత్రమును, మఱి, ముప్పది యేండ్లకుఁ బాండురంగ మాహాత్మ్యమును రచించి యుండునని చెప్పనొప్పుచున్నది. మన కవి తమ్ముఁడగు నన్నయకవి సుదక్షిణాపరిణయ రచనాకాలము కూడా నిందుకు సరివచ్చుచ్నుది. మఱి పెక్కుమార్గములచేఁ గూడ మన కవివర్యుని కాలమును నిర్ణయింపవచ్చును గాని యామార్గములు కొంత డొంకతిరుగుడుగా నుండుటచేతను నిప్పుడు చెప్పిన కాలమునకే చేరునవిగా నుండుటచేతను విడనాడినాఁడను.

## కవిస్తుతులు

నేఁ జూచినంతవఱకుఁ గవిస్తుతులలో 'రామలింగకవి' యన్న పేరే కానవచ్చినది. నడుమఁ దెచ్చిపెట్టుకొన్న రామకృష్ణనామము ప్రాచీన కాలమునఁ బ్రఖ్యాతము కాలేదు కాఁబోలును! పాండురంగమాహాత్మ్య ప్రౌఢిమ ప్రఖ్యాతమైన తర్వాత రామకృష్ణనామము గూడ రహి కెక్కినది.

ఉ. రంగుగఁ బాండురంగని తెరంగలరంగ రచించి వేడ్క మీ
అంగ చలోక్తులన్ నృపుఁ గరంగ నొనర్చుహొుంగు నింగి ము
ట్టంగ మెలంగునేరుపుఁ గడంగి చెలంగునభంగసద్యశో
లింగుని రామలింగ శశలింగకళానిధినిన్ గణించెదన్.
(నాగ్నజిత్తీపరిణయము– వల్లూరి నరసింహకవి)

క. శృంగారరసాలింగిత
రంగత్కవితానదీతరంగము హృదయ
త్వంగద్భుజంగ మాంగద
లింగమ్మ తెనాలిరామలింగముఁ దలఁతున్.
(పృథుచరిత్రము–సరస్వతీ సోమయాజి)



పై పద్య మాతఁడు లింగధారి యని కూడఁ జెప్పుచున్నది.

"రంగనాథుని రామలింగకవిని"
(కూర్మపురాణము–రాజలింగకవి)

"రాము, లింగకవి రామభద్రుల లీలఁదలఁతు"
(ఆధ్యాత్మరామాయణము–శరభకవి)

"భీమకవి రామలింగని"
(చంద్రరేఖావిలాసము – జగ్గన)

ప్రబంధరత్నావళిలోఁ దెనాలి రామలింగకవి కృతులు కందర్పకేతు విలాసము, హరిలీలావిలాసము ననువాని నుండి కొన్ని పద్యము లుద్ధరింపబడినవి. వానిఁగూర్చి ముందుఁ దెలుపుదును. అందును రామలింగనామమే యున్నది. మరియు నీ చాటుపద్య మున్నది.

ఉ. లింగనిషిద్ధుఁ గల్వలచెలింగని మేచకకంధరుం ద్రిశూ
లింగని సంగతాళి లవలింగని కర్దమదూషిత న్మృణా
లింగనిఁ గృష్ణచేలుని హలింగని నీలకచన్ విధాతృనా
లింగని రామలింగకవిలింగనికీర్తి హసించు దిక్కులన్.

అప్పకవి మొదలగువారు మఱియుఁ బెక్కురు రామలింగఁడనియె పేర్కొనిరి. అయినను ఆతని యల్లుఁడగు లింగమకుంట రామకవియు, మనుమఁడగు రామభద్రకవియు రామకృష్ణనామమును బేర్కొనిరి.

చతుర్వాటికామాహాత్మ్యము, ఆనందకాననమాహాత్మ్యము నను కృతులలో:-

సీ. శ్రీరామసేవాప్రసిద్ధుఁ గాశ్యపగోత్రు
శుభదకాత్యాయనసూత్రపాత్రు
లలితచారిత్రుఁ గాళయమంత్రికిని గోన
మకును దౌహిత్రు సర్వకవిపౌత్రు
తిరుమలాంబాగర్భవరవార్ధి పూర్ణేందు
ధన్యాత్ము లక్ష్మప్రధానపుత్రు
నిజపాలకజనకనిష్ఠాగరిష్ఠ రా
మసచివలబ్ధ రామజపధుర్యు

గీ. రామకృష్ణాఖ్యజామాతఁ బ్రకటవిభవు
శుక్లయజురధ్యయనుఁ బేర సూరిమాచ
యానుజకునిఁ దిమ్మధీనిధి కగ్రజాతు
ననఘు లింగమకుంట రామార్యు నన్ను.[1]

ఇట్లు అల్లుఁడగు రామకవియుఁ, బూర్వోదాహృత పద్యమున మనుమఁ డగు రామభద్రకవియు, రామకృష్ణ నామము పేర్కొనుటకు వారు వైష్ణవమత మందెక్కువగా నభినివేశము గలవారగుట కారణము గావచ్చును. వారి వైష్ణవమతాభినివేశ మాయాగ్రంథములఁ జూడవచ్చును.

## మఱికొన్ని కృతులు

తెనాలి రామలింగని కృతులు మఱిరెండు తెలియవచ్చుచున్నవి. వానిపేళ్లు కందర్పకేతు విలాసము, హరిలీలావిలాసము. ఆ ప్రబంధము లిప్పుడు కానరావు గాని, వానినుండి కొన్ని పద్యములు ప్రబంధరత్నావళిలో నుద్ధృతము లయినవి. వాని నా గ్రంథమునఁ జూడఁదగును. ఇవిగాక పాండురంగ విజయమని మఱియేమో అని యీ కవికృతు లున్నట్లు కొందఱు పేర్కొందురు గాని వానివిషయము నమ్మఁదగినది గాదు.

## కథలు

తెనాలి రామలింగని కథలని దక్షిణహిందూదేశమెల్లఁ బ్రఖ్యాతికెక్కి పెక్కు కథలున్నవి. వానిగూర్చి మన మేమియుఁ జెప్పఁజాలము. అతఁడు హాస్యచతురుడై యుండవచ్చును. నిజముగాఁ గొన్నికథ లాతనికి సంబంధించినవే కావచ్చును. లోకులు మఱియు ననేకాద్భుతకథ లాతని తలకుఁ దగిలించియు నుందురు. పెక్కుగథలు శ్రీకృష్ణదేవరాయల గోష్ఠిలో

1. ఆనందకానన మాహాత్మ్యములో 'నిజపాలకజనక' అనుచోట, 'నిజజనకాగ్రజ' అనియున్నది. దీనిచే నాతఁడు తన పెద్దతండ్రికి దత్తుఁడయ్యెనని తెలియనగును. లింగమకుంట రామకవి తెనాలి రామకృష్ణకవి యల్లుఁని లింగమకుంటవారెల్లరు నేఁటికిని జెప్పుచున్నారు. నేఁడు లింగమకుంటవారి యల్లురగు శ్రీ కొండ వెంకటప్పయ్య పంతులుగారివల్ల తొల్త నిదివిని తర్వాత లింగమకుంటలో విచారించి రామకవికృతుల సంపాదించి యందును జూచి నేనిది తథ్యమని నమ్మితిని.



జరిగినవిగా వినవచ్చును. రామలింగఁడు రాయల సమకాలమువాఁడే. కావున, నవి సంభావ్యములు గావచ్చును. చాటుపద్యమణిమంజరిలో నే నాతని కథలకు సంబంధించిన చాటుధారలఁ గొన్నిటిని జేర్చినాఁడను. క్రొత్తదొక్కటి యిక్కడ చూపుచున్నాఁడను.

క ఓ యమ్మలార! మందులు
వేయేల మకారకొమ్ము విషకవిగానిన్
వాయెత్తకుండఁ జేసిన
వాయెత్తదు రామరాయవసుధేశునకున్.

అళియరామరాయనికి వాయురోగము వచ్చెనఁట! అంతఃపురస్త్రీ లాతనికి మందుల నిప్పింపఁ దంటాలు పడుచుండగా రామలింగఁ డీ పద్యమును జెప్పినాఁడఁట. మకారకొమ్ము విషకవిగాఁ డనఁగా మూర్తికవి. ఆతని వాయి= నోరు, ఎత్తకుండఁ జేసినచో రామరాయులకు వాయి=వాయురోగము, తలచూపదని పద్యార్థము. మూర్తికవి విషకవిత్వ ప్రయోగముచే రాయలకు రోగము వచ్చెనని స్త్రీలను నమ్మించి యాతని యుద్యోగ వైభవము నూడఁగొట్టించుట కెత్తిన యెత్తుగాఁబోలు నిది!

ఇఁకఁ గవి విషయమును విడిచి ప్రస్తుత గ్రంథమును గైకొందును. శైవారాధ్యులలో నొక్కఁ డయిన యుద్భటారాధ్యుల చరిత్ర మిందు వర్ణిత మయినది.

పాల్కురికి సోమనాథకవి రచియించిన బసవపురాణములో సప్తమాశ్వాసమున నీ యుద్భటుని చరిత్రము వర్ణితమైనది. ఆ కథనే మన కవి ప్రపంచించి ప్రబంధముచేసినాఁడు. తెలుఁగున మల్లికార్జున పండితారాధ్యుఁడును, నన్నిచోడఁడును నుద్భటుని స్తుతించిరి.

క. హరలీలా స్తవరచనా
స్థిరనిరుపమభక్తిఁ దనదు దేహముతోడన్
సురుచిరవిమానమున నీ
పురమున కుద్భటుఁడు ప్రీతిఁ బోవఁడె రుద్రా!

– శివతత్త్వసారము.

క. క్రమమున నుద్భటుఁడు గవి
త్వము మెఱయఁ గుమారసంభవము, సాలంకా
రము, గూఢవస్తుమయ కా
వ్యముగా హరు (ర?) లీల, చెప్పి హరుమెప్పించెన్.
-కుమారసంభవము.

పయిపద్యములఁబట్టి యుద్భటుఁడు హరలీల, కుమారసంభవము, అలంకారగ్రంథము (కావ్యాలంకార సంగ్రహము) రచించినాఁడని తెలియ నగుచున్నది. ఇందుఁ గావ్యాలంకార సంగ్రహమొక్కటి తక్కఁదక్కిన విప్పుడు కానరాకున్నవి. అతని కుమారసంభవమునుండి కొంద ఱాలంకారికులు కొన్ని శ్లోకముల నుద్ధరించిరి. [1] ఉద్భటుఁడు కాశ్మీరరాజగు జయాపీడుని సభలో విద్యాపతిగా నుండెనని (క్రీ. 779 నుండి 813 వఱకు) రాజతరంగిణిలో నున్నది.

ఆంధ్రకవు లీతని శివకవులలోఁ బేర్కొనుట మన కథా నాయకు డీతఁడే యనుటకు సాధకముగాని యీ కథలో నా గ్రంథముల స్మరణము లేకపోవుటయుఁ గాలము సరిపడక పోవుటయుఁ గొంతబాధక మగుచున్నది. ఈ ప్రబంధమున నుద్భటుఁడు ముంజభోజునికి శైవదీక్ష నొసఁగిన గురువుగారు జెప్పఁబడినాడు. ముంజభోజుఁడు దశమశతాబ్దివాఁడు. ఉద్భటుని గ్రంథములీ భోజుని కింకను బూర్వకాలముననే పుట్టినవి. ఈ యుద్భటారాధ్య చరిత్రలో ముంజభోజుని పేరున్నను దీని కాకరమయిన బసవపురాణమున భోజుఁడని మాత్రమే యున్నది. పలువురు భోజు లున్నారుగాన యీతఁడా కాలమువాఁ డయినను గావచ్చును. ముంజభోజుఁ డనుట రామలింగకవి స్వకల్పితముగాన యది యప్రమాణమని త్రోసివేయవచ్చును. ముదిగొండవారని యిప్పు డాంధ్రదేశమునఁ బ్రఖ్యాతులుగా నున్న యారాధ్యబ్రాహ్మణుల కీ యుద్భటారాధ్యుఁడు మూలపురుషుఁడని యీ ప్రబంధమందుఁ గలదు. ఆయుద్భటుని దగ్గఱనుండి ముదిగొండవారి వంశక్రమము గూడఁ గొంత గ్రంథాంతమున గానవచ్చుచ్నుది. ఈ వంశ

1. నన్నెచోడుని కుమారసంభవము పీఠిక చూడుము.



క్రమము పాల్కురికి సోమనాథుని గ్రంథమునఁ గానరాదు. [1] కర్ణాటభాషలో గూడ నుద్భటచరిత్రములు గలవు. సోమరాజకవి బసవాంకకవి యనువా రిర్వురు వానిని రచించిరి. పాల్కురికి సోమనాథుడు కుమారపాల ఘూర్జరునిదిగాఁ జెప్పినకథనే కర్ణాటక కవులుద్భటుని కథగాఁ జెప్పిరి. ఆ కర్ణాటక కవులకంటె మన సోమనాథుఁడు పూర్వుఁడు. కుమారపాలున కుద్భటదేవుఁ డని నామాంతరముగా నా యుద్భటదేవచరిత్రపీఠికలో శ్రీశ్యామాచార్యులగారు వ్రాసిరి. అదియెట్లో? మల్లికార్జున పండితారాధ్యుఁడు, సోమనాథుఁడు వారి నిర్వురను వేర్వేఱుగాఁ బేర్కొనిరి. కుమారపాలుని చరిత్రమున నాతని కా నామాంతర మున్నట్టు చెప్పరయిరి. పాల్కురికి సోమనకథ చొప్పున రచియింపఁబడిన యీ యుద్భటారాధ్య చరిత్రమునకును, నా కర్ణాట ప్రబంధములకును నేమియు సంబంధమును గానరాదు.

( ఉద్భటారాధ్య చరిత్రము. ప్ర. ము. 1925 సరస్వతీ గ్రంథమాల. చూ. మఱియు మీఁగడతఱకలు పు. 1251-50: ప్రకాశకులు)

1 చంద్రశేఖరగురునివఱకు నా వంశక్రమమున్నది. ఈ చంద్రశేఖరుఁడే దేచయమంత్రి గురుఁడగునని నేననుకొనుచున్నాను.

# మ ను చ రి త్ర ము

ఉ. తల్లి సమస్తభాషలకు దైవతభాషయ, దేశభాషలన్
పిల్లలలోన నాంధ్రి యనుపేరిటి దెంతయు ముద్దులాఁడిరా
ట్తల్లజు లాదరించిన కతంబునఁ బల్కులఁ గుల్కు మీఱి య
ల్లల్లనఁ దక్కు, నక్క సెలియంద్రకు నెక్కుడు కీర్తి చేకొనెన్.

కం. జిలిబిలి పలుకుల బలు ము
ద్దులు గులికెడు తెలుగుబాసతో సరియగునే
తెలిసియుఁ దెలియక వీనుల
నలయించెడు వెట్టిమొట్టి యఱమొఱ బాసల్.

సంస్కృతమని పేర్కొనఁబడిన యార్యభాషయే తొలుదొలుత భరతఖండమునఁ బెంపొందిన వాఙ్మయము. చాలవఱకు దానివలననే తర్వాతఁ బ్రాకృతములును దేశభాషలును బెంపొందినవి. దక్షిణ హిందూదేశమునఁగల దేశభాషలలో నాంధ్ర, ద్రవిడ, కర్ణాట భాషలు ప్రధానమయినవి. ఇందు ద్రవిడ, కర్ణాటభాష లాంధ్రముకంటెఁ బ్రాచీనములని యూహింపఁబడుచున్నవి. ఆ రెండు భాషలలోను గ్రంథములు రచింపఁబడుచు వచ్చిన కొంతకాలమునకుఁగాని యాంధ్రభాషలో గ్రంథరచన ముపక్రమింపఁబడినట్టు చూపట్టదు. గ్రంథరచనముపక్రమింపఁబడుటకుఁ బూర్వమాంధ్రభాష స్థితి యెట్టిదో మన కించుకయుఁ దెలియరాదు. ఇటీవల నాంధ్రకవితకుఁ బుట్టిల్లనఁ జెల్లిన వేంగీదేశమునం దానాఁడు జన్మించిన నాగవర్మ కర్ణాటభాషకు ఛందోంబుధి యను ఛందశ్శాస్త్ర గ్రంథమును రచించె; కాని యాంధ్రభాష యుబుసైన నెత్తఁడయ్యె. నాఁటి కీ భాషకుఁ దిన్ననిరూ పేర్పడలేదు కావలయు. ఆ కాలమున మనదేశమును జాళుక్యులు పాలించుచుండిరి. ఆర్యధర్మము నిర్వక్రముగా సాగింపఁబడుచుండెను. జనులకుఁ బురాణాదిజిజ్ఞాసయం దాదరము మెండుకొని యుండెను. వారు సంస్కృతభాషా గ్రథితములైన తత్తద్గ్రంథములను 'గాసటబీసటే' చదివి గాథలు ద్రవ్వుచుండిరి. రాను రాను దేశభాషకును గొంత రూపేర్పడుచుండఁబోలు. అక్కతన నత్తఱి దేశభాషాకవన మావశ్యకమయ్యెను. అయినను దానికిఁ



దగిన సామగ్రిని గూర్చి కవితను వెలయించువా రవతరింపవలసియుండిరి. ఇటుల సనఁజన,

క. మును మార్గకవిత లోకం
బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గు నిలిపి రంధ్రవిషయమునఁ
జన సత్యాశ్రయునిఁదొట్టి చాళుక్యనృపుల్.

నన్నెచోడని కుమారసంభవము.

దాదాపు నేఁటికి వేయి సం॥లకుఁ బూర్వము చాళుక్యాన్వయ భూషణమును సత్యాశ్రయాది బిరుదాంచితుఁడును రాజమహేంద్రము రాజధానిగా వేంగీ దేశమును బాలించినవాఁడును నగు రాజరాజనరేంద్రుని యా స్థానమునఁ గల సర్వజ్ఞుఁడగునన్నయభట్టారకుఁ డను పండితకవియే మన యాంధ్రభాషలోఁ దొలుతఁ గవిత నవతరింపఁజేసినవాఁ డని తలఁపఁ బడుచున్నాఁడు. రాజరాజనరేంద్రుని ప్రేరణమున నీతఁడు పంచమవేద మగు భారతమును దెల్గున రచింప దొరఁకొని యరణ్యపర్వములోని కొంతభాగము వఱకును నెఱవేర్చెను. ఈతని కవనమున సంస్కృత మర్యాదలు మెండుకొని యుండును. నుడికారము గల తెలుఁగుఁ బలుకుబడులఁ గూర్చుటయం దీతఁడు తక్కువవాఁడు కాఁడు.

చ. బహువనపాదపాబ్ధికులపర్వతపూర్ణసరస్సరస్వతీ
సహితమహామహీభర మజస్ర సహస్రఫణాళిఁ దాల్చి దు
స్సహతరమూర్తికిన్ జలధిశాయికిఁ బాయక శయ్య యైన య
య్యహిపతిదుష్కృతాంతకుఁ డనంతుఁడు మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్.

గీ. ఎల్లవారు నెఱుఁగ నొల్లనిధర్మువు
బేల! నీకుఁ జెప్ప నేల వలసెఁ
జిఱుతవాని కింత తఱుసంటి పలుకులు
సన్నె వృద్ధజనము లున్నచోట.

పదపడి కవిబ్రహ్మ నాఁబడు తిక్కన విరాటపర్వము మొదలు 15 పర్వములభారతమును దెలుఁగు కావించెను. తెలుఁగుఁ బలుకుబళ్లను

గుబాళింపఁ జేయుటయం దీతని కీడు మఱి లేదు. ఈతని కవనమున రసపోషకములుకాని పదములు సాధారణముగాఁ జూపట్టవు.

ఉ. చిచ్చఱకన్ను మూసికొని చేతిత్రిశూలము డాఁచి లీలమై
వచ్చినరుద్రుచందమున వ్రాలుదు వీ వనిలోన నోర్వఁగా
వచ్చునె నిన్ను నెట్టిమగవారికి నీకృప నాశ్రయింపఁగా
వచ్చితి మెవ్విధిం గెలువ వచ్చు మహాత్మ! యెఱుంగఁ జెప్పవే.

తర్వాత నీ యిర్వురకుఁ దుల్యుఁ డనఁదగు వాఁ డెఱ్ఱాప్రెగ్గడ. ఈతని కృతులం దరణ్యపర్వశేష పూరణ మొకటి.

చ. స్ఫురదరుణాంశురాగరుచిఁ బొంపిరివోయి నిర స్తనీరదా
వరణములై దళత్కమలవైభవజృంభణ ముల్లసిల్ల ను
ద్ధురతరహంససారసమధు వ్రతనిస్వనము ల్సెలంగఁగాఁ
గరము వెలింగె వాసరముఖంబులు శారద వేళఁ జూడఁగన్.

ఈ ముువ్వురను గవిత్రయ మందురు. వీరివాక్కు లాంధ్రభాషకుఁ బరమప్రమాణములు. ఇట్లాంధ్రభారతము ముగియునప్పటికి దాదాపు 300 సం॥ పట్టెను. ఈ నడుమను గొందఱు మేటి కవులితరపురాణాదులను దెలిఁగించుచు వచ్చిరి. ఇట్లు రానురాను గ్రొత్తత్రోవలు త్రొక్కి కవనమున మార్పులు గలిగించినవాఁడు కవిసార్వభౌముఁడు నాఁబడు శ్రీనాథుఁడు. ఈతఁడు తొంటివారివలెఁ జాలమట్టునకు సంస్కృత గ్రంథములనే తెలిఁగించినవాఁ డయ్యును గూర్పునందు మార్పు కలిగించి తర్వాతి ప్రబంధరచనకు మార్గదర్శకుఁ డయ్యెను. [1] సీసపద్యముల యొయ్యారపు నడకలు మొదలగునవి యాతఁడు నెలకొల్పినవే. శ్రీనాథుని తర్వాత నాతని చరణముల నందుకొనక కవితసెప్ప నేర్చినవారు లేరు. శ్రీనాథుని కాలమునకు ముందే యవనులయలజడి

1 శ్లోకపద్యములు సమానార్థకము లయ్యు నవి యాంధ్రభాషలో సంస్కృతభాషా గ్రథితమునకును నాంధ్రభాషాగ్రథితమునకును వ్యవహరింపఁబడుచుండునట్లే ప్రబంధపదము భారతాది సర్వగ్రంథవాచకమయ్యు నిటీవల మిశ్రోత్పాద్యాన్యతర మగు నితివృత్తముతోఁ జతుర్దశ వర్ణనలఁ గూర్చి రచింపఁబడు కావ్యమునకుఁ బేరుగా వాడఁబడుచున్నది.



కలుగుచు వచ్చుటచే వారియాచార వ్యవహారములును గొన్ని మన దేశమున నెలకొనఁ జొచ్చినవి. కావున, నా కాలము నుండియుఁ గవులు తమ కవనమునఁ గొన్ని యన్యదేశ్యపదములు రుచివిశేషముంబట్టి యందందుఁ బొందుపఱచుచు వచ్చిరి. మచ్చున కొకటి యుదాహరింపఁబడుచున్నది.

ఖుసి మీఱన్ సురధాణి నిండుకొలువై కూర్చున్నచోన్.

శ్రీనాథుని హరవిలాసము.

కొందఱు

సీ. పచ్చన హురుమంజి పనివాగె పక్కెర
పారసి పల్లంబు పట్టమయము
రాణ నొప్పారు పైఠాణంబు సింగిణి
తళుకులకోరుల తరకసంబు
మిహి పసిండి పరుంజు మొహదా కెలంకుల
తావు గుజ్జరిసేఁత కేవడంబు
డాకెలంకున సిరాజీక రా చురకత్తి
కుఱఁగటఁ గ్రొవ్వాడి గొరకలపొది

పీలికుంచె తలాటంబు బేరజంబు
మఱల మొగముట్టు వన్ని సాహిణి యొకండు
కర్త యెదుటికిఁ గొనివచ్చె గంధవాహ
బాంధవం బగునొక మహాసైంధవంబుఁ

ఆ. 4, ప. 28.

ఈ మొదలగు పద్యములలోఁ బెద్దనయే తొలుదొలుతఁ జొప్పింప మొదలిడెననిరి.

పదపడి శ్రీనాథుఁడు చూపినత్రోవఁగొని సంస్కృతగ్రంథములఁ దెల్గించుటయ కాక పురాణకథలఁ గైకొని స్వకపోల కల్పనలఁగూర్చి చతుర్దశ వర్ణనలతో మిశ్రప్రబంధములను దర్వాతికవులు రచింప నారంభించిరి. ఆ కాలమున నుత్పాద్యమగు నితివృత్తముతో గృతి సెప్పుట తప్పుగాఁదలఁపఁ బడుటచేఁ గావలయు నాంధ్రమున నేకవియు దానికి దొరకొనినవాఁడు

కాఁడు. అట్లు శ్రీనాథునకుఁ దర్వాత మిశ్రప్రబంధములు రచించిన వారిలోఁ దొల్తటివాఁడనఁదగు పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి యీ విషయము నిట్లు వాక్రుచ్చెను.

శా. ప్రఖ్యాతం బన మిశ్రబంధ
మన నుత్పాద్యం బనంగాఁ ద్రిధా
వ్యాఖ్యాతం బగు వస్తు,
వందు మఱి యధ్యాహారముం జేయఁగాఁ
బ్రఖ్యాతం బితివృత్త మైనఁ
గృతిసెప్పన్ వక్తకున్ శ్రోతకున్
విఖ్యాతిం గలిగించుఁ బుణ్య
మహిమన్ విశ్వంభరామండలిన్.

ఈతఁడు భారతమందలి శకుంతలోపాఖ్యాన కథను గైకొని దానికిఁ గాళిదాసుని యభిజ్ఞానశాకుంతల నాటకమును దోడుచేసికొని శృంగార శాకుంతలమను ప్రబంధమును రచించెను. శృంగార శాకుంతలము రచింపఁ బడిన తర్వాత సర్కోత్కృష్టముగా వెల్వడిన మహాప్రబంధము మన యీ

## మనుచరిత్రము

దీనికిఁ బ్రధానముగా గ్రంథకర్త పేర్కొన్నపేరు స్వారోచిషమనుసంభవము. అయ్యును మనుచరిత్ర మనునామము కవిచే 'మనుచరిత్రం బందుకొనువేళ'నని యొకచోఁ బేర్కొనఁబడియున్నది. మఱియు లోకమున రూఢమైయున్నది. ఇది చతుర్దశవర్ణనలు గలిగిన యాఱాశ్వాసముల ప్రబంధ రత్నము. దీనికి

## కృతిభర్త కృష్ణదేవరాయలు

ఈతఁడు బళ్ళారి మండలములోని యానెగొందికి సమీపమున నుండిన విద్యానగర మను పట్టణరాజము రాజధానిగా దక్షిణహిందూదేశమున కెల్ల నేకచ్ఛత్రాధిపత్యము నిర్వహించిన శూరాగ్రేసరుఁడగు నృప సార్వభౌముఁడు. ఈ నృపాలరత్నము జనించిన కాలము సరిగాఁ దెలిసినదికాదు, గాని 1509



సం॥ పట్టాభిషిక్తుఁ డయినట్లు కనుఁగొనంబడినది. కృష్ణరాయలు బహువారములు దండయాత్రలు వెడలి నానారాజుల జయించి రాష్ట్రముల నాక్రమించుకొని తురుష్కుల ముష్కర కృత్యముల నడఁగించి మహారాజ్య వైభవము ననుభవించుటయకాక సరసకవితావిలాసలాలసుఁడై పెద్దనాది సుకవీంద్రుల పల్కుఁదేనియలఁ జూఱలఁ గొని సంస్కృతాంధ్రము లందు మేలయినకవనము చెప్పనేర్చిన సుకవిరాజశిఖామణి. ఈతఁడు తెలుఁగున విష్ణుచిత్తీయ మను ప్రౌఢప్రబంధమును రచించెను. సంస్కృతమున మదాలసచరిత్ర, సత్యావ్రీణనము, సకలకథాసారసంగ్రహము, జ్ఞానచింతామణి మొదలగు గ్రంథములను రచించిన ట్లాముక్తమాల్యదలోఁ జెప్పికొనెను గాని యవి నామావశిష్టము లయినవి.

[1]కృష్ణరాయ లీ మనుచరిత్రమునకే కాక ముక్కుతిమ్మన రచించిన పారిజాతాపహరణమునకును, గర్ణాటభాషలోఁ దిమ్మనార్యుఁ డనుకవి రచించిన భారతమునకుఁ గూడఁ గృతిపతియయ్యెను. ఈతఁడు దండ యాత్రలకు వెడలునపుడు వెంటఁ గవీంద్రుల సయితము కొంపోయెడువాఁడు.

[2] ఈతనికిఁ జదరంగపుటాటయందు మిక్కిలి కుతూహల ముండినట్లు

1 అస్మన్మిత్రు లొకరు జాంబవతీపరిణయ మనుపేరి నాటక మొకటి కృష్ణరాయ విరచితము నూత్నముగాఁ దమకుఁ జిక్కిన దని చెప్పుచున్నారు.ఇది ఆచార్య బి. రామరాజుగారిచే పరిష్కరింపబడి ముద్రింపబడినది.

2. ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమందలి చారిత్రక సంపుటములలో "నృసింహదేవ రాయుల కుమారుండు శ్రీకృష్ణదేవమహారాయులు విజయనగరమందు వజ్రసింహాసనారూఢుఁడై పృథివీ రాజ్యం చేయుచుండగాను పై వ్రాసిన (కొప్పోలు) గ్రామ కరణాలు బొడ్డుచర్ల పెద్దతిమ్మన్న చినతిమ్మన్న అనే యిద్దఱు అన్నతమ్ములు, వీరిలో పెద్దతిమ్మన్న అనే ఆయన గ్రామంలో కరిణీకం అనుభవిస్తూ వుండెను. చిన్నతిమ్మన్న అనే ఆయన కవీశ్వరదిగ్గంతి అనిపించుకుని కృష్ణరాయలవారివద్దపోయి రాయలతో చదరంగం ఆడుతూ ఉండేవాఁడున్నూ ఆటగెలిస్తే వెయ్యార్లువరకు పందెంచేసి గెలుస్తూ ఉండేవాడున్ను. అప్పుడు శ్రీకృష్ణదేవమహారాయులు చాలాసంతోషించి కొప్పోలు గ్రామం సర్వాగ్రహారంగా ధారవోసి యిచ్చి కొప్పోలుకు ప్రతినామం కృష్ణరాయపురం అని నామం యేర్పరిచిరి. ఈ చిన్నతిమ్మన అనేకరణం కవీశ్వరుఁడు చెప్పిన పద్యం "

క్రింద నుదాహరింపఁబడిన ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమందలి ప్రాచీన విలేఖనమువలనఁ దెలియుచున్నది. ఆంధ్రభాషను మహోచ్చదశ నందించిన యీ ప్రభుసార్వభౌముఁడు 1530 సం॥ కీర్తిశేషుఁ డయ్యెను. ఆంధ్రభోజుఁ డని ప్రసిద్ధి గన్న యీ కృష్ణరాయల యాస్థానమునం దష్టదిగ్గజములునాఁ బడు కవీశ్వరులలో నెల్ల వయసునందును గవితానైపుణియందును బెద్దవాఁడు మన యీ మనుచరిత్రమునకు

## కృతికర్త పెద్దనామాత్యుఁడు.

ఈతఁడు నందవరీక బ్రాహ్మణుఁడు. ఇంటిపే రల్లసానివారు. తండ్రిపేరు చొక్కన. బళ్ళారి ప్రాంతమందలి దోపాడు పరగణాలోని దోరాలగ్రామ మతని వాసస్థలము. కృష్ణరాయలు మనుచరిత్రమును గృతి నందుకొనునప్పు డూరేగించుటకై పెద్దనార్యునిఁ బల్లకీ నెక్కించి తన చేతితో నద్దాని లేవనెత్తి యాతనియెడఁ గల యాదరాతిశయమును వెల్లడించెనఁట. కృష్ణరాయల యాస్థానమునఁ గల యాకవిపండితమండలిలో నాతనికే గౌరవ మెక్కువ. ఒకప్పుడు కృష్ణరాయలు పసిఁడిపళ్ళెరమునఁ గవిగండపెండేరమును గొనివచ్చి సభాస్థానమున నిడి సంస్కృతాంధ్రములందు సమముగాఁ గవనము చెప్పనేర్చినవారిద్దానిఁ గైకొన నర్హులనఁగా సభ్యులు మిన్నకుండి రనియు దానిపైఁ గృష్ణరాయలు

---

క. శతసంఖ్యు లొక్కటైనను
సతతము శ్రీకృష్ణరాయజగతీపతితోఁ
జతురంగ మాడి గెల్చెను
ధృతిమంతుఁడు బొడ్డుచెర్ల తిమ్మన బళిరే.

ఉ. ధీరుఁడు బొడ్డుచర్ల చినతిమ్మన మంత్రికుమారుఁ డంచితా
కారుఁడు సత్కళావిదుఁడు కౌశిక గోత్రుఁడు పద్మ నేత్ర సే
వారతబుద్ధి నందవరవంశ్యుఁడు సత్కవిలోకనాథుఁ డా
చారసమగ్రవర్తనుఁడు చారువచస్థ్సితి నొప్పువాఁ డొగిన్.



ఉ. ముద్దుగ గండ పెండియరమున్ గొనుఁడంచు బహూకరింపఁగా
నొద్దిక నా కొసంగు మని యొక్కరుఁ గోరఁగ లేరు లేరొకో

అని సగము పద్యముఁ జదివె ననియుఁ బెద్దనామాత్యుఁ డంతట లేచి

పెద్దనఁ బోలుపండితులు పృథ్విని లే రని నీ వెఱుంగవే
పెద్దన కీఁ దలంచినను బేరిమి నా కిడు కృష్ణరాణ్ణృపా!

అని పూరించి

ఉ. పూఁత మెఱుంగులుం బసరుపూప బెడంగులుఁ జూపునట్టి వా
కైతలు జగ్గునిగ్గు నెన గావలెఁ గమ్మనఁ గమ్మనన్వలెన్
రాతిరియుం బవల్ మఱపురాని హొయల్ చెలియారజంపుని
ద్దాతరితీపులంబలెను దారసిలన్వలె లోఁ దలంచినన్
బాతిగఁ గైకొనన్వలెను బైదలికుత్తుకలోని పల్లటీ
కూఁత లనన్వలెన్ సొగసుకోర్కులు రావలె నాలకించినన్
జేతికొలందిఁ గౌఁగిటను జేర్చినఁ గన్నియ చిన్నిపొన్ని మే
ల్మూఁతల చన్నుదోయివలె ముచ్చట గావలెఁ బట్టి చూచినన్
డాతొడ నున్న మిన్నులమిటారపు ముద్దులగుమ్మ కమ్మనౌ
వాతెఱ దొండపండువలె వాచవి గావలెఁ బంట నూఁదినన్
గాతలఁ దమ్మిచూలిదొర కైవసపుం జవరాలి సిబ్బెపు
న్మే తెలియబ్బురంపుజిగి నిబ్బరపుబ్బుగుగబ్బిగుబ్బ పొం
బూఁతల నున్నకాయ సరిబోఁడిమి కిన్నెర మెట్లబంతి సం
గాతపు సన్నతంతిబయకారపుఁ గన్నడగౌళ పంతుకా
సాతత తానతానలపసం దివుటాడెడుగోట మీటు బల్
మ్రోతలునుంబలెన్ హరువు మొల్లము గావలె నచ్చతెన్గు లీ
రీతిగ సంస్కృతంబు పచరించినపట్టున భారతీవధూ
టీ తపనీయగర్భనికటీ భవదాననపర్వ సాహితీ
భౌతిక నాటక ప్రకరభారతభారత సమ్మత ప్రభా
శీతనగాత్మజాగిరిశ శేఖర శీతమయూఖరేఖి కా
పాతసుధా ప్రపూర బహుభంగఘుమంఘుమఘుంఘుమార్భటీ

జాతక తాళయుగ్మలయసంగతి చంచువిపంచికామృదం
గాతత తేహిత త్తహిత హోధిత దంధణు ధాణుధింధిమి
వ్రాతనయానుకూల పదవారకుహూద్వహహారి కింకిణీ
నూతనఘల్ల లాచరణనూపురఝూళ ఝళీమరంద సం
ఘాత వియద్ధునీచకచకద్వికచోత్పలసారసంగ్రహా
యాతకుమార గంధవహహారిసుగంధవిలాసయుక్తమై
చేతము చల్లఁజేయవలె జిల్లునఁ జల్లవలె న్మనోహర
ద్యోతకగోస్తనీఫల మధు ద్రవగోఘృత వాయసప్రసా
రాతిరసప్రసార రుచిర ప్రసరంబుగ సారెసారెకున్.

అను పద్యమాలిక నాశువుగా విరచించి చదివెనఁట! దానిపైఁ గృష్ణరాయలు తానై యా కవిగండపెండేరము నాతని పాదమునఁ దొడిగెను. ఆశుకవిత్వ మనఁగా నాలోచనము సల్పియు నెట్టిరసము కూర్పనగునో యట్లే యాశువుగను జెప్పనేర్చినది గాని చెత్తకూరుపు కానేరదు. మఱొకప్పుడేదో కృష్ణరాయలాశువుగా విరచింపుమని కోరఁగా నాతఁడు –

చ. నిరుపహతిస్థలంబు రమణీప్రియదూతిక తెచ్చియిచ్చు క
ప్పురవిడె మాత్మ కింపయినభోజన ముయ్యెలమంచ మొప్పుత
ప్పరయురసజ్ఞు లూహ తెలియంగల లేఖక పాఠకోత్తముల్
దొరకినఁ గాక యూరక కృతుల్ రచియింపు మనంగ శక్యమే.

అని నిరాకరించె నని చెప్పుదురు.

పెద్దనార్యున 'కాంధ్రకవితాపితామహుఁ' డని బిరుదనామము కలదు. ఈ బిరుదము "పురాణకథను గొని స్వకపోలకల్పనలు గూర్చి తొలుదొలుత మనుచరిత్రమును బ్రబంధరూపమున రచియించుటచేఁ గలిగిన " దని కొందఱందురు గాని యది సరికాదు.

ఇట్టి ప్రబంధములఁ గూర్చినవారిలోఁ పెద్దనార్యుఁడు తొలుదొలుతటి వాఁడనునది నిలువనేరనిమాట. అంతకుముందే యిట్టి రచనము కలదని తెలిపియున్నాఁడను. ఒకవేళ తొలుదొలుతటి దనియే యొప్పుకొన్నను నీ బిరుద మీ గ్రంథరచనమును బట్టి వచ్చినదనుట పొసఁగ నేరదు. మనుచరిత్రమును రచింపు మని కోరునప్పుడే కృష్ణరాయలచే,



క హితుఁడవు చతురవచోనిధి
వతులపురాణాగమేతిహాసకథార్థ
స్మృతియుతుఁడ వాంధ్రకవితా
పితామహుఁడ వెవ్వరీడు పేర్కొన నీకున్

మను. పీఠిక. ప. 15.

అని పెద్దన పేర్కొనఁబడి యున్నాఁడు.

కృష్ణరాయలు తన యాస్థానకవులలో నెల్ల వయసుచేతను, గవితచేతను బెద్దవాఁ డగుటచేఁ బెద్దనామాత్యున కీ బిరుద మొసంగి యుండును. ఈతఁడీ మనుచరిత్రమును గాక హరికథాసార మను వేఱొక ప్రబంధమును రచించి తన గురువగు శఠగోపయతికిఁ గృతి నొసఁగెను. ఆ గ్రంథమునుండి యీ క్రింది పద్యములు రంగరాట్ఛందమున నుదాహరింపఁబడి యున్నవి.

క అంబరము పగుల నార్చి ప్ర
లంబాసురుఁ డాగ్రహము వెలయఁ గదిసిన వే
ళం బలరాముడు చేముస
లంబున వానితల ద్రుంచె లావు మెఱయఁగన్

క ఆ దేవోత్తముఁడు సుధాం
భోధి నవై కాగ్రిమ దళమున బాలుండై
చేదోయిచేత దక్షిణ
పాదము గొని నోటఁ జెప్పెఁ బకపక నగుచున్

క. శఠకోపయతికి ఘనతరు
కుఠారకోపమమతికిని గురుతమహృత్క
ర్మఠనిరతికిఁ జతురాగమ
పఠనాయత నియతికిని జపాసంభృతికిన్

గీ. అఖిలపారికాంక్షి కాశ్రయపర్ణశా
లోపకంఠమునకు లోకకర్త
చేర నేఁగి యచటఁ బారవంబున డిగ్గి
యధివసించి యుండు నర్థితోడ.

క. బాలరసాలకిసాలము
గ్రోలుచుఁ బలికెడిపికంబు కో యనఁ జాలం
జాలింబడి యానయమధు
రాలాపము లనియె నాదరణమున వినఁగన్.

ఇదిగాక కృష్ణరాయలు స్వర్గస్థుఁ డైన పిదప నాతని నిర్యాణమును గూర్చి సీసపద్యశతక మొకటి రచించె ననియుఁ దా మాపద్యశతకము నొకచోఁ జూచి యుంటి మనియు మిత్రులొకరు నుడువుచున్నారు; కాని, యది లభించినది కాదు.

సీ. ఎదురైనచోఁ దన మదకరీంద్రము నిల్పి
కేలూతయొసఁగి యెక్కించుకొనియె
కోకటగ్రామాద్యనేకాగ్రహారంబు
లడిగినసీమలయందు నిచ్చె
మనుచరిత్రం బందుకొనువేళఁ బుర మేఁగఁ
బల్లకిఁ దన కేలఁ బట్టియెత్తె
బిరుదైనకవిగండపెండేరమున కీవె
తగు దని తానె పాదమునఁ దొడిగె

గీ. 'ఆంధ్రకవితాపితామహ అల్లసాని
పెద్దనకవీంద్ర' యని నన్నుఁ బిలుచునట్టి
కృష్ణరాయలతో దివి కేఁగ లేక
బ్రదికియున్నాఁడ జీవచ్ఛవంబ నగుచు

అను పద్య మొకటి మాత్రము వాడుకలోఁ గలదు. మఱియుఁగృష్ణరాయ నిర్యాణానంతరము కన్నడరాజ్యముపైకి గజపతిరాజు దండెత్తిరాఁగా

సీ. రాయరావుతుగండ రాచయేనుఁగు వచ్చి
యారట్లకోట గోరాడునాఁడు
సంపెట నరపాలసార్వభౌముఁడు వచ్చి
సింహాద్రి జయశీలఁ జేర్చునాఁడు
సెలగోలుసింహంబు చేరి ధిక్కృతిఁ గంచు
తల్పులఁ గరుల ఢీకొల్పునాఁడు



ఘనతర నిర్భరగండపెండెర మిచ్చి
కూఁతు రాయల కొనఁగూర్చునాఁడు.

గీ. నొడ లెఱుంగవా చచ్చితో యుర్వి లేవొ
చేరఁజాలక తల చెడి జీర్ణ మైతొ
కన్నడం బెట్లు సొచ్చెదు గజపతీంద్ర
తెఱచినిలు కుక్క సొచ్చిన తెఱఁగుఁ దోఁప

అను సీసపద్యమును బంపెననియు, దానిపై నాతఁడు సిగ్గిలి తిరిగిపోయెననియుఁ దెలియుచున్నది. మును మనుమసిద్ధిరాజు ప్రతాపరుద్రునకుఁ దనరాజ్యము నోడిపోఁగాఁ దిక్కనామాత్యుఁడు తన కవితచేతఁ బ్రతాపరుద్రుని మెప్పించి మరల నారాజ్యమాతని కిప్పించెనఁట!

వెలుగోటి రాజయిన మాదయలింగమనేఁ డల్లయవేముని తల నఱికి తన తమ్మపడిగం బొదిగించి నందికంత పోతరాజనుపేరి కఠారిఁ గైకొనఁగా శ్రీనాథకవిసార్వభౌముఁడాతనిఁ జేర నరిగి కవనముచే నాతనిఁ బొగడి మెప్పించి మరల నాకఠారిఁ గొనితెచ్చెనఁట! బళిరా కవిత్వమహత్త్వము!

ఇంకను గృష్ణరాయనిచే రచింపఁబడినట్లుగల యాముక్తమాల్యదయుఁ బెద్దనచేతనే రచింపఁబడిన దని యొక యైతిహ్యము బహుకాలమునుండి కలదు. రంగరాట్ఛందమునం దాముక్తమాల్యదలోని పద్యము లుదాహరింపఁ బడునెడ ' పెద్దనగారి యాముక్తమాల్యదలో' నని నుడువఁబడియున్నది. మఱియు నాముక్తమాల్యదకుఁ బ్రాచీనవ్యాఖ్యాత యొకఁడు తన వ్యాఖ్యానావసానమునఁ 'బెద్దన రచించిన యాముక్తమాల్యద' యని పద్యరూపమున వాకొనియున్నాఁడు. ఇంకను గొన్ని యెడల బెద్దనకృత మని కలదు. మనుచరిత్ర మెట్టి హృదయంగమములగు భావములతో విలసిల్లుచున్నదో యాముక్తమాల్యదయు నట్లే చెల్వు మీఱుచున్నది. కాని, రెండిటికిని శైలియందుఁ గొండొక భేదము కలదు. ఇట్టిభేద మొక కవియే కాలభేదముచే రచించిన కృతులందుఁ జూపట్టుచుండుట లేకపోలేదు. ఇయ్యెడ బాణుని కాదంబరీ, హర్షచరిత్రములు తార్కాణముగాఁ జూడనగును. 'కవితాప్రావీణ్య ఫణీశ' మొదలగు పదములచే సంబోధింపఁబడిన కృష్ణరాయలు కవనము చేయలేక

యితరుఁడు రచించినదానిని దనపేరఁ బ్రకటించుకొనె ననుటయుఁ బొసఁ గుబాటు కలదిగాఁ దోఁచుటలేదు. ఈ విషయము సత్యమైనను నసత్యమైనను దాము రచించిన గ్రంథములను దమ రాజులు రచించినట్లే వారి పేళ్లతోఁ బ్రకటించు నాచారము వెనుకటి కవులకు లేకపోలేదు. ఇవిగాక పెద్దన కృతములని వాఁడబడునవి కొన్ని చాటుపద్యములు గలవు.

తన దివ్యకవితావిలాసముచేఁ గృష్ణరాయల మెచ్చించి యాతని కత్యంత గౌరవనీయుఁడై యీ మనుచరిత్రము నాతనికే కృతిసేసి యనేకాగ్రహారములను గొని మహాభోగముల ననుభవించి యైహికేచ్ఛలఁ దనియుటయ కాక వైష్ణవాగ్రే సరుఁడై కోకట మను తన యగ్రహారమునకు శఠకోపపుర మని యాత్మగురుఁ డగు శఠకోపయతిపేరు వెట్టి బ్రాహ్మణులకు సర్వాగ్రహారముగా నొసఁగి యింక ననేక దేవాలయములకు భూదానములు సేసి పారత్రికసౌఖ్యమును సయితమార్జించుకొనిన యీ యాంధ్రకవితాపితామహుఁడు కృష్ణరాయ నిర్యాణానంతరము సయితము జీవించియుండి 1540 సం॥ ప్రాంతమున నశ్వరమగు భౌతిక శరీరమును దృజించి శాశ్వతమగు కీర్తిమూర్తిని గైకొనెను. ఎంతవఱ కీ యాంధ్రభాష ప్రచారము గలదై సుస్థితిని వెలయుచుండునో యంతవఱకును బెద్దనార్యుని యశశ్శరీరమునకు భంగపాటు వాటిల్లనేరదు.

## -: గ్రంథవిమర్శనము :-

### రచనాచాతుర్యము

మార్కండేయపురాణమునం దీ స్వారోచిష మనుజన్మవృత్తాంతము సమగ్రముగాఁ గలదు. ఆ పురాణమును మారన యాంధ్రీకరించెను. రెండొండు పట్టుల నౌచితీపోషణమునకై చిఱుమార్పులఁ గావించెఁ గాని పెద్దనామాత్యుఁ డీ ప్రబంధరాజమును దుదముట్ట నామార్కండేయపురాణపు ద్రోవనే పెంపొందించెను. మారన కవిత్వమున 150 పద్యములలో ముగిసిన కథ యాతని కవనమున 800 పద్యములవఱకుఁ బెరిఁగినది. ఈ మనుచరిత్రము 'అల్లసానివాని యల్లికజిగిబిగి' యను పలుకును బ్రతిపదమునను సార్థకపఱుచుచున్నది. పెద్దనామాత్యుఁ డీ ప్రబంధమును దీర్ఘకాలము పరిశ్రమ చేసి తన సర్వతోముఖపాండిత్యమును జతుర్విధకవితావిలాసమును వెలయించి



నిబ్బరమైన శైలి నాహాపుట్టించునట్లు పోహళించెను గాని యందదుకులుగా నెందురును ముడిపెట్టలేదు. ఈ గ్రంథము నందుఁ గూర్పునేర్పును భావవైచిత్ర్యమును బిక్కటిల్లని పద్యముకాని గద్యముగాని చూపట్టదు. ఎక్కడఁ బట్టిన నక్కడఁ గవీశ్వరుని లోకజ్ఞానమును భాషావైదుష్యమును గల్పనా చాతుర్యమును వెల్లివిరియుచున్నవి. పెద్దనార్యుని పద్దెములు ముద్దులొలుకు నిద్దంపుఁబలుకుల నేర్చికూర్చి తీర్చిదిద్ది చికిలిసేసి నునుమెఱుఁగు వెట్టి వెల్వరింపఁబడినవి కావుటచే నెక్కడను నొక్కులు వోయి కాన్పింపవు. మఱియు సంస్కృతాంధ్రముల నందముగాఁ గలయఁగూర్పు కతన నితని కవనమున సంస్కృతప్రౌఢియుఁ దెలుఁగునుడికారమును మిసమిసలు దేఱుచుఁ జెఱలాడుచున్నవి.

### శైలి

శా. తావుల్ క్రేవలఁ జల్లుచెంగలువ కేదారంబుతీరంబునన్
మావుల్ క్రోవులు నల్లిబిల్లి గొనుకాంతారంబునం దైందవ
గ్రావాకల్పితకాయమానజటిలద్రాక్షాగుళుచ్ఛంబులం
బూవుందీవెల నొప్పునొక్క భవనంబున్ గారుడోత్కీర్ణమున్
ఆ 2. ప 22

క. మృగమదసౌరభవిభవ
ద్విగుణితఘనసారసాంద్రవీటీగంధ
స్థగితేతరపరిమళమై
మగువపొలుపు దెలుపునొక్క మారుత మొలసెన్.
ఆ 2. ప 24

ఈ పద్యపు నాల్గవచరణ మట్టిమారుతము నొలయించుచునే యున్నది.

శా. వాలారుం గొనగోళ్ళ నీ వలసతన్ వాయించుచో నాటకున్
మేళం బైన విపంచి నిన్న మొదలున్ నీ వంటమింజేసి యా
యాలాపంబె యవేళఁ బల్కెడుఁ బ్రభాతాయాతవాతాహతా
లోలత్తంత్రుల మేళవింపఁగదవే లోలాక్షి దేశాక్షికిన్.
ఆ. 3. ప 57.

చ. జిలుఁగుల బెట్టుచుం దొడల జెంద్రికపావడ యంట మైతడిం
బెళపెళ లేనిచీరఁ గటి బింకపుఁ జన్నులఁ జేర్చికొంచు వే
జలకము లాడి యాడి యొకచాన కరస్థితకేశ యై నృపు
న్వెలువడి చూచె లోపడితి నీ కని బాసకు నిల్చెనో యనన్
ఆ. 5. ప. 68.

## ఔచితీనిర్వాహము

క. అల్లదె కంటే పొనపొన
దెల్లనిగట్టఱుత మబ్బు దేఱెడుపొలమం
దెల్లెడఁ జూచిన ధరణీ
వల్లభ సీరాముసేన వాలు మెకంబుల్. ఆ. 4. ప.16

క. తిమిరంపు గుబ్బ చన్నుల
కొమరాలవు నీకుఁ దగినగోవాళ్ళ మహిన్
నెమకి నగరాదె ముదిసిన
మముఁ జెనకిన నేమి గలదు మద మేమిటికిన్. ఆ. 4. ప. 68

## కల్పనాచాతుర్యము

చ మరున కొసంగఁ గాలము తమశ్చట గాటుకగా నవోదయ
స్ఫురదరుణప్రభాపథిక శోణితసిక్తసితోదు భక్తమున్
హరిహయదిఙ్నభస్స్థలమునన్ బలి చల్లి వటాంకమున్ వసూ
త్కరభరితంబు నై వెలుఁగఁ గాంచి సుధానిధి నెత్తె నత్తఱిన్.
ఆ. 3, ప. 21.

## భావప్రకాశనము

మ. మునుమున్ పుట్టెడుకొంకు లౌల్యము నిడన్ మోదంబు విస్తీర్ణతం
జొనుపం గోర్కులు గ్రేళ్లు ద్రిప్ప మది మెచ్చుల్ ఱెప్పలల్లార్ప న
త్యనుషంగస్థితి ఱిచ్చపా టొసఁగ నొయ్యారంబునం జంద్రికల్
దనుకం జూచె లతాంగి భూసురుఁ బ్రఫుల్లన్నేత్రపద్మంబులన్
ఆ. 2. ప. 30.



## స్వభావపరిజ్ఞానము

చ. పలుకులు నేర్పువేళఁ గలభాషిణి నీ విటు లుండఁ బంజరం
బుల నరగన్ను వెట్టి ముఖముల్ చరణాగ్రనఖాళిఁ గ్రోఁకుచున్
నిలుగుచు నావులించుచు వనీవిహగోత్కర మెట్లు వల్కు న
ప్పలుకులె యఖ్ఖు లెత్తి విని పల్కెడు వింటివె కీరశారికల్,
ఆ. 3. ప. 58.

సీ. ఏ విహంగముఁ గన్న నెలుఁగించుచును సారె
కును సైకతంబులఁ గూడఁ దారుఁ
దారి కన్గొని యది తనజోడు గాకున్న
మెడయెత్తి కలయంగ మింట నరయు
నరసి కన్నీటితో మరలి తామర యెక్కి
వదన మెండఁగ సరోవారి నద్దు
నద్ది త్రావఁగ సైఁప కట్టిట్టు గన్గొని
ప్రతిబింబ మీక్షించి బ్రమసి యుఱుకు

నఱికి యెఱకలు దడియ వేఱొక్క తమ్మి
కరుగు నరిగి రవంబుతోఁ దిరుగు తేంట్లఁ
బొడుచు ముక్కున మఱియును బోవు వెదక
సంజఁ బ్రియుఁ బాసి వగ నొక్కచక్రవాకి.
ఆ. 3. ప. 16.

ఈ సీసపద్యము పెద్దనార్యునిభాషాంతరీకరణచాతుర్యమును వెల్లివిరి యించుచున్నది. చూడుఁడు.

శ్లో. ఆయాతి యాతి పునరేవ జలం ప్రయాతి
పక్షాంకురాణి విచినోతి ధునోతి పక్షౌ
ఉన్మత్తవద్భ్రమతి కూజతి మందమందం
కాంతావియోగవిధురో నిశి చక్రవాకః.

ఈ శ్లోకమున కాపద్య మనువాద మయ్యు నెంతయేని మనోజ్ఞముగాఁ బెంపొందింపఁబడినది. మఱియుఁ బుంలింగమున కన్న కర్తృపద మత్యంత

స్వారస్యాపాదక మగునట్లు స్త్రీలింగముగా మార్పcబడినది. పెక్కుచోటుల నీతcడేదే నొకలోకోక్తినో, ప్రకృతి చిత్రమునో కైకొని దానికి వన్నెలు చిన్నెలు వచ్చునట్లు మేలయిన కల్పనc గల్పించి పద్యమునcబెట్టి బాగు బాగనిపించును.

చ. మదకలకుంభికుంభనవమౌక్తికముల్ గనుపట్టు దట్టమై
వదలక కృష్ణరాయకరవాలమునం దగుధారనీట న
భ్యుదయము నొంది శాత్రవుల పుట్టిమునుంగcగ ఫేనపంక్తిలోc
బొదిగొని పైపయిన్ వెడలు బుద్బుదపంక్తులువోలెc బోరులన్.
ఆ. 1. ప. 41.

ఈ పద్యమునందలి కల్పన 'వానిపుట్టి మునిcగినది' యనులోకోక్తిని బట్టి పుట్టినది.

ఉ. క్రూరవనేభదంతహతకుడ్యపరిచ్యుతవజ్రపంక్తిc బొ
ల్పారుమిడుంగుఱుంబురువు లంచు వెసం గొనిపోయి పొంత శృం
గారవనద్రుమాళి గిజిగాడులు గూడులc జేర్చుదీపికల్
గా రహిc గృష్ణరాయమహికాంతుని శాత్రవపట్టణంబులన్.
ఆ. 1. ప. 36.

ఈ పద్యము గిజిగాcడులు మిడుcగుఱుcబుర్వులను దమ గూండ్లలో వెల్తురునకై చేర్చి యుంచుకొను నను ప్రకృతి చిత్రమును బట్టి యందముగాc బొందుపఱుపcబడినది. కృష్ణరాయని వంశాదివర్ణనమున నితcడు చిత్రించిన ప్రతికల్పనయు ననుపమానమై వెలయుచున్నది.

పెద్దన తనవెనుకటికవులు కూర్చిన కూర్పులలోని మేలేర్చికొని పొదుపుగా నదుకుకొనుచు నొక్కొకయెడc దొంటికంటె సుతారము మీఱునట్లు హవళించును.

చ. ఉడిగి మడింగి మైమఱచి యున్నతటిం గలలోనc జేరె నె
క్కడి మగవాcడొకో? యనుచుc గందcగ మేల్కనుచో నతండ యి
ప్పుడు మగcడంచుc గోరుటకుc బొందుగc జెప్పితి ముల్లు పుచ్చి కొ
ఱ్ఱడcచినచంద మయ్యెc గమలానన యీ విరహానలంబునన్
ఉత్తరహరివంశము-సోముcడు



చ. ఉడుపతిబారికిన్ వెఱచి యూఱట యౌ నని పేరుటామనిన్
ముడివడుకంతు సేనలకు ముయ్యెలగుట్టయినట్టియిందు రా
నడcగునె తాపవహ్ని మనమై హరిణేక్షణ ముల్లు పుచ్చి కొ
ఱ్ఱడcచిన చందమయ్యెc బదమా యెలదోcటc జరింప నేటికిన్
ఆ. 3. ప. 34.

మ. అనుమానింపక యా సుధాంధసులు మాయాకల్పనావంచనం
బున వైశ్వానరునిన్ హరించిరి యవుంబో యింతమాత్రంబులో
నన నా యోగమహానుభావమునకున్ భంగంబు వాటిల్లు నే
ననిక ల్దాcచినc బెండ్లి మానునొకొ దుశ్చారిత్రముల్గంటిరే.
కాశీఖండము-శ్రీనాథుcడు

శా. తండ్రీ! నాకు ననుగ్రహింపcగదె వైద్యం బంచుc బ్రార్థించినన్
గండ్రల్ గా నటు లాడి ధిక్కృతులc బో కాల్మంటి వోహో మదిం
దీండ్రల్ గల్గినవారి కేకరణి నేనిన్ విద్య రాకుండునే
గుండ్రా డాcచినc బెండ్లి యేమిటికిc జిక్కుం గష్టముష్టింపచా!
ఆ. 5. ప. 17

సీ. పులిమల్లc డడవిపోతులరాజు గరుడుండు
గాలివేగంబు పందేలపసిcడి
విష్ణుప్రసాదంబు వెండిగుండులపరి
పచ్చిమిర్యము వెట్టిపుచ్చకాయ
వేcటమాణిక్యంబు విరవాది మెడబల్మి
పెట్టుగాcడు వకారి పిడుగుతునుక
జిగురుcడు చిత్రాంగి శ్రీరామబాణంబు
పులియందు కస్తూరి బొడ్డుమల్లె

గీ. యనcగ మఱియును బెక్కుతోయముల పేళ్లు
దారకులు దేర వచ్చె నుద్దండవృత్తి
వేcటకుక్కలు మృగరాజ విగ్రహములు
వటుకనాథుని వాహ్యాళివాహనములు
శృంగార శాకుంతలము-పినవీరభద్రకవి

పుట్టె నెట్టి వరమొ యనుచు । దానిఁ బాఱవైవఁగానున్న' – అరణ్య. ౩ ఆశ్వా.

౨౧౯ పు. బ్రహ్మపురులు= దేవాలయములలోని స్వస్తివాచక బ్రాహ్మణులు. "సోమేశ్వరదేవర బ్రహ్మపురుల సానుల వృత్తులు ఒక్కొకళ్ళకు ఖ ౩ " ఇది శక.౧౦౭౫ నాఁటి నన్నిచోడ శాసనము[1] –మఱియు చేఁబ్రోలి శాసనమున 'దేవర బ్రహ్మపురి బ్రాహ్మలు ౧౪ కు' ఇత్యాది.

౪౦ పు. కైకొనిపి (కైకొనఁజేసి) 'మేలుకొనిపి' – శ్రీనాథుఁడు.

'౨౦౭ పు. కూఁతురివరియింప' కూఁతురు శబ్దము ప్రథమేతర విభక్తులలో 'రు' లోపించునని కేతన యనెను. 'పరగఁ గూఁతురు శబ్దంబుపై రుకార ! మొక్క పలుకున పైనెన నుండుఁబాయు' నని విన్నకోట పెద్దన చెప్పెను.

పు.౧౨౧ మఱియట్లనేమెచ్చి – అట్లన్ అనికూడఁ బ్రాచీన ప్రయోగములు గలవు గాఁబోలును! ౨౨౧ మల్లజియ్య, బొల్లజియ్య – దేవళములం దర్చకులుగా నుండు తమ్మళ్లకు 'జియ్య' లని వ్యవహారము. పెక్కు శాసనములందుఁ దమ్మళ్లు 'జియ్య'లని పేర్కొనఁబడిరి.

౩౦ పు. దృష్ట్లు – ఈ రూపమును నన్నయకూడఁ బ్రయోగించెను. దృష్ట్లు భ్రష్ట్లు, రూపములు ప్రాచీనతరకవి సమ్మతములు.

౯౫ పు.కొల్చురగ సంఘములు ( 'కొల్చునురగ') అని యుండవలసినది.

౬౯ పు. అనియొండె వేసరనాసరఁగన్న జననిఁగదాయని – వేసరను, ఆసరను అని ఛేదము. 'కుక్షింభరిత్వంబున క్షుత్క్షాములై వేసరియోసరి దాసరి గుంపు (శర–చూ) అని యాముక్తమాల్యదలోఁ గలదు. బసవపురాణమున 'ఆసరు' అవి యతిలో 'ఆ' కలదు. ఆముక్తమాల్యదలోఁగూడ 'వేసరి యాసరి దాసరిగుంపు' అని యుండవలయునేమో ! ౧౨౧ – నాసికము. దీని ముకారాంతముగాఁ బలువురు ప్రాచీనకవులు ప్రయోగించిరి.

---

1 ౧౯౧౫ సం. గవర్నమెంటువారి శాసన సంచయము. నెం ౩౬౩



పు.౧౦౯ అదిగొమ్మనుచు = అదిగో+ అనుచు; అదిగో, ఇదిగో, వీఁడుగో, వాఁడుగో అను రూపములు గలవు. 'కొనుము' కు, కొమ్ము, కో, అను రూపములు గలవు. అదిగొనుము= దానిని గ్రహింపుము, చూడుము' అని యర్థము. 'కొనుము' రూపాంతరమగు 'కో' అగుటచే నాపదము కళగాని ద్రుతాంతముగాదు. 'అది।గో కానంబడియెఁ దెల్లగొల్లెనభంగిన్' అని వరాహపురాణమునఁ గలదు. పింగళిసూరన దాని ద్రుతాంతముగాఁ బ్రయోగించుట చింత్యము. 'మనసు ప్రుచ్చిలి చొచ్చిన మత్తికాఁడు । వీఁడుగొమ్మని– ఉత్తరహరివంశము. అదిగో ఇత్యాదులున్నట్టే అదివో, ఇదివో, వాఁడువో, వీఁడువో రూపములును గలవు. ఇక్కడ, 'వో' వొమ్ము రూపాంతరము. వాఁడుగో, వీఁడుగో రూపముల యునికిని గొందఱు సందేహించుచున్నారు. పిల్లలమఱ్ఱి వీరన శాకుంతలమునను, జైమిని భారతమునను దానిని బ్రయోగించెను. వాఁడుగో మాయన్న వంశవర్ధనుడు । నేఁడేల మది దప్పెనెలఁతరోనీకు, పల్నాటి వీరచరిత్ర – 'పేరు నేతిబీఱకాయ విలుచుకొందురు గాని। చేరిచూడఁబోతె నెయ్యి చిక్క దందులో । ఈ రీతి బ్రాహ్మణుల పద్దు నెన్నఁగా నేమియుగద్దు। వాఁడుగో మాదరచెన్నవరుఁడె బ్రాహ్మణుఁడు' – చిలుకపాటివారి వచనములు–

పు.౧౨౪, ౧౭౮ 'పశువరించు' ఈ పదము నన్నయ రచనలోఁగూడఁ గలదు. 'నీ యట్లు క్రూరులై నృపతులఁ జెఱఁబెట్టి పశువరించుచుఁ బశుపతినుమేశు । వరదుఁ బూజించినవారును గలరె' సభాపర్వ.౧ ఆశ్వా. 'తనయుఁబశువఱిచి తద్వప । గొనివేల్చినఁ జూచి' అరణ్య. ౩ ఆశ్వా. మొదటి ప్రయోగమున హింసించు బాధించు అనియు, రెండవదాన యజ్ఞపశువునుగాఁ జేసి చంపు అనియు నర్థము పొందుచున్నది. పశువఱుచు, 'పశువరించు' రూపాంతరములు గావచ్చును. [1] 'పశువడు' కలదో లేదో ! సోమనాథుని ప్రయోగములకు మొదటి యర్థమే పొందుచున్నది. 'పశువరింపఁగఁ జంప' – 'పశువరించుచుఁ గొర్లపాలు సేయుచును' అనుచో హింసించు బాధించు అనియే యర్థమగును.

---

1. 'పశుపఱుచు' రూపాంతరమే యగునేని యుద్ధమల్ల శాసన లిపిరీతిని 'పశువఱించు' అని శకటరేఫముతో నుండవలెను.

పు.౮౫ విగుర్వణము. నన్నయ 'విగుర్వించు' అనియు నన్నిచోడఁడు 'గర్వవిగుర్వణంబులన్' అనియు నీ పదమును బ్రయోగించిరి. 'గుర్వీ ఉద్యమనే' అని ధాతుపాఠమునఁ బరిగణితమయిన ధాతువున నుండి పయిపదములు పుట్టినవి. గుర్వీధాతువుననుండి 'గూర్వణ' మని రూపమేర్పడునుగాని 'గుర్వణ' మని యేర్పడదు గావున నిది కర్ణాటదేశి పదమని కొందఱందురు. గుర్వు, గుర్వించు, అగుర్వు, అగుర్వించు అనునవి తద్భవరూపములగునని నేఁ దలంతును. 'విగుర్వించు' 'విగుర్వణము' తత్సమములనియే నా తలఁపు. కావుననే నన్నిచోడఁడు 'గర్వవిగుర్వణంబులన్' అని సంస్కృత సమాసమునఁ జేర్చెను. గుర్వు, గుర్వించు మొదలగు తద్భవశబ్దముల సంబంధముచే 'విగూర్వించు, విగూర్వణము' అని యుండవలసిన తత్సమ శబ్దము లను లేఖకులు 'విగుర్వించు, విగుర్వణము' అని లిఖించియుందురు. 'గు' ఎట్లును గురువేకాన 'గుర్వణ' మన్నను 'గూర్వణ' మన్నను బద్యములందుఁ జిక్కులేదయ్యెను. ఈ తలఁపు తోడనే నేను 'గు (గూ ?) ర్వణ' మని యుంచితిని.

పు.౬౭ తొంగిళ్ళు – శ. ర. లో నీ పదమునకు నీటిబొట్లు, నూనెబొట్లు అని యర్థము కలదు. భల్లాణ చరిత్రలోనివిగా బసవపురాణములోని యీ ద్విపదలే యపపాఠములతో నం దుద్ధృతములయ్యెను. (శబ్దరత్నాకరమునఁ బెక్కు పట్టుల బసవపురాణ పండితారాధ్యచరిత్రములలోని ద్విపదలోని ద్విపదలే భల్లాణచరిత్ర ద్విపద భాగవత పతివ్రతాచరిత్రములలోనివిగా నుద్ధరింపఁబడినవి. ఆయా ద్విపద లాయా గ్రంథములందు నాకుఁ గానరాలేదు. శ. ర. లో గ్రంథ సంకేత వివరణ పట్టికలో భల్లాణచరిత్రము వాలేశ్వరునిదిగాఁ జెప్పఁబడినది. వాలేశ్వరునిది పద్యకృతి) ఇక్కడ ముద్రితమయిన పాఠమును శ. ర. పాఠమును జూచినఁ దెలియఁగలదు. తలంటునప్పుడు పసిబిడ్డలఁ బండుకొనఁబెట్టుటకయి చాఁచిన యూరుద్వయమునకు దొంగిళ్ళని పేరు. 'తొంగిళ్ళపై నిడి లింగమూర్తికిని। నంగన గావించు నభ్యంజనంబు' అను ద్విపదను గన్నడకృతిలో భీమకవి యిట్లు పరివర్తించినాఁడు. 'ఎరడుతొడగళమేలె పరమన । నిరిసిసలె యభ్యంగనవ నా। చరిసు' మఱియు 'అంగిటి ముత్లొత్తునందందవ్రేలఁ – దొంగిళ్ళఁ గార్నీరు దో నెత్తిమిడుచు' అనుదానికి 'అంగులియ ముళ్ళం సుదతితం నంగుళది నొత్తువళుతుంగో। త్సంగదిం సురిదంబువనితం నెత్తి యొళెరెవళు.'



శబ్దరత్నాకరకారులు మన సోమనాథుని గ్రంథములను స్వయముగాఁ దలస్పర్శముగాఁ బరిశోధించినట్టు గానరాదు. అట్లు శోధించియుందురేని బసవపురాణ, పండితారాధ్యచరిత్రములలోని ద్విపదలనే యన్యగ్రంథములలోని వానిఁగా నుద్ధరించుటగాని యనేకశబ్దములను విడుచుటగాని సంభవింపదు. సోమనాథుని గ్రంథములు మొదటితరగతిలోఁ జేరవలసినవయినను వారైదవతరగతిలోఁ జేర్చిరి. ఇంతవఱకు నేఁజూపిన శబ్దములు గొన్ని శబ్దరత్నాకరమునఁ జేరనివే. నిఘంటువులలోఁ జేరనివి నూర్లకొలఁదిగా శబ్దము లీ సోమనాథుని గ్రంథములలో నింకనుగలవు. ఈ బసవపురాణమున స్థూలదృష్టిని నాకు గోచరించిన వానిని గొన్నింటి నకారాద్యక్షరక్రమమునకుఁ దార్చి యిక్కడఁ జూపుచున్నాఁడను. శబ్దరత్నాకరమునకందనిశబ్దములు, అందినను దప్పురూపముతో నున్నశబ్దములు తప్పుటీకతోనున్న శబ్దములు, సందిగ్ధరూపసందిగ్ధార్థములతో నున్నశబ్దములు నిందుఁగలవు.

## శబ్ద విశేషములు

పు.౪౬ అంకంబువాఁడు = ముద్రాధారి

పు.౨౩౪ అక్కిలించు = అక్కలించు,

పు.౭౧ అచ్చన = అర్చన,

పు.౧౨౦ అడఁకు= ఒదుఁగు,

పు.౨౩౪ అ(?) డచాళ్లు= రాజ్యాంగోద్యోగులు,

పు.౧౫౩ అడుకు = దాఁచు

పు.౭౫ అడువరి= ఆడువరి, వప్రము,

అడ్డాయుధము = ఆయుధభేదము..

పు.౧౬౨ , అరసు= రాజు, 'రాజన్' శబ్దము, అఱవమున 'అరశన్' కన్నడముననను తెనుఁగుననను అరసు 'దేవ–రసు నిర్ధనయ్య నిరాళదేవయ్య' పండితా. పు.౩

పు.౭౩ అరివియగు= బయలగు, (అఱివి =శిథిలము చూ. కాశీఖండము)[1]

పు.౧౧౩ అరుచు= చెల్లించు,

1 బసవ. పు 73లో ఈ అంశమును శాస్త్రిగారిట్లు వ్రాసికొనిరి ( ప్రకాశకులు)

పు.౧౪౬ అఱగొడ్డెతనము = (చూ.శ.ర.) అఱగొండెతనము,

పు.౬౮ అటిమి= అజీర్ణవ్యాధి, అఱుకువ రూపాంతరము అఱు+ ఇమి శ.ర. అరిమి చూచునది.

పు.౨౨౦ అఱప =చేని మంచె

పు.౧౦౫ ౧౩౪ అటిముటితనము = తొందర,

పు.౧౩౮.౧౩౯ అలుకు = చల్లు,

గీ. నెగడు పేర్బిందు లనువిడినీరఁ[1] బ్రియుఁడు।
గరజ హలముల మైపూఁతగలయఁ గలఁచి
కామబీజము లలుక వేగమున మొలచు
మొలకలన మేని నిండ ముత్పులక లెసఁగె.

–కుమార సం.౮ ఆశ్వా.

పొం। గారెడు నేతికిఁ బయిపై నీ రలికినయట్లపోలె నిష్ఫలమయ్యెన్. దశకుమారచరిత్ర, ౩ ఆశ్వా. 'పరువంపుఁ బుప్పొడి బాగుగాఁ దీర్చిన యలకలపైఁ బొలుపార నలికి,' ఎఱ్ఱన హరివంశము.

పు.౬౯ ఆదట = తృప్తి.

పు.౮ ఆదరికము = ఆదరము, (కిట్టెల్ కన్నడనిఘంటువు చూచునది)

పు.౯౯ ౧౯౧ ఇబ్బంది = అజ్ఞాని

పు.౧౦౯ ఇటివిరి ( ఈ పాఠమే యుక్తము) = ఇటియుట విరియుట– సంకోచ వ్యాకోచములఁ జెందుట,మినుకుమినుకు మనుట,

పు.౧౩౭ , ౨౨౯ ఇలుపుట్టు = ఇలువరుసను వచ్చినది.

పు.౮౦ ఉడుపనేయి = ఉడుమునేయి,

పు.౭౨ ఉద్దెసించు = ఉద్దేశించు,

పు.౧౫౫ ఉనుపరి = స్వతంత్రుఁడు,

పు.౧౩౦ , ౧౯౮ , ౧౯౦ ,౨౦౦, ౨౦౨ . ఎగుదు= ఎగిసి వచ్చు, దూఁకివచ్చు,

1. నిడి నీరు = వాననీరు. తిరుపతి ప్రాంతముల వాడుక ఉన్నది. శాసనములు చూ. పీఠికలో ఈ పట్టున శాస్త్రిగారీ విషయమును గుర్తించిరి ( ప్రకాశకులు)



పు.౧౩౩ ఎడయునుబుచ్చు,

పు.౪౫ ఎడవుచ్చు,

పు.౬౮.౧౨౯ ఎడవోవు = కుంటెనతనమునకుఁ బంపు, కుంటెన తనమునకుఁబోవు,

పు.౧౬ ఎరివు= బాధ,

పు.౪౩ ఏట =గొఱ్ఱె,

పు.౧౧౪ ఏటము = సమృద్ధము,

పు.౧౮౯ ఐదవెట్టు = ముట్టు.

పు.౮౦ ఒడిపిలిపాసెము = (శ.ర. లో నిది యప్రయుక్తమని కలదు.) పండఁబాఱినను బచ్చిగానున్న ధాన్యమును దంచిచేసిన బియ్యముతో వండిన పాయసము,

పు.౭౪ ఒడ్డణము = ఒడ్డాణము,

పు.౧౩౯ ఒమ్ము = ప్రియమగు,

పు.౧౬౫ ఒఱగోయు = ఒఱనుండిలాఁగు,

పు.౧౪౬ ఓజు = అధిపతి, గురువు, ఒజ్జ,

౩౨ కంభకట్టు = స్తంభములకుఁగట్టి చేయు నలంకారము. మీఁదఁ గట్టి చేయు నలంకారము మేలుకట్టు;

౧౨౫ కట్టిల్లు = అంటుకొను,

౭౨ కట్టుగ్రము = కడు+ ఉగ్రము,

౧౦౩ కట్టుగ్రుఁడు,

౧౦౦ కట్నము = వస్త్రము,

౧౧౬ కడయింటి పొడున = అతిసంసారుఁడయిన పోటుమానిసి,

౧౦౨ కనుమరి = కమ్మరి,

౭ కన్నెఱుఁగు = జాడయెఱుఁగు,

౧౫౦ కలకేత విద్య,

౧౪౯ కలకేత వేషము = ఇంద్రజాల విద్య,

౧౧౨ కల్లచ్చులు = తప్పుటచ్చులు,

౧౦౧ కల్లవెల్ల = గజిబిజి,

౧౮౮ కవణము = పొర, అడ్డు,

౧౮౩ కసిమసి గజిబిజి (గసియుమసియు)

౧౦౨ కాకఱపులు = వదరులు,

౧౨౦ కింగాణము = నైచ్యము,

౭౨, ౧౬౩ , ౨౩౨ కుడుక = కోర, గిన్నె,

౧౭౮ కుతగలు [1] = కుతజ్ఙులు, దుర్విజ్ఞానులు,

౧౦౭ కాయకము = వర్తకము, పనిపాటు, ఇది సంస్కృత సమాసమున 'కాయకలబ్ధి' ఇత్యాదివిధములఁ గలదు. 'ప్రాయపుఁ గాయకుల్ వలె' విజయ విలాసము,

౧౧౨ కొట్నము = ధాన్యము.

౧౩ కొత్తడి = స్త్రీ సమూహము, "పుణ్యచరిత్ర గులాగ్రగణ్య గొత్తడి సకలంబు" ఉద్యో. ప.

౨౧౦ కొత్తి= స్త్రీ, (కొత్తి, గోఁతికూడా ఉన్నది. హరివం) [2]

౧౪౫ కొయ్యనగాండ్రు = మూర్ఖులు,

౧౧౨ కొసనక = కొసనక్క (దేవతపేరు)

౮౪ కోడిఱెప్ప = ఱెప్పలో దుర్మాంసము పెరుగునేత్ర వ్యాధి,

౧౨౪ , ౨౩౦ . కోలాస= రిత్తకోరిక, దురాశ,

౧౦౫ క్రిగ్గాలి = క్రిక్కుగాలి, తప్పుగాలి.

౨౪౫ క్రియగొను = పనిగొను.

౧౯౧ క్రుమ్ముడి = కుఱుముడి (క్రొమ్ముడి శబ్దములేదు)

౮౫ క్రేకన్ను= క్రేవకన్ను, కడచూపు, కటాక్షము ('క్రే' తర్వాత అరసున్న లేదు. క,గ, కాలేదు).

1 కించిజ్జ్ఞులు, అతజ్జ్ఞులు, కుతజ్జ్ఞులు అని నేనన్నాను, సూర్యరాయవారు సితగులు, అతగులు, కుతగులు - ఇన్నీ ఉన్నవి గాన అతగులు = హతకులు అన్నారు, చేయి దిగండిట్టి సితగుందుగలడె పుట, 69 కన్నడమున సితగుడు = వ్యభిచారి. తెలుగున - ధూర్తుఁడు.

2. ఈ పట్టున శాస్త్రిగారిట్లు గుర్తించుకొనిరి ( ప్రకాశకులు)



౨౩౭ క్షణియించు = అర్పించు.

౩౦ గజ్జెపరుపు =?

౨౧౬ గడ్డిగ బావులు =ఏతపు నూతులు.

౩౨ , ౧౪౬ గనియ = గని? కండపట్టు ? 'అన విని మేటి ధర్మమగు నట్టిది యెయ్యది, యెట్టిదెప్పుడున్। గనియగఁ బండియుండు' అరణ్యపర్వము ఆశ్వా. శ.ర. లో ' కనియ= మాఁగబండు ' అని యీ ప్రయోగమే యాధారముగాఁ గలదు. ఇక్కడను 'గనియ' కాఁ దగునని నాతలఁపు. ' ఆ చేను గనివలెఁ బండినది' అనుట కలదు.

౧౮౩ గటిగొను = ముత్తెపుఁ జిప్ప జలబిందువును దాల్చు

౯౭ గామిడి= గడుసరి

౭౧ గుడగుడలు = సంశయము.

౩౨. ౨౨౪ గుడ్డ = గుట్ట.

౧౦౨ గెలిగొను = గేలిగొను.

౬౫ గొంతి = కాంత

౨౪౦ గొఱుపడము = కంబళి

౭౪ గోరంతప్రొద్దు = ఓరంతప్రొద్దు

౨౩౪ చక్కిలించు = చక్కిలిగింత చెందు

౧౬౦ చిఱలువొడుచు = (పశువులు) నేలగోరాడుచు రేఁగిపరువెత్తు.

౨౧౯ చెరలు = ఉప్పొంగు.

౬౯ చేకళ్లు= చేతిముద్దులు.

౨౨౨ జంగెత = జంగమురాలు

౬౧ జక్కొల్పు= సమకూర్చు.

౨౨౪ జరగడుగు= జలగడుగు, (నేఁడు జలగడుగుజాతి వారనఁ బడు వారికిఁ బూర్వము ' జరగడుగువా' రనియే పేరయి యుండును)

౧౦౭ జాడము= తుండము ?

౧౩౪ జాణత = చాతురి

౭౧ జాత్ర= జాతర, ఉత్సవము.

౧౦౭ ఝూళిసేయు = జాడించు.

౭౪ టెంకణము = గోపురము ?

౨౧౫, ౨౨౬ తండు = నిస్సారము.

౧౯౫ తండె = అయ్య.

౭౬ తథ్య = సత్యము.

౬౮ , ౧౧౯ తఱుచంటి = దుడుకువాఁడు. శ – రలో తఱుసలియని యీ పదము గ్రహింపఁబడినది. తఱుసలి పై నౌపవిభక్తిక ప్రత్యయముచే తఱుసంటి మాటలు' అని నన్నయ ప్రయోగించెనని సీతారామాచార్యులవారు దలంచిరి. కుమారసంభవమున 'తఱుచంటి దన్ను నెదిరిని నెఱుఁగఁడు' అని 'తఱుచంటి' యే ప్రకృతిగాఁ గానవచ్చుచున్నది. సోమనాథుని ప్రయోగములు నన్నిచోడ ప్రయోగరీతినే సమర్థించుచున్నవి.

౨౩ బగుతులు= భక్తులు, బగితియుఁ గలదు.

౨౬ బట్టకబయలు = బట్టబయలు

౧౦౯ బడగు = వెడఁగు, పొగరుఁబోతు.

౭౦ బదరుఁడు = ఈశ్వరుఁడు

౧౬౦ బడిసివైచు = చేతులార్చు.

౧౧౨ బడుగుపనులు = దాస్యము.

౨౦౯ బరులు = చిఱుదొక్కలు

బనత = నొసలు ? దౌడ ?

౨౦, బహురూపులు = వేషములు, వేషగాండ్రు.

౧౦౫ బుగ్గరించు = విచ్చు.

౧౧౧ బులుసరితనము = దంభము

౭౦ బెడంగు = మూతి వెడల్పయినది ?

౭౦ బొత్తిస = ముసుఁగుపైఁట.

౬౮ , ౧౪౩ బొప్పఁడు, బొప్ప= బాబు

౧౭౮ మజ్జనబావి = జలకమాడుబావి

౨౨౯, ౭౪ మట్టగించు = క్రుళ్లగించు.

మడిగూడు = ప్రసాదము.



౧౩౦ మదుకు= వణఁకు.

౧౮౪ .మర్గడము = మలవిసర్జనము ?

౧౩౩ మర్మమేలము = రహస్యపుఁజనవు.

౧౭౨ మఱపడు= చాటుపడు, మఱుపడు –రూపాంతరము

౧౧౨ మసనక = దేవత పేరు

౨౧౬ మాదర = మాదిఁగ (మేదరకాదు) మాదర చెన్నయను గూర్చి–

క. చెన్నయ మాలఁడుగాఁడే
మున్ను మహాదేవుఁగొలిచి ముక్తుండయ్యెన్
జన్నమున శివుని దక్షుఁడు
మన్నింపమిఁజేసి పచ్చిమాలండయ్యెన్

– శివతత్త్వసారము

౧౦౧ ముట్టుపాటు= స్పర్శము.

౨౦౯ మున్నుదుక = ?

౧౯౮ ముట్టము, తిరుముట్టము = ప్రతిష్ఠాపీఠము.

౧౭౨ మేడెమువొడుచు = మేడము వొడుచు శ. ర. చూ.

౧౧౩, ౨౧౫ మొగవాడ = దేవాలయాదులలో దేవుఁడు మొదలగువారికి ముందుగట్టెడు నడ్డుతెర, ముఖపటము,.

౧౫౮ మోహణము = ఖడ్గపుఁబిడి.

౧౩౪ మ్రింగనఁగొండి = మ్రింగివేయువాఁడు.

౭౪ తాటనవుచ్చు = ?

౧౧౬, ౧౧౮ తాపసి = తపస్వి.

తుల్కాడు = దైవాఱు, తుల్కాడు, తొల్కాడు, రెండు రూపములును వ్రాఁతలలో గలవు.

౯౭ తొంగిళ్లు = బిడ్డఁ బందుకొనఁ బెట్టుకొనుటకై చాఁచిన యిరుదొడలు.

తొరుగు = స్రవించు.

౧౮౯ త్రట్లు = కళలు.

౧౫౮ త్రస్తరులు= పరిహాసములు

౧౫౧ దయపడు= కరుణించు.

౧౧౨ దారలువట్టు = బాకాలూఁదు.

ధర్మకవిలె= అనుగ్రహపాత్రుఁడు.

నంగ= స్త్రీ.

౧౪౪ నంజు= సందేహించు.

౨౩౪ నడబాళ్లు= రాజ్యాంగోద్యోగులు.

౨౦౦ నిట్టపాటు= నిలువునఁబడుట.

౧౬౦ నిత్రించు= నీల్గు

౧౦౭ , ౧౪౭ నెట్టోడు= భయపడు, గజిబిజిపడు.

౧౨౪ నెఱవణి= ప్రశస్తి,

౮౪ పక్కిళ్లు= ప్రక్కలు.

౧౩౫ పటవలి=వస్త్రము.

౧౬౪ పడికివల్చు= దుర్గంధముగొట్టు.

౬౧, ౧౫౨ పడిగము= పళ్లెరము, పాత్రము ( తమ్మ యుమియునదే కాదు)

పడిహారి = పణిహారి, పడితెచ్చువాఁడు, వేత్రహస్తుఁడు.

౨౧ పదకవాదము= కల్పితవాదము, కవితాకల్పనము.

౨౧౨ పదరు = దబ్బనము?

౨౩౮ పదువ= తృణభేదము.

౬౪ పనువు= పనవు

౧౪౦, ౧౦౮ పన్న= అధముఁడు, సేవకుఁడు.

౨౨౮ పన్ను = పల్లము, చౌడోలు, (ఏనుంగు పన్నగునే గాడిదలకు)

౬౬ పరిచ్ఛేది = శిరచ్ఛేదసన్నద్ధు (ఁడు) రాలు.

౪౬ పరిసెనమువాఁడు = స్పర్శచేయువాఁడు.

౧౨౪ , ౧౭౮ పశువరించు = హింసించు.

౩౮ ౨౩౨ పసిగ= పసి ( పసిక అనియు)

ప్రామిఁడి= గయ్యాళి, ధూర్తుఁడు.

౫౫ పాదిగ= పాతిక.



౮౬ పాయగొమ్ములు = చెట్టు పంగటికొమ్మలు 'పాయగొమ్ముల నల్లఁ బట్టు దగిల్చి యక్కొన యాకుపై వెండికోరవెట్టి' – ఉత్తరహరివంశము.

౧౭౯ పిట్టపిడ్గఱ = పిట్టపిడుగు,

౨౪౨ పుప్పించె= పుచ్చఁజేసెను.

౧౮ , ౨౦ పురులు = సౌందర్యము, కీర్తి, ధనము.

౮౨ పూన్చు= పూజించు

౪౩ పెంట్రుక= పెట్రిక.

౩౧ పెంట= పేఁట.

౪౩ పెఱికసెట్టి= శాసనములందు 'పెఱుక సెట్టి' కలదు.

౨౨ పేయ= పెయ్య.

౨౪౦ పొట్టపొర్వు= కడుఁజేరువ.

౧౨౮ పోలగు= ఒప్పు

౧౦౩ పోడేర్చు= భూమిని గృష్యనుకూలముగాఁ జేయుటకై పుట్ట పొదరు మొదలగువానిఁ గొట్టి తగులఁబెట్టు.

౭౧ పోలెలు= పోళీలు.

౬౦ .మనికులు= స్థిరులు.

౧౮౯ ప్రేలగింపులు= ప్రేలుటలు.

౮౨ పాదొ (దు) ట్రు = సాలెపట్టు.

౨౦౨ భ్రమరించు = చుట్టివచ్చు.

౨౨, ౨౨౬ లింగపసాయితము= లింగప్రసాదితము. వీరశైవులు చేత ధరించు ఖడ్గము.

౭౪ వంపుడుగట్ట= కరకట్ట

౧౯ , వట్టిపాటు= వ్యర్థము

౧౨౩ వదిగొను= వరుసపెట్టు

౨౦౪ వయ్యు= వైచు.

౧౩౬ వ ఫుట్‌నోటు చూచునది. (వలయెత్తి నీటిలో వయ్యంగఁ దడవ; వలఁగొని మఱునాఁడు వయ్యంగఁదొలుత.)

వరువుడు, వరుపుడము, వరువు, వర్వు= దాస్యము.

౧౪౯ వలివేగము ( వలవేగము, అనియుఁగలదు) = కడువేగము.

౨౪౫ వర్షాఫలము= వడగల్లు (వర్షోపలమనుటకు వర్షాఫలమనెను)

౧౭౧ , ౧౯౦ వసది= జైనమఠము ( నేఁడు 'బస్తి' యనఁబడును).

౩౩ వాతపూరణములు= గాలి గుమ్మటములు.

౬౨ వాళగ్రోలు = పిల్లనగ్రోవి?

౧౫౩ విడియలు= రొక్కపు జాలెలు.

౧౯౧ విసమాల్చు= మాయించు.

౧౩౮ లెంగిలిబంటు= అధమభృత్యుఁడు.

౪౬ , ౧౦౩ వెండీఁడు= బొమ్మలాడించువాఁడు.

౮౧ వెడ్లుబుడ్లువెట్టు = నిశ్చేష్టమగు

౨౨౪ ; వెరవిండి= వెరవెఱుంగనివాఁడు.

౪౨, లెంగులు= అధములు.

౧౮౦ వేఁడివెల్ల= వేఁడిబూడిద

౬౯ వేసరు+ ఆసరు= ఆయాసముచెందు, ఉజ్జగించు.

౨౨ శివమరులు= సివమెత్తుట.

౧౧౨ శివశరణులు= శివుఁడు శరణముగాఁ గలవారు.

౭౪ సువిధానులు= సువిధానమనుచు హెచ్చరిక చేయువారు.

౨౧౪ సడగరంబు= సంభ్రమము, ఉత్సాహోద్రేకము.

౧౨౨ సుళువు= తిరుగాటము.

౧౨౫ సూనెగాఁడు = కటికవాఁడు.

౧౩౦ సొకనాసి= దేవళములో గర్భాలయపు ముందటిపట్టు, 'సుకనాసి' యని శాసనములు.

౨౪౦ సోడంబు = ఖడ్గము ?

౪౬ హేళగీఁడు= కథలు చెప్పువాఁడు ?

మఱియు

౬౨ పుటలో ధూకళి, ఝుంకళి మొదలగు నృత్యపరిభాషా పదములును,

౯౦ పుటలో మొగచాళము, నవతాణము, సాళి, పెళ్లాపెళ్లి మొదలగు సంగీత పరిభాషాపదములు పెక్కులును దుర్‌జ్ఞేయములుగా నున్నవి. వాని నెల్ల నే నిక్కడఁబేర్కొన నయితిని.



మఱియు,

అనుగులము - అనుగలము, కొమ్ము - కొమ్మకసువు - కసపు, కదువ– కదవ, వరువుడు –వరవుడు, కుఱుఁగలి–కుఱఁగలి, చనువు– చనవు, పనువు– పనవు, గొడగు– గొడుగు, పెంట్రుక –పెంట్రిక, రూపములు గలవు. ఇందుఁ దొలిరూపములు ప్రాచీనములు. మోఁకాలు, మోఁచేయి, శబ్దములకు, శ–ర–లో మోఁద+కాలు, మోఁద+చెయి, యని నిష్పత్తులు గలవు. మ్రోఁకాలు, మ్రోఁచెయి, యని ప్రాచీనరూపములు. మ్రొగ్గ+కాలు, మ్రొగ్గ+చెయి, అని వాని నిష్పత్తులు. మ్రాను–మాను, మ్రోదు - మోదు, మ్రబ్బు –మబ్బు, స్రద్ద–సద్ద, మొదలగు రూపములు నున్నవి. ఇందును దొలివి ప్రాచీనములు. అట, ఇట, ఎట, ఆడ, ఈడ, ఏడ, అచట, ఇచట, ఎచట, అక్కడ, ఇక్కడ, ఎక్కడ, శబ్దములు, కళలుగాను ద్రుతప్రకృతికములు గాను గలవు. పయి శబ్దములు వ్రాఁతలలో నిరుదెఱఁగులను గలవగుటచే నేను నిరుదెఱఁగులను నుంచితిని.

ఇప్పుడు పేర్కొన్నవిగాక యింకను బెక్కుశబ్దములు శబ్దరత్నాకర సంస్కారమున కుపకరించునవి యిందుఁగలవు. విస్తరభీతిచే నింక విడుచు చున్నాఁడను.

## వ్రాఁత పలుకుబళ్లు

అర్వాచీనకవుల కృతులలో నంతగాఁ గానరాని వానిని వ్రాఁతపలుకు బళ్లను గొన్నింటి నిక్కడఁ జూపుచున్నాఁడను.

ప్రవేశింపఁదడవ ( ప్రవేశింపఁగానే) ౪౭ బాహుయుగ్మముఁ జాపఁ దడవ (చాఁపఁగానే) ఇత్యాదులు పెక్కులు. ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశమునఁ గూడ నిట్టి పలుకుబడి గలదు.

౬౬ పుట. కాన నాతప్పునఁ గాఁజేసి ( నా తప్పువలన) తలఁచు తలంపుఁ– బలుపునఁ గాఁజేసి – (బలుపు వలన).

౮౫ వెండియు నక్షిరోగంబొ (వేఱొక యక్షిరోగమో)

౨౩౬ అరుగుము భక్తజనాళిలో వెడలి (లోననుండి వెడలి).

౧౭౯ ఆమటఁ బదిట, (పదియామడల దూరమున)

౧౭౧ అటవార్తగలిగి (అని వినికిడి యేర్పడి)

౭౩ కొఱడుగొౘ్ౘ, ౘ్రమనుమౘ్ౘ, బడియబౘ్ౘ, కట్టెగిట్టె, సదసౘ్ౘ, నలినౘ్ౘ, కస్సుగౘ్ౘ, ఈ జంట పలుకులలో ద్వితీయముల కర్థము లేదనుకొందును. శ-ర-లో 'మౘ్ౘ' టీక చూచునది.

౭౦ పు. తల్లివి గలుగంగఁ దనకు రోగంబు (తనకు=నాకు)

౧౧ పు. నందీశ్వరుఁడు సేయు నవ్వతపంబు - ఇచ్చోఁ బ్రాత పలుకుబడి చొప్పున 'నందీశ్వరుఁడుచేయు' అని యుండుననియు నా పాఠమే గ్రాహ్యమనియుఁ దలఁచితినిగాని పెక్కుప్రతులలోఁ దొలిపాఠమే యుండుటను 'మీరు సెప్పినయట్లు మృడునకుఁబాలు, - నీవు దూపొడిచిన ఠావుదక్కఁగ, ఇత్యాదులగు బహుప్రయోగము లుండుటను జూచి యిదియు గ్రాహ్యమే యనుకొంటిని. ఇట క్రిందిమాటలకేఁ దప్పువట్ట । నిటమీఁద సిరియాలు నీశ్వరు వార్త। మఱచి యాడితిరేని మా భక్తులెడకు। మఱి మీరు హరునికోమటి తోడివారు (సిరియాలుని యొక్కయు నీశ్వరుని యొక్కయు, వార్త, హరుని తోడివారు కోమటి తోడి వారును -

౨౦ పుట, భక్తియు నీవును బద్దట్లు పడుము, - ఇత్యాదు లనేకములు గలవు. సోమనాథుఁడు తన గ్రంథములం దుపయోగించిన భాష, ప్రాచీనత చేతను, గర్ణాటాంధ్రదేశముల కూడలిపట్టున వాడిక కలదగుటచేతను, మఱియు సోమనాథుని బహుదేశభాషా పరిజ్ఞానముచేతను, వైలక్షణ్యముగాంచి నేఁడు మధ్యాంధ్ర దేశవాస్తవ్యులయి, కర్ణాటద్రవిడ భాషాపరిచయ మించుకయుఁ బొందని వారికిఁ గొంత వింత గొల్పుచుఁ గొన్ని పట్టులఁ గొఱుకఁబడనిదై యుండును.

## అనుకరణములు

సోమనాథుఁ డొండు రెండు పట్టులందు నన్నిచోడని ననుకరించెను. నన్నిచోడకవి సోమనాథకవికంటెఁ బ్రాచీనుఁ డగును.



సీ. నేలయు నింగియుఁ దాళముల్ వాయింప
నెండమావులఁబట్ట బండతలయు
మ్రోఁకాలు ముడివెట్ట రోఁకటఁ జిగుళులు
గోయఁ జట్రాతిపైఁ గ్రుంగ నిడుపు
లేక చిత్రముల్వ్రాయ నాకాశమునఁ దాఁప
రమునిడ మంచుఁ గుంచమునఁ గొలువ
నేనుంగు పురు డోమ ఱా నారగొన గాలి
గంటిడ నిసుమున గట్టుదాల్ప

గీ. నీరినడుమద్రెంప నేలఁ దెన్నుండి చే
వెల్పఁ గలియుఁద్రచ్చి వెన్నగొనఁగఁ
గడవనేర్పుగలిగి కందువుమానెఁడై
కత్తిగంటు లయిన యత్తగంతు ? - కుమార.

ద్వి. నెట్టణ నేలకు నింగికి సూత్ర
పట్టమ్రోఁకాళ్లకు బట్టతలలకు
ముడివెట్టఁ దననీడ గడవంగఁబాఱఁ
వడి నెండమావుల కడ గళ్లుగట్ట
పాయక రెండుగాఁ బాఱెడునీరు
వ్రేయఁ బుల్లున్న గోరో యని యమ్మ
ఱా నారయొలువఁ జట్రాతిపైఁ గ్రుంగ
నేనుంగు పురుడోమ నిసుము త్రాడ్పేన
లలిగొనదెసలు తాళములు వాయింపఁ
జెలఁగుచు రోఁకటఁ జిగుళులు గోయఁ
గలివెన్న వుచ్చఁ గొండలుదొంతిఁబేర్ప
నిలమంచు గుంచానఁ గొలువరేఁబవలు
సేయ నాకసమునఁ జిత్రరూపములు
వ్రాయ వాయువుఁ బట్ట వడగళ్ల గుళ్లు
గట్ట వెన్నెల గుంపు గాఁజేయ వచ్చి
పుట్టినప్పుడె నేర్చు బుద్ధులప్రోఁక
-పండితారాధ్య చరిత్రము.

ఇట్టి వింక నొండు రెండు పట్టులందుఁ గలవు. మల్లికార్జున పండితారాధ్యుల శివతత్త్వసారపుఁ బద్యములు పెక్కులు పండితారాధ్య చరిత్రమున ద్విపద రూపమున దాల్చినవి. అది యసంగతముగాదు. మఱియు నాగమగ్రంథములలోని శ్లోకములు పెక్కులు బసవపురాణ పండితారాధ్య చరిత్రములందుఁ దెలిఁగింపఁబడినవి. ద్రవిడభాషలో 'తిరుతొండర్‌తొఘై' యను పేరఁగల లఘుస్తుతి కిందనువాదము గలదు.

> "పరగు మహాభక్తచరితలు నాద
> భరితమై చనఁ దిరుపాటలు సేసి
> పాడుచు నొక్కొక్క భక్తుని చరిత
> వేడుకఁ బొగడునవ్విధ మెట్టు లనిన.
>
> — ౧౩౩ పు.

ఇది దాని యుపక్రమము. కర్ణాటభాషలో బసవేశ్వరుఁడు మొదలగు వారు రచించిన గేయ వచన రూపగ్రంథములనుండి కూడ నీతఁడు గొన్ని పట్టులను దెలిఁగించి యుండవచ్చును. ఆ గ్రంథము లప్రఖ్యాతము లగుటచే వానిని గుర్తింపఁగాదు.

ఇఁక మన సోమనాథుని రచనములను బలువురనుకరించిరి. శివకవులెల్లరు ననుకరించినవారే. బమ్మెరపోతరాజు, శ్రీనాథుఁడు మొదలగువారి గ్రంథములలోఁ గూడ నప్రయత్నముగా సోమనాథుని రచనములు దొరలినవి.

> క్షీరాబ్ధిలోపలఁ గ్రీడించుహంస
> గోరునే పడియల నీరుద్రావంగఁ
> జూతఫలంబులు సుంబించుచిలుక
> భాతిఁ బూరుగుమ్రానిపండ్లు గన్గొనునె
> రాకామల జ్యోత్స్న ఁ ద్రావుచకోర
> మాకాంక్ష సేయునే చీకటిద్రావ
> విరిదమ్మివాసన విహరించుతేఁటి
> పరిగొని సుడియునే బబ్బిలివిరుల
> నెఱుఁగునే యలదిగ్గజేంద్రంబు కొదమ
> యెఱపందిచనుసీక నెఱుఁగవు గాక ! ౫౫ పు.

> సీ. మందార మకరందమాధుర్యమునఁ దేలు
> మధుపంబు వోవునే మదనములకు
> నిర్మలమందాకినీ వీచికలఁదూగు
> రాయంచ సనునే తరంగిణులకు
> లలితరసాలపల్లవ ఖాదియై చొక్కు
> కోయిల సేరునే కుటజములకు
> పూర్ణేందుచంద్రికా స్ఫురితచకోరకం
> బరుగునే సాంద్రనీహారములకు
>
> –భాగవతము.



పండితారాధ్య చరిత్రమును బద్యకావ్యముగా రచించినవాఁ డగుటచే శ్రీనాథుని యితర రచనలలోఁ గూడఁ గొన్ని పద్యభాగములు పలుకుబళ్లు నీతనివి చేరినవి. 'పాక మింతయు వృథాపాకంబుచేసె – ఆవగింజంతబూది మైనలఁది కొనిన । వెలఁది గుమ్మడికాయంత వెట్టివుట్టు ' ఇత్యాదులు –

## పరివర్తనముల తీరు

ఈ బసవపురాణమును బద్యకృతిగా రచించిన పిడుపర్తి బసవన కడునేర్పరి. ఆతఁడు ద్విపదలను నిపుణముగాఁ బద్యములం దట్లే పొందించి నాఁడు. ఈ గ్రంథమున కది కొన్నిపట్టులఁ డిప్పణిగాఁ గూడ నుపయుక్త మగును. కాని, యా రచనము చాల సంగ్రహముగా నున్నది. కొన్నిపట్టు లాతఁ డర్థముకాక విడిచినాఁడు. భీమకవి కన్నడింపు మిగుల నెన్నఁదగినదిగా నున్నది. ఆతఁడు దీనిని తూ–చ– తప్పకుండ ముక్కకు ముక్కగాఁ గన్నడించి నాఁడు. కొన్ని పట్టులనించుక పెంచినట్లును గానవచ్చును. మిక్కిలి చిక్కుగా దుర్‌జ్ఞేయములుగానున్న పట్టులు గొన్ని యా కన్నడకృతిద్వారమునఁ దెలిసికొన నా కనువు పడెను. శబ్దరత్నాకరాదులలోఁ గానిరాని యనేకాపూర్వశబ్దములకుఁ గన్నడ కృతి తోడ్పాటున నేనర్థము గ్రహింపఁగల్గితిని. ఈ తెల్గుకృతి కది ప్రశస్తమయిన టీకయనఁదగును.

# రచనా సౌందర్యము

మన సోమనాథుని రచన మసాధారణ సౌందర్యము గల్గియున్నదనుట యతిశయోక్తిగాదు. ఛందస్సు, భాష, విషయము మూఁడును దేశీయములే యగుటయు, కవి శివతత్త్వానుభవమున నోలలాడుచుఁ దన్మయుఁడై కవితావేశము వొందియుండుటయు నట్టి యసాధారణ సౌందర్యమునకుఁ గారణములు.

వడిఁబాఱు జలమున కొడలెల్లఁగాళ్లు
పడిఁగాలు చిచ్చున కొడలెల్ల నోళ్లు
వడివీచుగాడ్పున కొడలెల్లఁ దలలు
వడిఁజేయు బసవన కొడలెల్ల భక్తి.

అని బసవనిఁగూర్చి సోమనాథుఁడు భావప్లుతములుగాఁ బలికిన పలుకులు స్వవిషయమునఁగూడ సమన్వితము లయ్యెను. ప్రతిపదమునను శివభక్తి పరవశుఁడై యుండి సోమనాథుఁడు గ్రంథముల రచియించెను. ముగ్ధభక్తుల కథలు మొదలగు వానిలోఁ గొన్ని పట్టులు చదువునప్పుడు మనసు ద్రవించితీఱును. బెజ్జమహాదేవి కథయు గొడగూచి కథయుఁ గన్నప్పని కథయు జదువునప్పుడు నేను బెక్కు తడవలు కరఁగితిని. మాయమర్మలు లేని విశుద్ధముగ్ధభక్తిని బ్రకటించుటలో సోమనాథుఁడక్కడ మధురమధురములయిన జానుఁదెనుఁగుఁ బలుకుల జాలువార్చి ముద్దులు గురిపించెను. శబ్దాలంకారములకయి, యర్థాలంకారముల కయి, సోమనాథుఁ డెక్కడను బాధపడలేదు. తనకుఁ దెలియక యప్రయత్నముగాఁ బొందుపడినవే కాని యాలంకారికులు పేర్కొన్న కావ్యగుణముల ననుధ్యానించి పనిపూని చొప్పించినట్టు కన్పట్టుపట్టు లీ గ్రంథమున నెక్కడను గానరావు. సులువుగా రచింపఁదగిన ద్విపద మగుటచే సోమనాథుని చూపు కథాకల్పనమందును, విషయవిన్యాసమందును భావ ప్రపంచమందును బరుగులువాఱినదే కాని, యతిప్రాసచ్ఛందోభాషా బంధములందుఁ జిక్కుకొని యెక్కడను ద్రొక్కటపడలేదు. అట్లు పరుగువాఱుటలోఁ బెక్కుపట్టులందీతఁడు పాఠకుఁడు సరిగాఁ దన్నువెన్నాడఁగలఁడా యనికూడఁ జూడఁబోఁడయ్యెను. పదులకొలఁది ద్విపదలుగడచినను బయికిఁబయికి వాక్యము పొడుగువాఱుచు సాగుచుండుటే



కాని ముగియకుండుట నీ గ్రంథమునఁ బెక్కుపట్టులఁ జూడఁగలము. అట్టు ముగియకుండుటలోఁ గర్తృపదము రెండుమూఁడు తడవలు గూడ మరల మరలఁ గానవచ్చుచుండును. ఇట్టి యిక్కట్టు పండితారాధ్యచరిత్ర మున మఱింతగలదు.

శివభక్తిస్మరణము వచ్చినప్పు డీతఁ డొడలు మఱచును.

"పొరి మజ్జనోదకంబులకట మున్న
పరముపై నానందబాష్పముల్ దొరుగఁ
బూజించు నవపుష్పరాజికి మున్న
రాజాంకుపై హృత్సరోజంబు విరియ
ధూపవాసనకు మున్ ధూర్జటి మ్రోల
వ్యాపితాంతర్గతవాసన దనర
వెలుగు నీరాజనంబుల కటమున్న
మలహరునంద యాత్మజ్యోతి ప్రబల
వినివేదితపదార్థవితతికి మున్న
తన ప్రాణపద మీశ్వరున కర్పితముగ
లింగార్చనము దాను బొంగి చేయుచును
నంగచేష్టలకు నంతంతఁ బాయుచును
సుభగలింగముఁ జూచి చూచి క్రాలుచును
నభవామృతం బాని యాని వ్రాలుచును
సురుచిరోక్తుల సోలిసోలి పాడుచును
స్థిరసుఖాంబుధిఁ దేలి తేలి యాడుచును
మంగళోన్నత బహిరంగంబు నంత
రంగంబుఁ దన ప్రాణలింగస్థ మగుచు."

మఱియు,

"పరగు చతుర్వర్గఫలము లాదిగను
వరసుతు నడుగుము వాంఛితార్థమ్ము
లనవుడు మందస్మితాననుండగుచు
ననుషక్తి ముకుళితహస్తుఁడై మ్రొక్కి

యెఱుఁగ మోక్షముల పేరెఱుఁగ వాంఛితము
లెఱుఁగవేఁడెడు మార్గమెఱుఁగ నేమియును
నెఱుఁగుదు నెఱుఁగుదు నెఱుఁగుదు మఱియు
మఱియును మఱియు ముమ్మాటికి నిన్నె
కావునఁ గోరికకడమయుఁగలదె
దేవమూల స్తంభ దివ్య లింగాంగ
నీయతులిత దయాన్విత దృష్టి యిట్లు
నాయందు నాఁటి కొనలు పసరింప
నాదగు సంస్పృహాపాదితదృష్టి
నీ దృష్టిలోనన నెక్కొని పొదలఁ
గరుణింపు దక్కినవరము లే నొల్లఁ
బరమాత్మయని విన్నపంబాచరింప. పు.౮౦

మఱియును,

"బాపురే నిర్వాణి ! బాపురే తపసి!
బాపురే బాపురే కోప పుంజంబ !
పాపంబుఁ బొందెడు కోపించువాఁడు
పాపిగా కేనేల పాపి నయ్యెదను
స్థలియించు కోపాగ్ని కణములఁజేసి
కలఁగదే మానసఘన సరోవరము
ఎసఁగెడు కోపాగ్ని నింకదే చెపుమ
మసలక హృదయాబ్జమకరందధార
వెలువడు కోపాగ్ని వేఁడిమిఁజేసి
నలఁగదే సచ్చిదానందపద్మంబు
జ్ఞానంబు సొంపొ? విచారంబు పెంపొ?
ధ్యానంబు ఫలమొ ? యీ తామస గుణము !
నాకేమి సెప్పెద వీకాననమున
లేకున్నవే చెట్లు నీకుఁ గూర్చుండ
నిట్టి శాంతాత్మకు లెచ్చోటఁగలరు !
పుట్టుదురే నినుఁబోల సంయములు !



వఱదవోవు నెలుఁగు గొఱుపడం బనుచు
నెఱుఁగక యీఁత కాఁ డేఁగిపట్టుదును
వడిఁ బాఱునెలుఁ గంత వానినిపట్టఁ
గడనున్నవాఁ 'డోరి ! విడువిడు' మనుడు
'విడిచితి నది దన్ను విడువ' దన్నట్టి
వడువున విడిచిన విడుచునే మాయ
పొంగి చిచ్చుఱకంగఁ బోవుచుఁ జీర
కొం గోసరించు పెన్వెంగలియట్ల
చెల్లుఁ బొమ్మని సన్న్యసింపఁ బోవుచును
నిల్లప్పగించు నయ్యిబ్బందియట్ల
పదపడి నూతిలోఁ బడఁబోయి తాప
వెదకుచు మెట్టెడి వీఱిఁడి యట్ల
జ్ఞానాత్ముఁడై సర్వసంగముల్ విడిచి
తా నాశ్రయముఁగోరు తపసిచందమున
నిల మరు ల్వోయె రోఁకలిగొనిరండు
తలఁ జుట్టుకొనియెదఁ దా నన్నయట్లు
పానలేల చెఱకుపందెమం దొక్క
యీనె సిక్కిన నోడుటేకాదె తలఁప
రోసి సంసారంబుఁబాసి యొక్కింత
యాసించెనేనియు నది వెల్తి గాదె?"

ఇక్కడ 'కోపగర్హ' ను బలుదెఱఁగులఁ బ్రపంచించి కోపిని సిగ్గునఁ గూరునట్లు చేసినాఁడు. భావోద్రేకముగలపట్టు లిట్టివీ గ్రంథమునఁ బెక్కులు గలవు. కవిత్వ రచనాశౌండీర్య మిట్టిది పండితారాధ్యచరిత్రమం దింక నెక్కుడుగా నిండారి పండఁబాఱి యున్నది. అది యపూర్వము లగు ప్రయోగములకు, శబ్దములకు, విషయములకు, గనియ. ఆకాలపు టాంధ్రదేశ ప్రజాచరిత్రమున నది యనేక విషయములఁ దెలుపుచున్నది. ద్విపదలు జడవాఱి పొడుగులై సాగియుండుటచే నది యన్వయక్లేశమునఁగూడ దీనిని మీఱియున్నది. ఆ గ్రంథమునుండి యెత్తిచూపవలసిన యపూర్వవిషయము లనేకములు గలవు. విస్తరభీతిచే నిక్కడ విడిచితిని.

## ముద్రణ విధానము

ఏలూరిలోఁ గందుకూరివారు బసవపురాణమును జాగ్రత్తతోఁ బ్రకటిం చిరి. దాని నాధారముగాఁ గొని ప్రాచ్యలిఖితపుస్తకశాలలో సి.పి. బ్రౌనుదొర గారు సేకరించిన ప్రతులలోని పాఠములను దోడుచేసికొని యీ ముద్రణము సాగించితిమి. శ్రీ గిడుగు వెంకటరామమూర్తి పంతులుగా రొకతాళపత్ర ప్రతి నొసఁగిరి. ముద్రణ సమయమునఁ గ్వాచిత్కముగా దానిని గూడఁ దోడుచేసికొంటిని. భీమకవి కన్నడకృతియుఁ, బిడుపర్తి [1] బసవన పద్య బసవపురాణమును నాకు మిక్కిలిగా నుపకరించినవి. కన్నడ బసవపురాణము తీరు తిన్నన లేని ప్రాఁతకాలపు రోఁతయచ్చులో నుండుటచేఁ బ్రతిపదము దానిని బరికించుట యసాధ్యమయ్యెను. ఆవశ్యకము గల్గినపట్టులమాత్రమే దానిఁ జూడఁగల్గితిని అది సుముద్రణమున నుండెనేని నాకింక నెన్నో యపూర్వ విషయములు తెలియఁ దగియఁదగియుండెడి వని నమ్ముచున్నాఁడను. ముద్రితమైన సంస్కృత బసవపురాణము నిష్ప్రయోజనమే. అది మిక్కిలి సంక్షిప్త మైనది. కొందఱు భక్తుల పేళ్ళు మొదలగువాని నొకవిధముగా దానినిబట్టి నిర్ణయించుకొంటిని. అఱువత్తుమూవుర పేళ్ళు, ద్రవిడ కర్ణాటాంధ్రసంస్కృత గ్రంథములలో భిన్నభిన్న రీతులతో నున్నవి. తాళపత్రప్రతులలోని పాఠములను సాహసించి సంస్కరింపరాదనుతలఁపుతో నుండుటచేతను, నవి యిదమిత్థమని నిర్ణయింపఁ గుదురనివై యుండుట చేతను నక్కడక్కడ మిక్కిలి త్రొక్కటపడితిని. తొలుత నీ గ్రంథమును భాషాతత్త్వపారంగతులగు శ్రీ గిడుగు వెంకటరామ మూర్తిపంతులుగారును నేనును గలసి పరిశోధింపఁ దలఁచుకొంటిమి. కాని, వారు సుదూరదేశమున నుండుటచే నట్లు ఘటింపదయ్యెను. ఈ ముద్రణమున దొరలిన దోషములతో నాకే కాని వారికి సంబంధము లేదు. వారి తోడ్పాటుండి నచో నింకను నిది గుణోత్తరముగా సాగియుండెడి దనుకొనెదను.

---

1 పద్య బసవపురాణకర్త పిడుపర్తి సోమనాథుఁడని కవుల చరిత్రము మొదలగు గ్రంథములు పేర్కొన్నవి. ఆ గ్రంథమున గద్యములందుఁగూడ నట్లే కాననగును. కాని, కృత్యవతరణికలోఁ జూడఁగాఁ దత్కర్త పిడుపర్తి బసవనయని యేర్పడును. పరిశోధించియే నేనీమార్పును జేసితిని. గద్యములందు సోమనాథుఁడని యుండుటకుం గారణము మృగ్యము.



## కృతజ్ఞత

దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు తాళపత్ర ప్రతులపాఠములను సేకరించుటలో మిక్కిలి వ్యయమునకుఁ బాల్పడిరి. మఱియు నేను దఱచుగా మద్రాసులో నుండకపోవుట మొదలగు కారణములచే గ్రంథముద్రణమునకుఁ జాలఁగాలము పట్టినను సైఁచిరి. ఆంధ్రదేశోపకార కార్యము లెన్నేని వారి హస్తముననుండి యవతరించుచున్నవి. 'ఉదార చరితానాం తు వసుధైవ కుటుంబకమ్' అన్నసూక్తికిఁ దార్కాణమైనవారు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు చెన్నపురి చిత్రవస్తు ప్రదర్శనశాలలో సేకరమైయున్న శైవాచార్య శిలాచిత్రమునకుఁ జక్కఁగాఁ బ్రతిబింబము నెత్తియిచ్చిరి. మైసూరు వాస్తవ్యులగు శ్రీ బి. బసవారాధ్య బి. యె.బి.యెల్. గారు బసవపురాణము మొదలగు కర్ణాట గ్రంథముల నేతద్ గ్రంథముద్రణము ముగియుదాఁక మాకెరవుగా నొసఁగి యెంతయు నుపకరించిరి. భారతీ కార్యనిర్వాహకులును, నందును, శ్రీ గన్నవరపు సుబ్బరామయ్యగారును, ఆంధ్ర పత్రికా ముద్రణాలయమున ముద్రణాధికృత ముఖ్యుఁడగు నావుల పార్థసారథినాయఁడు గారును, ముద్రణమున సౌకర్యముగూర్చిరి. వీరికెల్ల గడుఁ గృతజ్ఞుఁడను. పీఠికారచనాదులలోఁ గర్ణాటకవి చరిత్రము రెండు సంపుట ములును, ఫ్లీటుదొరగారి బొంబై గెజిటియరును, నాకుఁ బెక్కు విషయముల నెఱిఁగించినవి. అందులకుఁ దత్కర్తలయెడఁ గృతజ్ఞుఁడను.

అనేక పాఠభేదములవలని యలజడియుఁ దెకతెంపులేక యేకధారగా నున్న ద్విపదల దీర్ఘగతియు నాయపరిజ్ఞానమును గారణములుకాఁగా నక్కడక్కడ తప్పులు దొరలినవి. వానిని పరిశోధన పత్రమునఁ జేర్చితిని. పునర్ముద్రణమున దిద్దుకొందును. ఇంకను నాకంటి కందనివి యుండవచ్చును. ఎఱిఁగినవారు దెలిపినచో దిద్దుకొందును. ప్రాజ్ఞులకు మ్రొక్కుచున్నాను.

ప్రభవ
వ్యాసపూర్ణిమ.
మదరాసు.

విద్వద్విధేయుఁడు,
వేటూరి ప్రభాకరశాస్త్రి

" ఇది పాలకురికి సోమన
విదితకృతి ప్రభాకరుండు వేటూరి కొల
మ్మొదివియ చక్కని పీఠిక
పొదిగించి పరిష్కరించెఁబోఁ దెనుఁగొలయన్"

– త్రిశూలము నాంది నుండి :
కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ



బసవపురాణ పీఠికలో ప్రభాకరులు గుర్తించిన

# కొన్ని మార్పులు - సూచనలు

**పుట - పంక్తి**

219 –21 కేరళ ద్రవిళదేశముల నుండి (కేరళమున నుండి )

220 –21 (వీరి యుద్భోధ... నిలుపబడిరి)
ఇది యప్రామాణిక మనుకొందును.

243–10 మూఁతి –మూంది, మూంజి, (అ) ; తెల్గున 'మూఁతి' లో అరసున్న ఉన్నది.
ఊదిమట్టిన పాదయుగముచే బయలు (ఊఁదు)
పాదైన ధరణిలోపలి శేషుఁడులుకు.

రథంబు। మీఁదఁ గూర్చుండఁబడియెఁ జేయూదికొనుచు – భీష్మ 1–188.

256 –28 ప్రథమ మీఁది గసడదవ గూర్చి – కవి చింతామణి చూ.వికట శ్రుతి లేనిచోట్ల ఉండునన్నాడు.

259 –23 క. ఆఁకరముతోడ నప్పెను
మూఁకలపై కుతికి కఠిన ముష్టినిహతులన్
మ్రాఁకులను శిలలఁ బీనుఁగు
ప్రోఁకలు గావించిరపుడు పొడవడఁగ వడిన్
రా. యు. కాం.

260 –20 మూపు – అరసున్నలేదు. రంగనాథరామాయణము. తాచు– అరసున్న లేదు. "తాచినఁ దోన బిట్టొడిసి తత్పదయుగ్మము –వీచి– వైచె" హరి. పూ. భా. 7–85, మఱియు పూచిన, ఏచిన–తాచు వనదేవతలచరణాచలితములైన యందియల మ్రోఁతయనన్ – నృసింహపురా ణము. 2 ఆ. 70ప.

269 –9 యభ్యంజ (?) నవనాచరిసు – (యభ్యంగనవనాచరిసు) నెపము 16 పు. చూ. ( పూ. ము. నెపమునఁ గనుమూసి

నిద్రఁబొందుడును – నువిదకు గలవోలెమక్షవల్లభుఁడు) ప.వ
ప్రాసవిషయమున చూ.
తాప. అరసున్న లేనట్టున్నది. తాచులో లేదు.

274 -1 జరగడుగు – సూర్యరాయవారు గ్రహింపరయిరి.

274 -24 పణత, పడఁత – శ.ర. హనువు అని శ్రీనాథ ప్రయోగం సరిగాదు. పణె= నెత్తి/ఫాలము; కణతవలె పణత, పణెతలె నుండి ఏర్పడి యుండును. పణత అనఁగా ఫాలము అర్థము. శ్రీనాథ ప్రయోగమునకు సరిపడును.

274 -28 కోరబెడంగనో – బసవ – గొడగూచికథ
బెడంగు+ అని+ ఓ కాదు. బెడంగను+ఓ
బెడగు= కడుగు. శుభ్రపఱుచు.
తెలుపెక్కగఱవోవ బెళగిన పునుకమించిన వెండికోరగాఁ జేతఁ బట్టి (తాళ్లపొద్దుటూరు శాసనము) ఇందు బెళగిన నిరనుస్వారముగా నున్నది.
బెడంగనో= శుభ్రపఱుపనో– ఇక్కడ బెడంగు పూర్ణాను స్వారముతో నున్నది. "కోరను బెళ(డ) గనో" అని యుండునా? లేక శాసనమున సున్న ఉన్నదా?
(శాస్త్రిగారి నోట్సు నుండి)

276 -8 అడబాళ్లు ?

276 -23 పణ్ణిదమదాంధగంధసింధురంగళ్ మేతి– విక్రమార్జున విజయము. 3-48 పణ్ణు – సజ్జీకరణే – పణ్ణిదజాత్యశ్వరథా శ్వసంకుళ 10-31

278 - 23 సోడంబు –నాసాస్థి

## బసవ. పూర్వముద్రణము

పు. 40 దివ్యామృతంబుఁ దివుటఁ దాలించి – తాలించు = తాలింపువెట్టు.

పు. 62 బాలరుద్రమ యొత్తుపట్టఁగవాళ – ఒత్తుపట్టఁగ =సుతిపోయఁగా



పు. 73 యడమ మంటపమును నతివిపైనయది – అతివి = శిథిలము
చూ. కాశీఖండము

పు. 73, 79. బెనసి తమ్మళి భజించిన చొప్పులేదు –తిమ్మళి– ఈ నాటికే తమ్మళ్లు ఏర్పడిరి.

పు. 79 ఎక్కుడు గోద నిన్నిక్కడ వైచి – ఎక్కుడు గో(ఁ?) డ

పు. 108 పక్షికిఁ దొడనేల పాశుపతంబు – కుమారసంభవము 'బలిమిఁ బిట్ట కలిగి పాశుపతము దొడుగనేల 1. ఆ.

పు. 134 కడమల నంబికథ – అరవంలో చూడవలెను.

పు. 145 ఇగ మెడ దునిమెద విది యేమి పుట్టె – జగములలో ....ఇఁగకాదు.

పు 149 ప్రస్పియెంతయును శ్రవంపడి యిట్లు –రంగానాథ రామాయణము నను శ్రవము – ఉన్నది.

పు. 152 పద్య బసవపురాణములో 'అర్ఘ్యపాద్యములు ' అని ఉన్నది.

పు. 161 కంపరంబవనిపై దింపించి మహిమ–కంపరము=

పు. 176 పొఱటి పాండ్యేశుడు వొలుపారమున్ను పొఱడువోయిన వీఁపుపొఱడుమానుటయు. } పొఱడు=గూను

పు. 178 సడిసన్నలెఱుఁగవే జైనకష్టుండ – సడిసన్నలు=

పు. 115
179 తమదాసియర్ఘ్యపణ్యములకుఁబోవు – పద్యబసవపురాణము.
210 303 పు. చూ. అర్ఘ్యపణ్యములు –నీళ్లు
241

పు. 226 యొత్తుడుఁ బింజించి యుడువీథిఁదాఁకి –పింజించు =

పు. 230 జాలిఁబడి కనక సాములు దమక –
వేలిచికొన్న యా విధమగుఁదమకుఁ
బగవారిబిడ్డల నగవులఁ జంపు –
పగిదిఁ జేసిన బో(?) దు బసవన మంత్రి.

కనకన బేళ్వెతగుల్దుదు
కనకన నెంబొందు మాత ధరగెనయె, సుయో
ధనన పురోహితనప్పా
కనకస్వామియనె మునిదు కృత్తిగె తిందళ్.
విక్రమార్జున విజయము 8-44

పు. 234 గొట్టరువులవారిc గుంచెలవారి
గొట్టుబోయల నాలవట్టాలవారి - గట్టుబోయల?
త్రాటc గట్టు బోయ - పాండురంగ మాహాత్మ్యము.

పు. 228 బసవమతము క్రొత్తది అనుటకు ;

... నిర్మలశివులును నిష్కల శివులు
మొదలుగాcగల శైవముఖ్యులందఱును
నిదియేమి మతములో యెఱుcగంగరాదు
బసవయ్యతోయంపు భక్తులc జూచి
వసుధc దారును లింగవంతులమనుచు
దొడcగి ప్రసాదంబుc గుడుచుచున్నారు....
నిప్పురి వీరమాహేశ్వరులనcగ
నిప్పుడేలా చెల్లనిచ్చెదమనుచు
బసవయ్య యంత్రముల్వన్నుటc జేసి
పొసపరి మాతోడc బోరుచున్నారు.

(ఆంధ్రగ్రంథమాలలో ద్వితీయకుసుమముగా వెలువడిన బసవపురాణమునకు పరిష్కర్తలైన శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు కూర్చిన పీఠిక యిది. ప్రకాశకులు శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు. తొలి ముద్రణము 1926. 1948 -50 ప్రాంతములలో శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు బసవపురాణము పునర్ముద్రించునపుడు చేయదలచిన మార్పులను కూర్పులను మార్జినల్ నోట్సులో కొంత సూచించియున్నారు. ఆంధ్రగ్రంథమాలవా రీ గ్రంథమును పునర్ముద్రించునపుడు గ్రంథ ( మూల) మున శాస్త్రిగారు గావింపదలచిన సంస్కారములను వారి పర్యవేక్షణముననే వారి శిష్యులు శ్రీ తిమ్మావజ్ఝల



కోదండరామయ్యగారు మద్రాసులో నుండి నిర్వహించిరి. కాని దుర్విధికారణమున బసవపురాణము పునర్ముద్రణము తుది దాకక మునుపే ప్రభాకరులస్తమించిరి. లేనిచో వారే తమపీఠికలో చేయదలచిన మార్పులను కూర్పులను జేర్చి దానిని క్రొత్తగా వెలయించియుండెడివారు. అది జరుగలేదు. ఆంధ్రగ్రంథమాల వారి బసవపురాణము మలికూర్పున శాస్త్రిగారి యీ పీఠికయు తదుపరి ముద్రింపబడలేదు. దాని స్థానమున శ్రీ నిడుదవోలు వేంకటరావుగారి పీఠిక క్రొత్తగా చేరినది.

శాస్త్రిగారి బ. పు. తొలి ముద్రణమునందలి పీఠిక నిందు చేర్చి యెడనెడ వారందు గావించి యుండిన సంస్కారములను అనుబంధముగా మేమిక్కడ చేర్చినాము - (ప్రకాశకులు)

(పీఠిక తొలి ముద్రణము 1926 )

# బసవోదాహరణము

(తొలిపలుకు)

పాల్కురికి సోమనాథకవీశ్వర ప్రణీతములయిన తెల్గు గ్రంథములలో నేఁటి చరిత్ర పరిశోధనకు లింతదాఁక దీనిఁ దాఁకలేదు. బసవపురాణ పీఠికలో నేను దీని యాద్యంతములఁ జూపితిని. సంబోధనముతో నెన్మిదియగు విభక్తులతో నెన్మిది పద్యములును, కళికలును, నుత్కళికలును నెల్లవిభక్తులతోఁ గడపటి పద్యమును గల స్తుతిప్రశంసాపర మయిన గ్రంథమున కుదాహరణ మని పేరు. సంస్కృతాంధ్ర కావ్యలక్షణకారులు దీని లక్షణమును నిర్వచించిరి. తెలుఁగునఁ గల యుదాహరణములలోని కెల్ల నిదియే ప్రాచీన మయినది. రావిపాటి త్రిపురాంతకుని త్రిపురాంతకోదాహరణము దీనికంటెఁ దర్వాతి దయినను, దీనికంటె హృద్యతరము. ఇందుఁ గడపటి పద్యమున సప్తమీ విభక్త్యంత పదము బసవవాచకముగా లేదు. 'నీ యందు' అని యా పద్యమునఁ జేర్పఁ గుదురదు. పద్యపాఠము సరిగాదేమో! చతుర్థీవిభక్తిరూపము లిందుఁ బర్యాలోచింపఁదగినవి. ప్రాంతకాలపుఁ దెల్గుకృతి గాన యభిమానమున దీనిని బ్రకటించితిని. సంస్కృత కర్ణాట భాషలలో నీ కవి రచియించిన లఘుకృతులను శ్రీ బండారు తమ్మయ్యగారు ప్రకటింపఁ దలంపుగొన్నట్లు నాకుఁ దెలిపిరి. అట్లు వారు ప్రకటించినచో సోమనాథుని కృతులెల్ల వెల్లడియయిన ట్లగును.

(భారతి –ఫిబ్రవరి 1928. ప్రభవ సంవత్సర మాఖమాస భారతి నుండి పునర్ముద్రితమైన లఘుకృతి కిది వేటూరివారు కూర్చిన తొలిపలుకు – ప్రకాశకులు )

# నీతి ద్విషష్టిక – ఉపోద్ఘాతము

'నీతి ద్విషష్టిక' అనే ఈ కృతి సుందరపాండ్యుడు రచించి నట్లు మొదటి శ్లోకం ద్వారాను, చివరి శ్లోకం ద్వారాను, గ్రంథాంతంలో ఉన్న పుష్పిక ద్వారానూ తెలుస్తూన్నది. పాండ్యదేశానికి రాజధానియైన మధురలో వెలసి ఉన్న పరమేశ్వరుని పేరు సుందరపాండ్యస్వామి అనే విషయం ప్రసిద్ధమే. ఆ పరమేశ్వరుని అనుగ్రహానికి చిహ్నంగా ఆ దేశంలోని రాజులు తదితరులూ కూడా ఆ పేరు పెట్టుకొనేవారు. ప్రాచీన పాండ్యరాజులలో సుందరపాండ్యుడు అనే పేరు కలవారు ఎంతోమంది ఉన్నట్లుగా ఐతిహాసికులు చెపుతున్నారు. శాసనాదులలో పేర్కొన్న రాజులైన సుందరపాండ్యులు చాల మంది ఉంటూండగా, గ్రంథకారులైన ఎంతో మంది సుందరపాండ్యులు కూడా ఉన్నారు. ఇంతవరకూ గ్రంథపరిశీలకు లెవ్వరూ గుర్తించని ఒక గొప్ప మీమాంసా పండితుడైన సుందరపాండ్యుని గూర్చి మహామహోపాధ్యాయ యస్. కుప్పుస్వామి శాస్త్రిగారు ఇదం ప్రథమంగా తెలిపి ఉన్నారు. 1 శ్రీ శంకర భగవత్పాదులు, ఈ సుందరపాండ్యుడు రచించిన ఏదో గ్రంథంలో ఉన్న రెండు కారికలను, సమన్వయాధికరణం చివర ఉదాహరించారు. ఐతే ఈతని పేరు నిర్దేశించలేదు. భగవత్పాదులు సుందరపాండ్యుని పేరు చెప్పకపోయినా, వారి కంటె అర్వాచీనులు, మనకంటె చాలా ప్రాచీనులూ అయిన కొందరు అద్వైత విద్యాచార్యులు ఈ కారికలను ఉదాహరించి, ఇవి సుందరపాండ్య విరచితములని చెప్పి ఉన్నారు. ఇలా చెప్పినవారు – పంచపాదికా వివరణానికి వ్యాఖ్య యైన 'ప్రబోధపరిశోధిని' రచించిన ఆత్మరూపాచార్యులు, సూతసంహితకు వ్యాఖ్యానం వ్రాసిన మాధవాచార్యులు. అమలానందుడు బ్రహ్మసూత్రభాష్యవ్యాఖ్యలో (3–3–25 ) "ఆహ చాత్ర నిదర్శనమాచార్యసున్దరపాణ్డ్యః" (ఇందుకు నిదర్శనంగా సుందరపాండ్యుడు

---

* ఇది 1928 వ సంవత్సరములో శ్రీ కే. మార్కండేయశర్మగారు ప్రచురించిన నీతిద్విషష్టికకు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు సంస్కృతంలో వ్రాసిన భూమికకు హైదరాబాదు సురభారతీ సాంస్కృతిక గ్రంథమాల సంపాదకులైన డా॥ పుల్లెల శ్రీ రామచంద్రుడు గారు కావించిన తెనుగుసేత.

1. See journal of Oriental Research, March Qratrerly, Vol.1. No.1. January 1927. Pages 5-15.

ఇట్లు చెప్పుచున్నాడు.) అని అంటూ కొన్నికారికలు ఉదాహరించినాడు. తంత్రవార్తికంలోని బలాబలాధికరణంలో, కుమారిలభట్టుకూడా, ఈ కారికలనే ఉదాహరించి ఉన్నారు. దీనిని బట్టి మీమాంసాగ్రంథకారుడైన ఒక సుందర పాండ్యుడు శంకరాచార్యులకంటె, కుమారిలభట్టుకంటె కూడా పూర్వం ఉండేవాడని తెలుస్తూన్నది. అందుచేత ఈ సుందరపాండ్యుడు క్రీ. శ. సప్తమ శతాబ్దికి పూర్వం ఉండేవాడనే విషయం స్పష్టం అవుతున్నది.

కేరళదేశీయు డైన కృష్ణలీలాశుకముని, తను రచించిన "పురుషకారము" అనే వ్యాకరణగ్రంథంలో, ఒక సుందరపాండ్యుని పేర్కొంటూ ఆతని వాక్యం అన్నట్లుగా – "నిక్షతి చుమ్బతి నింస్తే తన్వ్యా ముఖపఙ్కజం ప్రేయాన్" అనే శ్లోకార్ధాన్ని ఉదాహరించాడు. కృష్ణలీలాశుకముని – రాజరాజ చోళుని గురువూ, "ఈశానశివగురుదేవపద్ధతి" అనే గ్రంథం రచించినవాడూ అయిన ఈశానదేవునికి శిష్యుడు. ఈశానదేవుడు తన "పద్ధతి"లోను, కృష్ణలీలాశుకుడు 'పురుషకారం' లోను భోజుని గ్రంథాలను పేర్కొన్నారు. అందుచేత వీరిద్దరూ క్రీ. శ. పన్నెండవ శతాబ్దిలో ఉండి ఉంటారు. ఈ విధంగా 'పురుషకారం' లో పేర్కొన్న సుందరపాండ్యుడు క్రీ. శ. పన్నెండవ శతాబ్దానికి పూర్వమే ఉండి ఉండాలని తెలుస్తూన్నది.

ఐతే ఇక్కడ ఒక చిక్కు ఉన్నది. "నిక్షతి చుంబతి" ఇత్యాది శ్లోకార్థం సుందరపాండ్యవిరచితం అన్నట్లుగా 'పురుషకారం'లో చెప్పబడినా, ఇది వీరపాండ్య విరచితంగా ప్రసిద్ధమూ ముద్రితమూ అయిన క్రియా నిఘంటువులో కనబడుతున్నది. ఆ గ్రంథప్రారంభం ఈ విధంగా ఉన్నది :–

> "తిజన్తరూపపర్యాయాః కేచిత్కావ్యోపయోగినః
> వీరపాణ్డ్యక్షితీశేన వక్ష్యన్తే శిక్షితుం శిశూన్."

ఈ విధంగా ప్రారంభించిన గ్రంథంలో –

> "కక్షతి కఖతి ప్రహసతి గగ్ఘతి ఘగ్ఘతి చ తక్కతి స్మయతే.
> నిక్షతిచుమ్బతి నింస్తే తన్వ్యా ముఖపఙ్కజం ప్రేయాన్."

అనే శ్లోకం ఉన్నది. ద్వాదశ శతాబ్దిలో ఉన్న లీలాశుకుని వాక్యమే



ప్రమాణం అని అంగీకరించిన పక్షంలో, వీరపాండ్యుని పేరు ఉన్న క్రియా నిఘంటు ప్రారంభశ్లోకం ప్రక్షిప్తమనేనా అనాలి ; లేదా ఇది అపపాఠ మనేనా అనాలి. ఐతే – క్రియానిఘంటువు క్రమబద్ధంగా ఉండడంచేతనూ, వీరపాండ్యుని పేరు శ్లోకనిబద్ధమై ఉండడం చేతనూ ఈ ముద్రితగ్రంథమే ప్రామాణిక మని అంగీకరించడం యుక్తం అని మా అభిప్రాయం. 'పురుషకారం'లో కూడా వీరపాండ్యుడనే వ్రాసినా, మీమాంసాపండితుడైన సుందరపాండ్యు డొకడు ప్రసిద్ధుడుగా ఉండడంచేత, లేఖకుడు వీరపాండ్యునికి బదులు సుందరపాండ్యుని పేరు చేర్చి ఉంటాడని ఊహించడానికి కూడా అవకాశం లేకపోలేదు. ఏమైన ఈతడు సుందరపాండ్యుడా తద్భిన్నుడా అనే సందేహం అలాగే ఉండిపోతున్నది.

ఈ నీతిద్విషష్టిక రచించిన కవి సుందరపాండ్యులలో ఒకడు. సుభాషిత సంకలనకర్తలు చాలామంది ఈతని శ్లోకాలు సేకరించారు. వల్లభ దేవుడు ఈ కృతిలోనుంచి చాలా ఆర్యలను తన "సుభాషితావళి" లోనికి గ్రహించాడు. ఐతే– ఇతడు శ్రుతానుశ్రవికమీదనే (వినికిడి) మీదనే ఈ ఆర్యలను గ్రహించాడు. అసలు గ్రంథాన్ని చూచినట్లు లేదు. ఇందులోని ఆర్యలను కొన్నింటిని ప్రకాశవర్షుడివనీ, కొన్ని రవిగుప్తునివనీ, కొన్ని అమృతవర్ధనుడి వనీ, ఏవేవో క్రొత్తపేర్లన్నీ కల్పించి వారికి అంటకట్టి ఉన్నాడు. వల్లభదేవుడు ప్రసిద్ధులవో, అప్రసిద్ధులవో ఎవరో కొందరు కవుల పేర్లు కల్పించి, వారు రచించినట్లుగా ఉదాహరించిన శ్లోకాలు తద్భిన్నులైన కవులు రచించిన కొన్ని కావ్యాలలో లభించడం పండిత లోకానికి తెలిసిన విషయమే. చాలామంది సుభాషిత సంకలన కర్తలు ఇలాగే కనిపిస్తున్నారు. జల్హణుడు కూడా "సూక్తిముక్తావళి"లో ఈ ఆర్యలను ఈ విధంగానే గ్రహించి రవిగుప్తుడు మొదలైన వాళ్ళని రచయితలుగా పేర్కొన్నాడు. శార్ఙ్గధరుడు కూడా అంతే. ఒక్క ఆర్యను తీసుకొని, ఈ ముగ్గురూ ముగ్గురు వేర్వేరు కవులకు దానిని సంబంధింపచేశారు. పోతయార్యుడు "ప్రసఙ్గరత్నావళి" లోను, పెద్దిభట్టు "సూక్తివారిధి"లోను, రచయిత పేరు చెప్పకుండగా ఈ ఆర్యలను ఉదాహరించారు. సుభాషితసంకలనకర్త లందరూ పదమూడవ శతాబ్దికి పూర్వులు గారు.

జల్హణుడు 257వ సంవత్సరంలో సూక్తిముక్తావళి రచించాడు.

వల్లభదేవుడు 'సుభాషితావళి' ని

శార్‌ఙ్గధరుడు 'పద్ధతిని'ని 1400 సం ప్రాంతంలో రచించారు.

పోతయార్యుడు 'ప్రసఙ్గరత్నావళి'ని 1460 సం.లో రచించాడు.

పెద్దిభట్టు 'సూక్తివారిధి'ని 1500 సం.లో రచించాడు.

వీరిలో ఏ ఒక్కరికీ కూడా ఈ సుందరపాండ్యుని కృతిని గూర్చి తెలియకపోవడం ఆశ్చర్యకరంగానే ఉన్నది. ఐతే వీరి అందరికంటే ప్రాచీనుడైన ఒక పండితునికి ఈ కృతిని గూర్చి యథార్థంగా తెలిసి ఉండడం ముదావహమైన విషయం.

క్రీ. శ. 1200 ప్రాంతంలో కలింగరాజు అనే నామాంతరం గల సూర్యవిబుధుడు "కులశేఖరసూక్తిరత్నహారం " అనే పేరుతో ఒక సుభాషిత సంకలనగ్రంథం గ్రంథించాడు. ఈ ఆర్యలు సుందరపాండ్య రచితాలని ఆతడు ఆ గ్రంథంలో సరిగానే చెప్పి ఉన్నాడు. అందుచేత ఇది సుందరపాండ్యుని కృతి అని చెప్పడంలో తప్పులేదు. అతడు క్రీ.శ. పన్నెండవ శతాబ్దానికి పూర్వుడనే విషయం కూడా స్పష్టం అవుతుంది. ఐతే, ఇదొక చెప్పుకోదగిన విషయంకాదు. ఎందుచేతనంటే ఈ సుందరపాండ్యుడు షష్ఠశతకం కంటె కూడా ప్రాచీనుడని నిరూపించనున్నాము.

ఈ సందర్భంలో గుర్తింపదగిన విషయం ఇది :- పంచతంత్రం రచించిన విష్ణుశర్మ ఆరవ శతాబ్దానికి అర్వాచీనుడు కాదు అని విమర్శకుల అభిప్రాయం. ఆతడు కూడా ఈ గ్రంథం నుంచి కొన్ని ఆర్యలు ( 29, 30, 48 శ్లోకాలు) తీసుకున్నాడు. అందుచేత ఈ సుందరపాండ్యుడు షష్ఠశతకం కంటె ముందుగానే ఉండేవాడని తేలినది.

ఈ గ్రంథానికి చివర ఉన్న -

"ఇమాం కాఞ్చనపీఠస్థాం సమేత్య కవయో భువి
ఆర్యాం సున్దరపాణ్డ్యస్య స్నాపయన్తి వధూమివ"



అనే శ్లోకం కూడా పై నిర్ణయానికి ఉపోద్బలకంగా ఉన్నది. "భూలోకంలో, కవులందరూ కలిసి,, సుందరపాండ్యుని కృతియైన, కాంచన పీఠంపైన ఉన్న ఈ ఆర్యను మధురానగరంలో సుందరపాండ్యుడనే పేరుతో వెలసిన పరమేశ్వరుని వధువైన ఆర్యను వలె, అనగా మీనాక్షీదేవిని వలె, కనకాభిషేకం చేసి పూజిస్తున్నారు " అని ఈ శ్లోకానికి అర్థం క్రీ.శ. ఆరవ శతాబ్దానికి పూర్వంనుంచే, ద్రవిడదేశంలోని మధురానగరంలో "ద్రవిడ సంఘం" అనే పేరుతో ఒక విద్వత్సమితి ఉంటూండేది. ఆ సమితిలో సభ్యులైన విద్వాంసులు ఉత్తమ కవినీ, అతని కృతినీ ఆ సంఘం పూజించే ఒక బంగారు పీఠం మీద ఉంచి కనకాభిషేకం చేస్తూండేవారు. బహుశా సుందరపాండ్యుని కృతికి అలాంటి సత్కారము జరిగి ఉంటుంది. దానినే కవి ఇక్కడ సూచించి ఉంటాడు. అందుచేత ఇది "ద్రవిడ సంఘం" ప్రచారంలో ఉన్నప్పుడు రచించిన కృతి అయి ఉంటుందని చెప్పవచ్చును.

కుమారిలభట్టు తంత్రవార్తికంలోను, శంకరభగవత్పాదులు శారీరక భాష్యంలోనూ ఉదాహరించిన మీమాంసాగ్రంథం రచించినవాడు ఈతడే అయి ఉంటాడు. ఇతడు భగవత్పాదాచార్యులకంటె ప్రాచీనుడై ఉండడమే ఈ విధంగా (ఈ సుందరపాండ్యుడూ ఆ సుందరపాండ్యుడూ ఒకడే అని ) ఊహించడానికి కారణం. మరొకకారణ మేమిటంటే - ఈ కవికృతి ప్రారంభంలో "శ్రీమాన్ సున్దరపాణ్డ్యః శ్రుతిస్మృతి ప్రసృతసత్పదార్థజ్ఞః " అని వ్రాస్తూ - తాను శ్రుతిస్మృతి ప్రసృతసత్పదార్థజ్ఞః" అనే విశేషణాన్ని బట్టి ఈ కవి మీమాంసాశాస్త్రంలో నిష్ణాతుడని తెలుస్తూన్నది. ఈ ప్రమాణాలన్నింటినీ పట్టి చూడగా మీమాంసా శాస్త్రగ్రంథం రచించినవాడూ, ఈ 'ఆర్య'ను రచించినవాడుకూడా ఒక్కరే అనీ, ఇతడు క్రీ.శ. షష్ఠశతాబ్దికి పూర్వము ఉండేవాడనీ స్పష్టం అవుతున్నది.

అనేకమైన పంచతంత్రాదిగ్రంథాలలో ఈ ఆర్యలను ఉదాహరించ డాన్ని పట్టి చూస్తే పూర్వకాలంలో ఇది ఎంత బహుళప్రచారంలో ఉండేదో విశదం అవుతున్నది. ఈ ఆర్యలకు మూలగ్రంథం ఏదో తెలియకపోయినా, చాలామంది ఆధునికపండితులు కూడా పంచతంత్రభోజప్రబంధాదులలో పరిచయం ఉండడంచేతనూ శ్రుతానుశ్రవికచేతనూ కూడా సహృదయగోష్ఠులలో

ఈ ఆర్యలను ఉదాహరిస్తూ ఉంటారు. వజ్రపు తునకల వలె ఊర్జస్వలాలైన ఇందలిపద్యాలు తేనెలో ఊరబెట్టిన అల్లపు ముక్కల వలె కటు-మధురాలుగా, పథ్యంగా హృద్యంగా - ఉంటాయి. అందుచేత ఇవి సహృదయ హృదయావర్జకాలుగా ఉంటాయని సంతసిస్తున్నాము.

కొందరు ప్రాచీనాంధ్రకవులు కూడా ఈ ఆర్యలను అనువదించి తమ గ్రంథాలలో పొందుపరచుకొన్నారు. క్రీ.శ. 1300 ప్రాంతానికి చెందిన మంచనకవి, రాజశేఖరుని 'విద్ధసాలభంజిక' ను అనుకరించి రచించిన 'కేయూరబాహుచరిత్రం' అనే రసభరితమైన ఆంధ్రప్రబంధంలో ఇందులోని రెండు ఆర్యలను రెండు పద్యాలుగా అనువదించాడు.

క్రీ. శ. 1400 ప్రాంతానికి చెందిన కవిసార్వభౌముడు శ్రీనాథుడు కూడా ఒక ఆర్యని అనువదించి భీమఖండంలో ఉపయోగించుకున్నాడు. అతని పద్యం ఇది :-

తే. నికటమున నుండి శ్రుతిపుటనిష్ఠురముగ
నదరి కాకులుచేరి బిట్టరచునపుడు
ఉడిగి రాయంచ యూరక యుంట లెస్స
సైపరాకున్న నెందేని జనుట యొప్పు.[1] (చూ. శ్లో. 113)

1 నా ఉపోద్ఘాతాన్ని పరిశీలించిన తరువాత, మా మిత్రులు బ్రహ్మశ్రీ మా. రామకృష్ణ కవి మహాశయులు వ్రాసిన ఆంగ్లోపోద్ఘాతంలో, ఈ సుందరపాండ్య కృతి షష్ఠశతాబ్దికి పూర్వమే రచింపబడినది అని చెప్పడానికి మరొక ప్రమాణంగా జనాశ్రయుని "జానాశ్రయి" అనే ఛందోగ్రంథంలో పథ్యాలక్షణంలో, "చారిత్రనిర్మల జల" అనే (ఈ గ్రంథంలోని) ఆర్యను (24) ఉదాహరించడం చూపబడినది. మా మిత్రుని ఊహ సత్యమే. ఆ జనాశ్రయుడు కృష్ణాతీరాంధ్రదేశాన్ని పాలించిన మాధవవర్మ అనే నామాంతరం గల విష్ణుకుండిన వంశీయుడైన రాజై ఉంటాడు. అతడు క్రీ.శ. 580 కి పూర్వం ఉన్నవాడు. ఈ 'జానాశ్రయి' ప్రారంభంలో ఉన్న -

"స భూపతిరుదారధీర్జయతి సమ్పదేకాశ్రయో
జనాశ్రయ ఇతి శ్రియా వహతి నామ సార్థం విభుః
మఘై రురుభి రద్భుతైర్మఘవతో జయశ్రీరపి
జితా విజితశత్రుణా జగతి యేన రుద్ధా చిరమ్"

( మిగతా ప్రక్క పేజీలో)



నీతిద్విషష్టిక' అనే పేరుతో 116 ఆర్యలు ఉన్న పుస్తకం ఒకటి చెన్నపుర ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో ఉన్నది. అందులో లేఖక ప్రమాదాలూ, గ్రంథపాతాలూ కూడా చాలా ఉన్నాయి. దానికి ఒక పుత్రికను (కాపీ) సంపాదించి, దానిని యథామతిగా సంస్కరించి, ప్రచురించడానికై, మా మిత్రుడు, బహు సంస్కృతాంధ్రగ్రంథప్రకటన ప్రఖ్యాతకీర్తి, శ్రౌతస్మార్త గ్రంథాలసంధానమూ, వాటికి టీకా వివరణాదిరచనమూ, సంస్కరణము, ప్రకటనమూ మొదలైన సత్కార్యాలలో ఆరితేరినవాడూ అయిన బ్రహ్మశ్రీ కనుపర్తి మార్కండేయశర్మ ప్రారంభించాడు. ముద్రణకార్యం సగం పూర్తి అయింది. ఇంతలో మిత్రులద్వారా ఈ విషయం తెలిసి, చెన్నపుర రాజకీయ శాసన పరిశోధకశాలాధికారులలో ఒకరైన శ్రీ ఏ. యస్. రామనాథయ్యర్ మహాశయులు తమకు తిరువనంతపూర్ రాజకీయ పుస్తకశాలలో లభించిన, వేరే మాతృక గల మరొక పుస్తకం మాకందజేశారు. దీనిపై అక్కడి అధికారులు 'ఆర్యావలీ' అనే పేరు వ్రాసి ఉన్నారు. ఇందులో 33 ఆర్యలు అధికంగా ఉన్నాయి. లేఖక ప్రమాదాలూ, పాఠాలూ కూడా చాలా వరకూ ( మాకు అంతకు పూర్వం లభించిన ప్రతితో) సమంగానే ఉన్నాయి."కులశేఖరసూక్తి

అనే శ్లోకాన్ని బట్టి ఈ ఛందో గ్రంథం రచించిన జనాశ్రయుడు ఎన్నో మహాయజ్ఞాలు చేసినట్లు తెలుస్తూన్నది. పులిబూరు శాసనం కూడా ఈ విషయానికి సమర్థకంగా ఉన్నది.- "క్రతుసహస్రయాజీ, హిరణ్యగర్భప్రసూతః, ఏకాదశాశ్వమేధావబృథస్నానవిగతజగదేనస్కః, సర్వభూతపరిరక్షణచుఞ్చుః, విద్వజ్జనతపస్విజనసమాశ్రయో, మహారాజశ్రీమాధవవర్మా..... జనాశ్రయ మహారాజః గుద్దవాడ విషయే" ఇత్యాదికము. ఈ శాసనాన్ని బ్రహ్మశ్రీ పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి గారు ప్రకటించారు. ఈ తామ్రశాసనం కాలం క్రీ. శ. 609 అవుతుంది. ప్రసంగరత్నావళిలో ఈ క్రింది శ్లోం ఉన్నది.

("నీల?) శ్రీమచ్ఛకాబ్దేబ్ది శశిసాయక (514 శతాబ్దం, 592 క్రీ.శ) సమ్మితే[1]
రాజామాధవవర్మాభూ ద్విఖ్యాతో ధరణీతలే"

(సుమతి శతకంలోని "కమలములు నీట బాసిన" అన్న పద్యం అనుబంధంలోని 15వ పద్యానికి అనువాదం అనికూడా కవిగారు వ్రాసినారు. సంపాదకుడు)

1. సంస్కృతోపోద్ఘాతంలో ( 514 A D 192 ) సమ్మితే అనేది ముద్రణ దోషమై ఉంటుంది ( సంపాదకుడు).

రత్నహారాన్ని" గూర్చీ, అందులో సుందరపాండ్యుని ఆర్య ఉదాహరింపబడడాన్ని గూర్చీ వారి ద్వారానే మాకు తెలిసినది. అధికంగా లభించిన ఆర్యలను గ్రంథాంతంలో అనుబంధంగా చూపించి ఉన్నాము. గ్రంథాద్యంతశ్లోకాలలో ఈ కృతికి "ఆర్యా" అనే పేరు మాత్రమే కనబడుతూన్నది. చెన్నపుర పుస్తకశాలలోని తాళపత్రపుస్తకానికి, ఎవరోలేఖకుడు, తన కెక్కడో అరవై రెండు శ్లోకాలు మాత్రమే లభించడంచేత "నీతిద్విషష్టికా" అనే పేరుపెట్టి ఉంటాడు. తలవని తలంపుగా లభించిన ఈ సహాయానికి, ఉపోద్ఘాతం వ్రాస్తున్న నేనూ, ఈ గ్రంథాన్ని ప్రచురిస్తూన్న మా మిత్రుడూ కూడా సుహృద్వరులైన బ్రహ్మశ్రీ రామనాథఅయ్యరుగారికి, సంతోషంతో, కృతజ్ఞతను తెలుపుకుంటున్నాము. మా మిత్రుడైన మార్కండేయశర్మ, ఇంతకు పూర్వం చాలా అవసరమైన అనేక గ్రంథాలు ఆంధ్రలిపిలో ప్రచురించి ఉన్నాడు. ఇటుపైన ప్రఖ్యాతులైన ఆంధ్రులు రచించిన గ్రంథాలను ప్రప్రథమంగా నాగరీలిపిలో ప్రచురించడం జరుగుతుంది. ముద్రించడంలో అవకాశం ( Space ) ఇచ్చే పద్ధతిని ఆంధ్రముద్రణ సంప్రదాయం ప్రకారం అనుసరించినాము. సహృదయులు ఈ పద్ధతిని మెచ్చుకొనే పక్షంలో ఇటుపైన కూడా ఈ పద్ధతినే అనుసరిస్తాము. దీన్ని నిర్విఘ్నంగా నిర్వహించేటట్లు సర్వేశ్వరుడు అనుగ్రహించుగాక అని అభిలషిస్తూన్న :

విద్వద్విధేయుడు

చెన్నపురి వే. ప్రభాకరశాస్త్రి

( నీతి ద్విషష్టిక - ఉపోద్ఘాతము ( 1928 -సంస్కృతము)
శ్రీ ప్రభాకరుల రచన (సంస్కృతోపోద్ఘాతమునకై చూ. పరిశిష్టము).
అనువాదము– డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడుగారు ( 1981).

– సంపాదకులు)

" వేటురివారి వ్యాఖ్యలును పీఠికలున్ దెనుఁగుం బొలంతికిన్
బేటులురేగు గంధవొడివెట్టిన పూఁతలు నంతయయ్యు వా
రేటికొ వట్టి పేదతనమే భజియింతురు నెంతయయ్యు నో
నాటకు నెక్కుటో తెలుఁగునాటికి నాఁటికి నాఁటి కక్కటా !

తెలుఁగును బహుమార్గంబుల
వెలిఁగించెదు నట్టిదొరలు పిండీకృతశా
టులవోలె బండ లెక్కఁగఁ
గొల నీదును బాతు లంచకొలములభాతిన్

–కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ
"త్రిశూలము" నాంది నుండి.

## ప రి శి ష్ట ము

# కర్ణ భారము

### తొలిపలుకు

పూవును మీఱి తొడిమ యుండరాదు. ఇంత కొండిక రూపమునకు మెండగు పీఠిక యందగింపదు.

ఈ కర్ణభారమున యందలి వస్తుసంవిధానము, భాసునకుఁ దరువాత వెలసిన కాళిదాస భవభూతి ప్రభృతుల రూపకము లందలి యేకాంక వస్తుసంవిధానమునకు సరివచ్చుచున్నది. ఈ రూపక మొక్క యంక మనియే నుదువనగు. భాసుని రూపకములందిట్టివి మఱి నాల్గు గలవు. నాల్గును వెనువెంటనే ప్రచురింపనున్నాఁడను. అవి యింతకంటెఁ గొంత పెద్దవి. జామదగ్న్య శాపప్రకారము, కవచకుండలహరణము, నిందతినిపుణముగా సవరింపఁబడినది. కాని, తగినంత కథా సంవిధానము కానవచ్చుట లేదు. కొంత గ్రంథభాగము లోపించియుండునో !

మదరాసు — వేటూరి ప్రభాకరశాస్త్రి

( 1913)

# మధ్యమవ్యాయోగము

## తొలిపలుకు

ఈ కొండికరూపమునఁ జమత్కృతి మెండుగనే కలదు. ఘటోత్కచుడు, హిడింబ, భీముడు, నను భారతకథలోని పాత్రములఁబట్టి యీ కథ వింతగా సంతరింపఁబడినది. కడపట, భీముని "హిడింబా ! ఏమిది? " యను ప్రశ్నముపై హిడింబ "దీనికోసమే" అని కర్ణమునఁ బల్కినపల్కు, ఈ రూపకమందలి సంవిధాన చమత్కారమునకుఁ జీవగఱ్ఱ. సహృదయులు సర్వము గుర్తింపఁగల్గుదురు ఇట్టి లఘుసంవిధానమును, జమత్కారమును, గల రూపకములను దర్వాతి కాళిదాసాది కవు లేల యుజ్జగించిరో గదా! ఇందు స్వారస్యమునకు భాసమహాకవిని మెచ్చుఁదు; వైరస్య మొదవెనే నాయది నాయది;

క్షమింపుఁడు.

మదరాసు — వేటూరి – ప్రభాకరశాస్త్రి

(1913)

# చాటుపద్య మణిమంజరి

## తొలిపలుకు

## (ప్రథమ భాగమున)

తీరుతీయములుగల భాషా వాహినియందు సుకవుల కవితామృతము ప్రబంధరూపమున కాక చాటురూపముననును జాలువాఱును. వీనులకు విందులై డెందమును దనుపార్చుచుఁ జాటురచనము లొక్కొకయెడఁ ప్రబంధరచనముల సయితము మీఱియుండునని చెప్పుట భాషావేదుల కనుభవపునరుక్తమగును. గ్రంథములుగా నేర్పడమిచేఁ దొల్లింటి యాంధ్ర కవీశ్వరులు రచించిన చాటుపద్యము లెన్నేని యునికి తప్పినవి. పరంపరాగతములగుచుఁ గొన్ని పల్లెటూళ్లలో ముదుసళ్ల నోళ్లయందును మఱికొన్ని పురువులకు భుక్తులువెట్టు ప్రాచీనతాళపత్ర సంపుటములందును జీర్ణించుచున్నవి. ఇంపారు నిట్టిపద్యముల సంపాదించి గ్రంథరూపమున వెల్వరింపఁ దలంపుగొని యెఱిఁగినవారినెల్ల నడిగియు దొరకిన తాళపత్ర సంపుటమెల్లఁ బరిశీలించియు నానాఁటఁ గొన్నిచాటువులఁ గూర్చితిని. హైందవసారస్వతమునకు గని యనఁదగు చెన్నపురపు లిఖితపుస్తక భాండాగారము పెక్కుపద్యరత్నముల నొసఁగినది. మఱికొన్ని ముద్రిత గ్రంథములనుండియు సేకరించితిని. రాజులనుగూర్చి, రాజమంత్రులనుగూర్చి, కవీశ్వరులనుగూర్చి, నీతి శృంగార హాస్యాదివిషయములం, దింక ననేకవిషయములందుఁ, బలుదెఱఁగుల సమకూఱిన పద్యములలోఁ బెక్కింటి నేఁటి కాలపు మర్యాద నతిక్రమింపకుండ సవరించియు వీడనాడియు రత్నములనఁదగినవాని కథాసందర్భములఁ జేర్చి గ్రంథరూపమున సమకూర్చితిని. శృంగారవిషయము మిక్కిలి మెలఁకువతో నిర్దుష్టపఱిచితిని. కొన్ని పద్యములు సందిగ్ధార్థములయినను జరిత్రకారులకుఁ జిక్కుకల్గునని మార్పుసేయకయ ముద్రించితిని. నేఁటికవుల చాటువులఁ జేకొనలేదు. ప్రాచీనకృతులందలి పద్యము లేవేని యిందుఁ జేరినచో గుర్తింపలేని నా యపరిజ్ఞానమును క్షమింపవేఁడెదను. కొన్ని శతకములందలి పద్యము లిందుఁ జేర్చితిని. ప్రాచీనములగు నా శతకము లిప్పుడు కొన్ని దుర్లభములు. సహృదయుల కియ్యది యింపు నింపు ననియే నా తలంపు.

చెన్నపురి
13-8-13. — వేటూరి ప్రభాకరశాస్త్రి

(1913)

# ద్వితీయ భాగము

ప్రథమ భాగమును గూర్చినప్రకారమునే యీ ద్వితీయ భాగమును గూడఁ గూర్చి సహృదయులకు సమర్పించుకొన్నాఁడను. ఇట్లే మఱికొన్ని భాగములనుగూడఁ గూర్పఁగల్గుదునో !

చెన్నపురి
దుందుభిజ్యేష్ఠము                                        వేటూరి ప్రభాకరశాస్త్రి.

(1922)